# హాసం
హాస్య-సంగీత పత్రిక


## ఇవీ సంగతులు
63

**Also available on net:**
**www.haasam.com**

**ముఖచిత్రం**
'పెదబాబు' చిత్రంలో
కళ్యాణి







**'సెంటర్ స్ప్రెడ్' లో**




సినిమా పాటల ప్రత్యేకం












**పాటల ప్రత్యేకం**
69
70
71
72
73
పేజీల్లో






**16-30** ఏప్రిల్ సంచిక 'కొమ్మా కొమ్మా కోకిలమ్మ' వ్యాసంలో - 'పెళ్ళిచూసిచూడు' లో జి.వరలక్ష్మి పాడకపోవడానికి కారణం-ఆ పాత్రకి ముందుగా అంజలీదేవిని అనుకున్నారు. ఆమెతో మాటలు కూడా అయినాయి. కానీ షూటింగ్స్‌కి వచ్చేసరికి, ఆమె అప్పుడు తమిళచిత్రాల్లో బాగా బిజీగా వుండడం వల్ల కుదరలేదు (ఈ మాట అంజలీదేవి గారే చెప్పారు) ఆ లోగా పాటలు రికార్డ్ చేసేశారు. అంతేగాని, జి. వరలక్ష్మి రాయలసీమ కరువునిధికి వెళ్ళిపోవడం వల్ల కాదు. అసలు, రాయలసీమ కరువునిధికి వెళ్ళినది 'పెళ్ళిచేసి చూడు' చిత్రం విడుదల తర్వాతనే.

30వ పేజిలో, పైన బాక్స్, శుద్ధసారంగ్, మిశ్రశుద్ధసారంగ్ రాగాలలో వచ్చిన సినిమా పాటలు కొన్ని ఇచ్చారు. 'వెంకటేశ్వర మహత్యం' లోని 'ఎవరో తానెవరో, ఆ నవమోహిని ఎవరో' కూడా ఈ రాగానికి చెందినదే. అయితే, 'జయ జయ జయ శారదా' (మహాకవి కాళిదాసు) పాటని స్వరపరిచిన పెండ్యాలగారే, 'ఎవరో తానెవరో' బృందావన సారంగ రాగం అని చెప్పారు. ఆ పాటల కాసెట్‌మీద కూడ ఆ రాగం పేరేవుంది. బాలమురళీకృష్ణగారి 'పాప్యులర్' తిల్లానా కూడా 'బృందావన సారంగ' అనే వుంది. కాని, ఈ తిల్లానా రాగానికీ, పై పాటలకీ స్వరప్రస్తారంలో తేడా కనిపిస్తుంది. 'సారంగ' స్ఫూర్తితో వచ్చిన ఈ రాగాల పేర్లలోని గంద్రగోళాన్ని విద్వాంసులే విడమర్చి చెప్పాలి.

**- రావి కొండలరావు, హైద్రాబాద్.**

శ్రీ భువనచంద్రగారు 'మా ఆవిడింతే..'లో సున్నితమైన హాస్యాన్ని అందిస్తున్నారు. సజీవపాత్రల మధ్య సహజ సన్నివేశాలతో అంతర్లీనంగా హాస్యం జనియించాలి. భానుమతిగారి అత్తగార్లా, భువన చంద్రగారి ఆవిడ! తెలివిగా నలిగిపోతున్నట్లు నటించే తెలివైనరచయిత శ్రీ భువన చంద్రగారు వాళ్ళవిడ పెట్టే బాధల్ని (?) యింకా భరిస్తూ మమ్మల్ని ఆనందింపజేస్తూ - పదికాలాలపాటు ఈ హాస్యమాలికను కొనసాగించాలని కోరుకుంటున్నాను.

**- ఎ. సుబ్బారెడ్డి, బిక్కవోలు, తూ.గో. జిల్లా**

నేను సుమారు 2సం॥ల నుండి 'హాసం' పత్రిక చదువుతున్నాను. అందులో ప్రత్యేకంగా ఫలానా శీర్షిక బాగుంది అని చెప్పటం చాలా కష్టం. ఎందుకంటే ప్రతి శీర్షిక మిస్ కాకుండా చదివి తీరాల్సిందే. సాంగులే బంగారు రాజా, భువన చంద్రగారి కథలు, సింగీతం శ్రీనివాసరావు గారు వ్రాస్తున్న క రాజు కథలు, వేటూరిగారు సినీ ప్రముఖుల గురించి వ్రాస్తున్న వ్యాసాలు ఒకటేమిటి అన్నీ చాలా బాగుంటున్నాయి. పాత చిత్రాలు అన్నా, పాత పాటలు అన్నా నాకు చాలా ప్రాణం. పాత పాటల గురించి కథతో సహా చక్కగా వివరిస్తున్నారు. నిజంగా 50సం॥లు క్రితం నాటి చిత్రాలు గురించి ఇంత చక్కటి వివరాలు అందించటం అంత తేలికైన పని కాదు. యిప్పటికే చాలా పేరు సంపాదించుకున్న మీ పత్రిక యింకా అంచెలంచెలుగా ఎదగాలని ఆశిస్తూ....

**- వరదా సాయికుమార్, పర్లాకిమిడి, ఒరిస్సా.**

'హాసం' పత్రికలో మీరు ఇచ్చిన పాటలు చాలా తక్కువగా వున్నాయి. పాటల సంఖ్య పెంచితే బాగుంటుందని నా ఆశ. పాత సినిమా మనోరమ పాటలు నాకు తెలియదు. అసలు ఎప్పుడు వినలేదు చూడలేదు. ఆ పాటలు చదువుతుంటే ఎట్లా పాడాలో కూడా తెలియదు కాని చాలా బాగున్నాయి. ఒక పాట చాలా బాగా నచ్చింది. పత్రిక సకాలంలో అందిస్తున్నందుకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

**-సి.వి. యస్. మాధవి, బాపట్ల.**

'మీకు 'కొరియర్' అన్నమాట కాసేపు నన్ను ఆలోచనలలోనికి తీసుకువెళ్ళింది. ఎవరు పంపారు? ఏమిటీ అని? తీరాచూస్తే నా అభిమాన 'హాసం' అందించిన 'కానుక', ఉత్తరం. భగవంతుడు మానవ జన్మనిస్తే.... తలిదండ్రులు, గురువులు ఓ మనిషిగా మలిస్తే, 'హాసం' నాకు బహుమతి ఇచ్చి ప్రోత్సహిస్తే ఈ జన్మకు ఇంకేం కావాలి!? నిజంగా మీకు ధన్యవాదాలు. మీకు, 'సోహన్' వారికి, కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

**- పురాణ పండ శ్రీకృష్ణ, కాకినాడ.**

భువనచంద్ర గారు 1-15 ఏప్రిల్ సంచికలో తన మతిమరుపు గురించి చెబుతూ 'మరి మీ ఆవిడో?' అని అడిగారు ఎప్పటిలాగానే! నా సంగతి ఏం చెప్పమంటారు- ఆ మధ్య ఒకరోజున నేను హాస్పిటలు నుండి ఇంటికి వెడుతూ మా ఆవిడ పిన్నిగారి వేలు విడిచిన మేనత్తగారి దగ్గర బంధువు ఒకావిడ చేతిలో చిన్నసంచితో బయటకు వస్తూంటే 'అప్పుడే వెళ్ళిపోతున్నారా' అని అడిగి ఆవిడ చేతిలో సంచితీసుకున్నాను - అభిమానంతో కన్నా, మా ఆవిడ బంధువులపట్ల ప్రీతిని ప్రదర్శించడానికి. "అవును 'గోదావరి' కి వెడుతున్నారు" అంది మా ఆవిడ.

పెద్దావిడన్న సానుభూతితో 'రండి నేను దింపుతా'నని కారులో ఎక్కించుకుని బహు జాగ్రత్తగా ఏటిగట్టున దింపాను. పుష్కరాల రోజులు కదా కాసిని గోదావరి నీళ్ళు నెత్తినజల్లుకోవడానికేమోనన్న ఉద్దేశ్యంతో. బిక్కమొహం వేసుకుని ఇబ్బందికరమయిన మొహమాటంతో మాట్లాడకుండా ఆవిడ దిగిపోయినపుడు నాకర్థం కాలేదు. తరువాత రెండు రోజులు మా ఆవిడ చేతి వంటకాలనిండా కారం నా నషాళానికి అంటి కళ్ళంట నీరు తిరిగిన తరువాత అర్థమయింది -పెద్దావిడ వెళ్ళవలసింది గోదావరి ట్రయినుకని! నా 'ఏ(?) మరుపు'కి మా ఆవిడ రియాక్షన్ కన్నా మీ 'మతిమరుపు'కి మీ ఆవిడ కూల్ అండ్ సైలెంట్ రియాక్షనే మిన్నండీ భువనచంద్రగారూ!

**-డా॥ వి. శేషగిరిరావు,రాజోలు**

1-15 ఏప్రిల్ 2004 సంచికలో నా జోక్స్ వేసినందుకు చాలా,చాలా ధన్యవాదాలు. నేను పత్రిక పొద్దున తెచ్చుకుంటే, మధ్యాహ్నం కొరియర్‌లో సి.డి. వచ్చింది. సి.డి. అంత తొందరగా రావడం నాకు ఆశ్చర్యమేసింది. "జై" పాటలు కూడా బాగున్నాయి. పత్రిక నూతనంగా ఉండటం వలన అందరిని ఆకర్షిస్తుంది. ఉత్తరంలో రాజాగారి సంతకం బాగుంది.

**- జి. శ్రీనివాస్, హైదరాబాద్**

నేను 'హాసం' వీరాభిమానిని. బెంగుళూరులో జరిగిన ఒక తెలుగు అసోసియేషన్ వార్షికోత్సవ సందర్భంలో మొట్టమొదటిసారిగా మీ 'హాసం' పత్రికను చూడడం తటస్థించింది. తర్వాత ఆ పత్రిక నాకు దొరకలేదు. మావారు ఉద్యోగ రీత్యా కలకత్తాలో వుంటున్నారు. ఆయన అక్కడ కొని బెంగుళూరుకు వచ్చినప్పుడు నాకు తెచ్చి ఇస్తుంటారు. మార్చి 1-15, 2004 సంచిక యీ మధ్యనే చూడడం తటస్థించింది. అందులో 'ఆపాత/ట మధురం' శీర్షికలో 'సీతారామ కళ్యాణం' చిత్రంలోని 'జగదేకమాతాగౌరి' అనే పాటను ప్రస్తావిస్తూ రాజాగారు యిప్పటికీ కొంతమంది స్త్రీలు పండుగలప్పుడు యీ పాటను యథాతథంగా పాడుకుంటూంటారు అని రాసారు. ఇది చదవగానే నా మనస్సు జ్ఞాపకాల తెరలను చీల్చుకుని గతంలోకి వెళ్ళి ఒక సంఘటనను వెలికి తీసుకొచ్చింది. నా చిన్నతనంలో 'పుత్తూరు' లో చదువుకుంటున్నప్పుడు మాకు ' రుక్మిణీ కళ్యాణం' పద్యపాఠం వుండేది. అందులో 'నమ్మితి నా మనంబున' అనే పద్యం గురించి చెబుతూ మా తెలుగు మాస్టారు యీ పద్యం ఆడపిల్లలు రోజూ చెప్పుకోవచ్చు, చాలా మంచిపద్యం కానీ హరింబతి చేయుమమ్మ, అనే చోట 'ననున్ కృప చేయుమమ్మ' అని ఎవరికి వారు చెప్పుకోండి అన్నారు. అప్పట్నుంచీ చాలా ఏళ్ళు అలాగే చెప్పుకునేదాన్ని. తర్వాత అది మరుగున పడిపోయింది. ఇపుడు మీ ఆర్టికల్ చూసిం తర్వాత గుర్తుకు వచ్చింది. ఇలా మా తీయటి జ్ఞాపకాలను, బాల్యస్మృతులు వెలికి తెస్తున్న మీ 'హాసం' కు మెనీ మెనీ థ్యాంక్స్.

- సరళా నాగరాజు,బెంగుళూర్.

(బెంగుళూరులో కూడా ఏజంటు ద్వారా 'హాసం' లభిస్తుంది. వివరాలకు 080- 26707843కు ఫోన్ చేయండి - ఎడిటర్)

సంపుటి: 3 సంచిక:15
1-15 మే 2004
పేజీలు: 76
విడి ప్రతి : రూ. 10-00
సంవత్సర చందా: రూ. 200
విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50
జీవిత చందా: రూ. 2000
విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

63

కొత్తగా మార్కెట్‌లోకి ప్రవేశించేటప్పుడు తమను తాము ఏ విధంగా ప్రతిపాదించుకోవాలి, ప్రజల దృష్టిని ఏ విధంగా ఆకర్షించుకోవాలి అని చర్చించుకోవడం జరుగుతుంది. మనం లక్ష్యంగా ఎంచుకున్న పాఠకుల, శ్రోతల, లేదా ప్రేక్షకుల మనసులలో మనను పొజిషన్ చేసుకోవడం ఎలా? అనేది తేల్చుకోవడం అంత సులభం కాదు. మనకంటూ ఒక ప్రత్యేకత ఉండాలి. అది మనం నమ్మిన సిద్ధాంతాలకు అనుగుణంగా ఉండాలి. దాన్ని మనం ఆచరించగలిగి ఉండాలి. ఆ మార్గంలో ఎదురయ్యే కష్టనష్టాలకు సిద్ధమై ఉండాలి.

మార్కెట్‌లో అప్పటికే స్థిరపడిపోయిన ట్రెండ్స్ కొన్ని వుంటాయి. ఆ ధోరణులకు అనుగుణంగా వాటిని నకలు చేస్తూ వెళ్లిపోవడం ఒక తీరు. పదిమంది నడిచిన బాట కాబట్టి పయనం సుగమంగానే ఉంటుంది. కానీ చివరికి మనం కూడా పదిమందిలో ఒకరిగానే మిగులుతాం. కొత్తపుంతలు తొక్కేవాళ్లు నేర్పుగా ముళ్లు తొలగించుకుంటూ ఓర్పుతో ప్రయాణం సాగించాల్సి వుంటుంది.

హీరోయిన్స్ అంటే గ్లామర్‌డాల్స్ తప్ప వేరేమీ కాదు అనుకునే రోజుల్లో ప్రేక్షకులను నటనతో ఆకట్టుకోవాలని చూడడం సాహసమే! కానీ సౌందర్య ఆ సాహసం చేసింది. గ్లామరస్‌గా కనబడుతూనే వలువలను, విలువలను కాపాడుకుంది. అందుకే ఆమె మృతి తెలుగుప్రేక్షకులను అంతగా కదిలించింది. ఒక కుటుంబసభ్యురాలు పోయినట్టు అందరూ ఫీలయేరంటే దానికి కారణం ఆమె అకాల, బీభత్స మరణం ఒక్కటే కాదు, ఆమెకున్న ఫ్యామిలీటైపు ఇమేజే! ఆమెతోబాటు తెరకు వచ్చిన అనేకమంది నాయికలు 'ఈకాలంలో మడిగట్టుకు కూచుంటే లాభంలేదు' అనుకుంటూ పరిస్థితులతో రాజీపడే సమయంలో ఆమె తన పద్ధతికి కట్టుబడి భీష్మించుకుని కూర్చుంది.

మనిషి పోయాకనే వారి విలువ తెలుస్తుందంటారు. ప్రస్తుతం ఆమె నెంబరు వన్ స్థానంలో లేకున్నా సౌందర్య దుర్మరణం వార్త పతాకశీర్షికలకు ఎక్కడం - అదీ ఎలక్షన్ టైములో - ఒక విషయాన్ని చాటి చెబుతోంది - తాత్కాలిక ఆనందం కోసం ప్రేక్షకులు ఎక్స్‌పోజ్ చేసేవారిని ఆదరించవచ్చు. కానీ వారు అభిమానించేది, గౌరవించేది విలువలను గౌరవించేవారినే!

విశృంఖలత ఎక్కువ అనుకునే అమెరికాలోనే ప్రజలు తమ అధ్యక్షుడి శృంగారకేళిని నిరసించారు. ఇక భారతీయుల సంగతి వేరే చెప్పాలా? అందుకే తెరపై, తెరవెనుక హుందాగా ప్రవర్తించిన సౌందర్య అందరికీ అభిమాన పాత్రురాలయింది. విస్కీవ్యాపారంలోలా పాలవ్యాపారంలో త్వరితంగా లాభాలు రాకపోవచ్చు. కానీ పాలు అమ్మేవారి మార్కెట్ నిలకడయినది, గౌరవప్రదమైనది.

అగ్రస్థానం సౌందర్యను వరించి రాలేదు. ఆమె చిన్న సినిమాలకే, చిన్న హీరోలకే పరిమితమయి వుండిపోయేది, లేదా సినీరంగాన్ని వదిలిపెట్టి వెళ్లిపోయేది, ఫ్యామిలీ ఎంటర్‌టెయినర్స్‌పై నమ్మకం కలిగిన ఓ నిర్మాణసంస్థ ఆమెను ఆదరించకపోయివుంటే, ప్రోత్సహించకపోయి వుంటే! ఆ సమయం వచ్చేవరకు కాచుకోవడంలోనే ఉంది ఆమె గొప్పతనం! అందువల్లనే ఎవరికీ లభించనంత ఖ్యాతి, గౌరవం ఆమెకు లభించాయి.

ఈ సందర్భంలో జంధ్యాలను కూడా స్మరించుకోవాలి. మరణించేనాటికి ఆయన సినిమాలు తీయటం లేదు. అయినా ఆయన అకాలమృతి చిత్రరంగాన్నే కాదు, మామూలు పౌరుడిని సైతం కంట తడిబెట్టించింది. అసభ్యత లేని, ఆరోగ్యకరమైన కుటుంబ తరహా హాస్యచిత్రాలు తీయడం వల్లనే ప్రేక్షకుల హృదయపీఠికపై ఆయనకా స్థానం దక్కింది. మంచి సినిమా అనగానే విజయావారి సినిమాలే గుర్తుకువస్తాయి. అవి కుటుంబంలో యావన్మందీ కలిసి చూసి ఆనందించేవి కాబట్టి! 'ఎ' సర్టిఫికెట్టు సినిమాలు అప్పటికప్పుడు సొమ్ము చేసుకునేవే కాని పదికాలాలపాటు గుర్తుండేవి కావు, గుర్తుపెట్టుకునేవి కావు.

సినిమాలే కానీ, కళాకారులే కానీ, పత్రికలే కానీ - అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ మొత్తం కుటుంబాన్ని అలరిస్తేనే అందరి హృదయాలలో చిరస్థాయిగా నిలబడటం జరుగుతుంది. మళ్లీ వేరే చెప్పనవసరం లేదు - 'హాసం' బాట కూడా అదే!



ప్రముఖ సినీ గీత రచయిత
**శ్రీ భువనచంద్ర**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**మా ఆవిడ ఇంతే మరి మీ ఆవిడ?-8**

# "ఐయామ్ నాట్ ఏన్ ... "ఉత్తమ పురుషన్"

**ఆ**ళ్వార్ తిరునగర్ వెల్ఫేర్ అసోసియేషన్ మెంబర్సంతా కలిసి 'తమిళ్ న్యూయియర్' కి గాను 'ఉత్తమగృహిణి' ఎవార్డుని ఇవ్వబోతున్నారని తెలిసి మా వలసరవాకం 'ఫ్రెండ్స్ అసోసియేషన్' వాళ్ళంతా అర్జంటుగా సమావేశమయ్యారు. 'అవసర' సమావేశం జరగబోతున్నది గాక అందరూ మీటింగ్‌కి రావాల్సిందహో...! వచ్చి తీరాల్సిందే నహో" అని పాంప్లెట్లు -కూడా పంచిపెట్టారు. మా నటరాజనూ, నత్తి నాయరూ ఇంటింటికీ వెళ్ళి 'ఆహ్వానం' అందించారు.

"ఇంతకూ మనమూ 'ఉత్తమగృహిణి' ఎవార్డు ప్రకటించాలా?"అని వాళ్ళు మా యింటికి వచ్చినప్పుడు అడిగా.

"ఆమ సార్...వాండ్ల అసోసియేషన్ కన్నా మనది రొంబా'సీనియర్!" వాండ్లకన్నా ముందు మనమే'అవార్డు' ప్రజంటుచేసి తీరాల !" డిక్లేర్ చేశాడు నటరాజన్.

"అయితే ఆ ఎవార్డేదో మా యింటికొచ్చి నాకే ఇవ్వండి! మళ్ళీ యీ పాంప్లెట్ల ఖర్చూ.. మైకు సెట్ల ఖర్చు ఎందుకూ?" వంటింట్లోంచి మా అందరికీ వినిపించేట్టు అరిచింది మా కూచిపూడిది.

"అహ్హహ్హా...మేడమ్ రొంబస్మార్టు..!" ఇల్లెగిరిపోయేట్టు నవ్వాడు నత్తి నాయర్.

మొత్తం నూటయాభై మంది దాకా వచ్చారు. నేనూ ఓ మూల కూర్చున్నా. మనకి అరవం రాదు గనక 'అరవలేం'! ఇంగ్లీషులో మాట్లాడినా ఎవడూ వినడు. (ఎవడి మాట వాడే వినకపోవటం మా అసోసియేషన్ మెంబర్ల ప్రత్యేకత!)

సో..నేను కేవలం 'ఓటరుని మాత్రవేం. ముందుగా ప్రస్తుత ప్రెసిడెంటు క. వేలాయుధన్ లేచి "ఆళ్వార్ తిరునగర్ వాళ్ళు 'ఉత్తమగృహిణి ఎవార్డు' ప్రకటించారనేది మీకందరికీ తెలుసు. మనమూ అదే ఎవార్డుని వాళ్ళు కంటే ముందే ప్రకటించి..ఆ.తి.నగర్ వాళ్ళకంటే ముందే 'ప్రజంటు' చేసి మన ఘనతని నిరూపించుకుందాం...! దానికి మీ సహకారమూ నలహాలూ కావాలి..!"అని నమావేశాన్ని ప్రారంభంచేశాడు. వెంటనే మాజీప్రెసిడెంటు మాతృభూతం అయ్యంగార్ లేచి "ఈ ప్రపోజల్ని నేను అబ్జెక్టు చేస్తున్నాను!" అన్నాడు.

"ఎందుకు ?"అడిగాడు సెక్రటరీ శివమణి .

"వాళ్ళు చేస్తున్నారని మనం చెయ్యడం పులిని చూసి నక్క వాతపెట్టుకున్నట్లు వుంటుంది గనక...!" జవాబిచ్చాడు మాతృభూతం

"ఎవరయ్యా పులి? ఎవరయ్యా నక్క? ఆ ఆ.తి. నగర్ వాళ్ళు పులులా ? అసలు వాళ్ళ దగ్గర ఏముందని ? ఎవరున్నారని? ప్రసిద్ధి చెందిన వాళ్ళంతా మనదగ్గరున్నారు. అందునా కామకోటీ నగర్‌లో వున్నారు..! ఆలోచించి మాట్లాడు..!"

"ఆమ..!రొంబ జోవియల్...!"ముప్పై పళ్ళూ చూపించాడు నటరాజన్.

(నటరాజన్‌కి యీమధ్యే రెండుపళ్ళు ఊడిపోయాయి.....'మా ఆయనకి జ్ఞానం ఊడిపోయిందని నటరాజన్ పెళ్ళమూ - 'అసలు మా ఆయనకి జ్ఞానమేలేదు....ఉత్తి అజ్ఞాని!.. అందుకే ఆయనకి వున్నవి ఇరవై ఎనిమిదివళ్ళే' అని మా ఆవిడా కలిసినప్పుడల్లా తెగ చెప్పుకుంటారు)

ఏమయితేనేం....! అవసర సమావేశం ఏర్పాటయింది. మిగతా రోజుల్లో అమాయకంగా వుండేవాళ్ళు అదేం చిత్రమో గానీ అసోసియేషన్ మీటింగనేసరికి 'డైనోసార్లయిపోతారు. తెలుగు రాజకీయ నాయకుల్లాగా 'గ్రూపులు'కట్టేస్తారు. ఇక వాద ప్రతివాదాల సంగతయితే చూసి తీరాల్సిందే. ఇండియా పాకిస్తాన్ క్రికెట్ టెస్టు జరిగేటప్పుడు కూడా 'ఇంత' సస్పెన్సు 'ఇంత' హంగామా వుండవు. మీటింగ్‌కి ఆడామొగా

దడదడా మాట్లాడాడు దండాయుధపాణి. మా జనాలందరూ ఆనందంగా చప్పట్లు చరిచారు. నేను 'కొంచెం' సంతోషించా.(గొప్పవాళ్ళల్లో కొందరు (నాలా ) గుహన్‌స్ట్రీట్ లో వున్నారని చెపితే 'ఫుల్'గా సంతోషించేవాడ్ని కాదూ...!)

"మీరేమైనా అనండి! మొదట ఆ 'ఎవార్డు' ఇస్తామని ప్రకటించింది ఆ.తి. నగర్ వాళ్ళు. ఆ విషయం పేపరు చదివే ప్రతివాడికీ తెలుసు. ఆ తరువాత మీ ఇష్టం...!" నిమ్మకి నీరెత్తినట్లు అన్నాడు మాతృభూతం.

జనాలూ ఆలోచనలో సైలెంటయ్యారు. "పోనీ ఓ పనిచేద్దాం..! 'ఉత్తమగృహిణి' ఎవార్డు కాకుండా 'ఉత్తమ స్త్రీ' ఎవార్డుని ప్రకటిద్దాం...!" మధ్యలో దూరాడు నారాయణన్.

"ఉత్తమగృహిణికీ ఉత్తమస్త్రీకీ మధ్య 'పెద్ద'తేడాయేంలేదు..!" తేల్చేశాడు వేలాయుధం.

"సారీ...! ప్రసిడెంటుగారు తమ 'బుర్ర'ని ఇంటి దగ్గరే మరిచిపోయి వచ్చినట్టున్నారు..! ఉత్తమగృహిణి వేరు..ఉత్తమ స్త్రీ వేరు...!! ఉత్తమ

స్త్రీ, ఉత్తమ గృహిణి కావచ్చు.. కాలేకపోవచ్చు! 'ఉత్తమ గృహిణి' మాత్రం ఉత్తమ స్త్రీ అయితీరుతుంది...!" వివరించింది మరకతం అయ్యంగార్.

ఆవిడ మాతృభూతంగారి భార్య. మాంఛి తెలివైంది కూడా! "యూ ఆర్ కరెక్ట్.....!" కొంతమంది స్త్రీలు మరకతంగారికి సపోర్టు చేశారు. "ఇంతకీ నన్నేం చేయమంటారూ?" విసుగ్గా అన్నాడు వేలాయుధం.

"ఉత్తమపురుషన్' ఎవార్డు ప్రకటిద్దాం...!" ప్రపోజ్ చేశాడు శివమణి.

"ఉత్తమ పురుషనా?" ఆశ్చర్యపోయారు స్త్రీలు.

"అవును ..! 'ఉత్తమగృహిణి' ఎవార్డులు ఎన్ని దేశాల్లోనో, ఎన్ని రాష్ట్రాల్లోనో మనం పుట్టక ముందునించీ ఇస్తూనే వున్నారు. 'ఉత్తమ పురుషన్' ఎవార్డు ప్రపంచంలోనే సరికొత్తది..! కేవలం 'మనం' మాత్రమే ఇస్తున్నాం. కనుక ఓ సరికొత్త ఎవార్డు ప్రవేశపెట్టిన ఘనతా దక్కుతుంది...! ఆ ఆ.తి.నగర్ వాళ్ళ మొహం మీద కొట్టినట్టూ వుంటుంది..!!" అత్యుత్సాహంగా అంది శివమణి భార్య.( నాకైతే శివమణీ శివమణి భార్యా యీ విషయంలో 'షరీకై' వచ్చినట్టు అనిపించింది. ఎందుకంటే శివమణి భార్య 'ఇల్లేరమ్మ'లాంటిది! మాంఛి పబ్లిక్ రిలేషన్లు మెయింటైన్ చేస్తుంది. గనక వాళ్ళాయనకే ఆ ఎవార్డు ఇప్పించగలదు.! అదీగాక శివమణి నంబర్‌వన్ భార్యా విధేయుడు!)

"పురుషుల్లో ఉత్తముడెవడండీ?" భళ్ళున నవ్వాడు చిత్తరంజన్ చెట్టియార్. వెంటనే అయిదారుగురు 'ఛీ...ఛీ... అంటూ రుమాళ్ళు తీసి షర్టులూ మొహాలు తుడుచుకున్నారు. (చిత్తరంజన్ చెట్టియార్ కి రెండు మూడు చోట్ల తొర్రి..! ఆయన నవ్వితే జడివాన కురుస్తుంది. అందుకే వాళ్ళావిడ ఏనాడూ ఆయన ముందు నిలబడటంగానీ కూర్చోవడంగానీ చెయ్యదు)

"ఆ విషయం 'మీకెలా' తెలుస్తుందీ?" వెటకారంగా అంది నళినీ అయ్యర్.

"అంటే మా ఆయన 'చవటదద్దమ్మా' అనా?" కయ్యానికి కాలుదువ్వింది శ్రీమతి చిత్తరంజన్.

"అది మాత్రం మీకే తెలియాలి..!" వెక్కిరింపుగా అంది నళిని.

"ప్లీజ్ ...ముందర అసలీ 'ఉత్తమ పురుషన్' అవార్డు ఇవ్వొచ్చా లేదా? ఆ విషయం తేలుద్దాం...!" సర్దుబాటు చేస్తూ అన్నాడు వేలాయుధం.

"ఇవ్వాలి..!ఇవ్వాలీ!" ఉత్సాహంగా అరిచారు పురుషులు.

"అయితే ఎవరికీ?" ప్రశ్నించాడు వేలాయుధం.

"మన సుందరేశన్ యీ ఎవార్డుకి అన్ని విధాలా తగినవాడు..!" సుందరేశన్ వైపు చూస్తూ ప్రపోజ్ చేశాడు నారాయణన్.

"అవును..! మంచివాడూ నెమ్మదస్తుడూ కూడా...!" బలపరిచాడు పిళ్ళే.

సుందరేశన్‌కి ఎనభై ఏళ్ళు వుంటై. కొంచెం కీళ్ళ నెప్పులూ, బట్టతలా తప్ప మిగతా అంతా ఓ.కే.! బీపీ, షుగరూ, కళ్ళజోడూ లాంటి ఎక్స్‌ట్రా క్వాలిఫికేషన్సింకా రాలా. తనకి ఎవార్డనేసరికి సుందరేశన్ మొహం భారతదేశంలా 'వెలిగిపోయింది'! లేచి పళ్ళికిలిస్తూ అందరికీ నమస్కరించాడు.

"ఆయనకి ఎలా ఇస్తారూ? మొగుడు ఉత్తముడో కాదో చెప్పాల్సింది పెళ్ళాం మాత్రమే ...! ఆయన భార్య గతించి పాతికేళ్ళయింది. అసలీ పోటీలో పాల్గొనటానికే ఆయన అనర్హుడు..!" నాలుగో 'లైన్' నించి అరిచింది 'నాచ్చియార్' భార్య.



"పోనీ మన పద్మనాభన్‌కి ఇస్తే?" సజెస్ట్ చేశాడు సెల్వం.

"అయన పనిచేసేది పోలీసు డిపార్టుమెంటులో.. రేపులూ అవీ జరిగేది అక్కడేగా!" తేల్చేసింది శ్రీమతి నటరాజన్.

"అవును..! అ మాటా నిజమే!" చాలామంది స్త్రీలు గొణిగారు.

సమావేశం మొదలై రెండు గంటలైనా'విషయం' ఓ కొలిక్కిరాలేదు. చాలామంది పేర్లు ప్రపోజ్ చెయ్యబడ్డా అనేకానేక కారణాల వల్ల కొట్టి వేయబడ్డాయి.

చివరికి సమావేశాన్ని 'వాయిదా' వేసేట్టూ ..'ఉత్తమపురుషన్ ' ఎంపిక భారం యావత్తు స్త్రీలకి మాత్రమే వప్పజెప్పేటట్లూ నిర్ణయించారు. స్త్రీలకమిటీ అప్పటికప్పుడు ఏర్పడింది. పరిమళా అయ్యర్ కమిటీ ఛైర్మన్. నళినీ అయ్యంగార్.... సుచిత్రా అయ్యర్ అఖిలా బాలచంద్రన్, మా ఆవిడా కమిటీ మెంబర్సు. కమిటీ కరెస్పాండెంట్సు సుజాతాగౌతమ్ & మధురిమా శ్రీనివాస్ (మా ఆవిడ మీటింగుకి రాకపోయినా పరోక్షంగా ఎన్నికయింది)




ఆ మరునటిరోజు నుంచీ హడావిడే హడావిడి. మగవాళ్ళంతా ఆఫీసుకి సెలవులు పెట్టి మరీ పెళ్ళాలకీ.. పొరుగింటి ఇరుగింటి ఆడవాళ్ళకీ సేవలు చేసేస్తున్నారు. స్కూలుకి పిల్లల్ని మగవాళ్ళే తీసికెళ్ళి తీసుకొస్తున్నారు. ఆడది కనబడితే 'ఆబగా' చూసే 'అన్బళగన్' కూడా ఆడవాళ్ళకి అతిగౌరవాన్నిస్తూ అతివినయం ప్రదర్శిస్తున్నాడు.

ఈ ఎవార్డు విషయం కేవలం మా కామకోటి నగర్‌లోనే కాక చుట్టు పక్కల కాలనీలో కూడా చర్చనీయాంశం అయింది. ఏ బస్‌స్టాండ్‌లో చూసినా ఏ కాఫీ హోటల్‌లో విన్నా 'ఉత్తమ పురుషన్' ఎవరిని వరిస్తుందనే చర్చలే. ఆడవాళ్ళు ఇంటింటికీ 'తమ భర్తకే' ఓటు వెయ్యమని తిరుగుతున్నారు.

మా యిల్లు రైల్వేస్టేషన్లా మారింది. వచ్చిపోయే ఆడవాళ్ళతో మా ఆవిడ యమబిజీగా వుంది. నన్నసలు పట్టించుకోకుండా ఏవేవో 'కోడ్'లో వ్రాయటం..వాటి ముందు ప్లస్సులూ, మైనెస్సులు వేస్తూ నా పెళ్ళాం నాకు 'దొరకటం'మానేసింది.

'రోజుకో టిఫిన్ లంచ్ & డిన్నర్' సిస్టమ్ పోయి రోజూ 'ఉప్మా పప్పూ సాంబార్' సిస్టమ్ వచ్చింది. మొత్తానికి 'లీకయిన' సమాచారం ప్రకారం 'ఉత్తమ పురుషన్' ఎవార్డు ఎన్నికకు సెలక్షన్ కమిటీ పాటించే సూత్రాలు ఏమనగా -

1. భర్త ఎటువంటి వాడో భార్యనీ... తండ్రి గురించి పిల్లలనీ ఎంక్వయిర్ చెయ్యడం.

2. పనిమనుషులూ ఎక్స్‌ట్రా వాళ్ళ దగ్గర్నించి 'మగవాడి'ప్రవర్తనని రహస్యంగా సేకరించడం.

3. మందూ, సిగిరెట్లూ, పేకాటా ఎక్స్‌ట్రా సద్గుణాలు వుంటే వాటినీ పరిగణనలోకి తీసుకోవడం.

4. ఇరుగుపొరుగుల్నించి 'భార్యాభర్తలు' అన్యోన్యత గురించిన సమాచారం సేకరించడం. ఇలా ఓ పదో పదిహేనో సూత్రాలు తయారు చేశారట.

'సూత్రాలు' ఎప్పుడయితే లీకయ్యాయో మగాళ్ళు మందూ, సిగిరెట్టూ ముట్టుకోవడం మానేశారు. పొద్దున్నే వీబూదీ,కుంకుమ-గంధమూ కలిపి బొట్లుపెట్టుకుని'గుడికి' కూడా హాజరవుతున్నారు.

మళ్ళీ ఎమర్జన్సీ మీటింగ్ కాల్‌ఫర్ అయింది.

"సెలక్షన్ కమిటీ ఏం నిర్ణయించింది?" గంభీరంగా అడిగాడు వేలాయిధం.

"ఆల్‌మోస్ట్ ఫినిషింగ్ స్టేజ్‌లో ఉన్నాం. మీరు ఫంక్షన్ డేట్ ఫిక్స్ చేసిన రోజే ఫలితాలు వెల్లడిస్తాం..!" అంతకంటే గంభీరంగా అంది పరిమళా అయ్యర్.

"దానికీ దీనికీ ఏమిటి సంబంధం?" అయోమయంగా అన్నాడు వేలాయుధం.

"చాలా సంబంధం వుంది మిస్టర్ ప్రసిడెంట్..! చాలామంది ఆడవాళ్ళు తమ 'భర్తకే ఎవార్డు ఇవ్వాలని ప్రత్యక్షంగా, పరోక్షంగా కూడా 'ఒత్తిడి' తెస్తున్నారు. కొంతమంది మగవాళ్ళయితే 'బెదిరింపు' టెలిఫోన్లు కూడా చేస్తున్నారు. ఇంకొందరేమో స్టీలు బిందెలూ టప్పర్ వేర్ ఐటమ్స్ ఇస్తామని ఆడవాళ్ళకి ఆశ పెడుతున్నారు. ముందుగా 'ఎనౌన్సు' చేస్తే కక్షసాధింపు చర్యలకి అవకాశం వుంటుంది గనక ఫంక్షన్ రోజునే 'పేరు 'ఎనౌన్సు చెయ్యాలని కమిటీ మెంబర్స్ అంతా ఒక నిర్ణయానికి వచ్చాం! అదీగాక ముందే ఎనౌన్సు చేస్తే ఆ ఉత్తమ పురుషుడు ' తప్ప ఎవ్వరూ మీటింగ్‌కి రారు. ఫంక్షన్ రోజునే ఎనౌన్సు చెయ్యడం వలన సస్పెన్సూ మెయిన్‌టైన్ అవుతుంది... ఫుల్ ఎటెండెన్సూ వుంటుందీ...'ఆస్కార్' ఎవార్డు లాగా సూపర్ సక్సెస్ అవుతుందని మేం భావించాం. 'విజేత' ఎవరో డిక్లేర్ చేసే ముందు.. నామినేషన్లు ఎవరెవరు వేశారో... వారికి ఎన్ని పాయింట్స్ వచ్చాయో చెప్తాం గనక... కక్ష సాధింపుకీ



తావుండదు.....!" స్పీచ్ పూర్తిచేసింది పరిమళా అయ్యర్. హాలంతా చప్పట్లతో మూరు మోగిపోయింది. ఎంతయినా ఆడాళ్ళు ఆడాళ్ళే!

ఎక్కడ ఫంక్షన్ ని కండక్టు చెయ్యాలనే దానిమీద డిస్కషన్స్ జరిగాయి. 'దేవీ అకాడమీ' స్కూల్ ఫిక్సయింది. కొంతమంది ఆ రోజు టిఫినూ, లంచీ,డిన్నరూ కూడా ఏర్పాటు చేస్తే బాగుంటుందని సజస్టు చేశారు. అదీ 'ఓ.కే.' అయింది. అంత్యాక్షరిలాంటి ఉత్సాహపూరిత కార్యక్రమాలు కూడా ఏర్పాటు చెయ్యాలని అంగీకరించ బడింది.

'ఆ రోజుని మగాళ్ళకి 'బార్'డేగా డిక్లేర్ చెయ్యాలని నేను ప్రపోజ్ చేశాగానీ... నటరాజన్ నా నోరుమూసేసి 'ఉత్తమపురుషుడు' ఆ రోజైనా మందుకి దూరంగా వుండాలని 'జ్ఞాన' బోధ చేశాడు.

"నా కెలాగూ ఆ ఎవార్డు రాదుగా!" అన్నా.

"సపోజ్ నా కొస్తే ? నువ్వు మందుకొడుతూ వుంటే చూసి నేను ఆగలేనుగా! అభాసు అయిపోదూ?" మందలించాడు నన్ను.




ఆ.తి.నగర్ వాళ్ళు ఏప్రిల్ 13న ఎవార్డు ఇస్తున్నారు గనక మనం ఏప్రిల్ 12నే ఎవార్డు ఇవ్వాలనే నిర్ణయానికి వచ్చి డేట్ ఫిక్స్ చేశారు. నేను భోజన ప్రియుణ్ని గనక పర్చేజీ చెయ్యడం వంటలు దగ్గరుండి వండించటం లాంటి ప్రత్యేక పనుల్ని నాకు వొప్పగించేశారు. ఇంకేం! ఆ మాట వినగానే నా మొహం 'వెలిగి' పోయిందని భా.జ.పా.అభిమానులూ ఆ.తి. మూకావాళ్ళూ అన్నారు. (ఆ.తి. మూక అంటే ఆలిండియా అన్నా ద్రవిడమున్నేత్ర కజగం వాళ్ళు)

( డి.ఎమ్.కె.ని తి.మూ.కా అనీ పి.ఎమ్. కె. ని పి.మూ.కా అనీ తమిళవాళ్ళు అంటారు. అంతేగాని డి.ఎమ్.కె, పి.యమ్.కె అని ఇంగ్లీషులో పిలవరు)

మాంఛి కుక్స్ని రప్పించి రకరకాల తెలుగు అరవ, కన్నడ, మలయాళ స్పెషల్స్ని పురమాయించా. దాంతో ఏప్రిల్12 వ తేదీ దేవీ అకాడమీ అంతా ఘుమఘుమలతో నిండి పోయింది. ఫుడ్ ఎరేంజ్మెంట్స్ 'సూపర్' అన్నారు జనాలు. (మా ఆవిడ వాళ్ళ పుట్టింటి నించి ప్రేమతో తెచ్చుకున్న ఆవకాయ జాడీ మొత్తం ఆ రోజున ఖర్చైపోయింది. అలాగే మా పెద్దక్క ఇచ్చిన మాగాయి జాడీ... మా రాజమండ్రి అక్క ఇచ్చిన రెండు కేజీల కందిపొడి + నువ్వుపొడి...చింతలపూడి నించి మా మూడో అక్క పంపించిన గుత్తావకాయా, తొక్కుడు పచ్చడీ కూడా ఎగిరిపోయింది. మా అక్కలు ఆ విషయం విని ఎంతో సంతోషపడ్డా..మా అత్తగారూ వాళ్ళు మాత్రం 'వారు ప్రేమతో పంపిన వూరగాయల్ని నేను ఊరంతా 'వంజారం' చేశానని 'ఆడి'పోసుకున్నారని భోగట్టా తరువాత తెలిసింది)

ఈవెనింగ్ ఏడింటికల్లా పరిమళా అయ్యర్...మా ఆవిడా... నళినీ అయ్యంగార్.. సుచిత్రా అయ్యర్.. అఖిలా బాలచంద్రన్ స్టేజిమీదకి వరసగా వచ్చారు. ఆడవాళ్ళు పట్టుచీరల్లోటీ, మగవాళ్ళు ట్రెడిషనల్ 'గూడ' కట్టుతో కళ కళ లాడుతున్నారు.

ఎనౌన్సు మెంటు మొదలయ్యింది.

ఫస్టుపేరు వేలాయుధం. పేరు చదవగానే మహానందంతో లేచి నిలబడి గూడలు వంచి అతివినయంగా నమస్కరిస్తూ పళ్లికిలించాడు.

"వేలాయుధం గారికి 75 పాయింట్సు వచ్చాయి" ఎనౌన్సు చేసింది మా ఆవిడ.

"నంబర్ టూ నారాయణన్" చదివింది పరిమిళ , నారాయణన్కూడా వినయంగా లేచి నమస్కరిస్తూ పళ్ళికిలించాడు.

"నారాయణన్ గారికి 75 పాయింట్స్" ఎనౌన్సు చేసింది మా ఆవిడ.

"నంబర్ త్రీ శివమణి " (పరిమళ)

"75 మార్కులు" (మా ఆవిడ)

"నంబర్ ఫోర్ చింతామణి నాయర్" (పరిమళ)

"డిటో " చదివింది (మా ఆవిడ)

అప్పటిదాకా లేచి వినయంగా పళ్ళికిలించేవాళ్ళు లేవటం మానేశారు.

"నంబర్ ఫైవ్.."సాంబశివన్ ,.. (పరిమళ)

"డిటో " చదివింది (మా ఆవిడ)

"నంబర్ సెవంటీఫైవ్ గోపాలకృష్ణన్ (పరిమళ)

"75 పాయింట్స్" ( మా ఆవిడ)

జనాలకి విసుగొచ్చింది.

"ఇంతకీ వుత్తమపురుషన్ ఎవార్డు ఎవరికి దక్కినట్టు?"

కోపంగా అరిచాడు నత్తినాయర్

"వస్తున్నాం..! ప్రతి నామినీ భార్యనీ ఇంటర్వ్యూ చేశాం. పనిమనుషులు దగ్గర్నించీ ఇరుగుపొరుగుల్నించీ 'రహస్య' సమాచారాన్ని కూడా సేకరించాం. అన్నీ పరీక్షించాక పాయింట్స్ వేస్తే అందరికీ సమానంగానే వచ్చాయి. అందుకే యీ 75 మందినీ సంయుక్తంగా ఎవార్డుకి ఎంపిక చేశాం...! " జవాబిచ్చింది పరిమళ.

"నాన్సెన్స్ ! దీసీజ్ టామ్ఫూలరీ..!"



అరిచాడు శివమణి.

"కరెక్టు..విజేతల పేరులో మీ పేరు వుంది...! కోపం ఎందుకు శివమణి గారూ ..మీరు చాలా మంచివారనీ ఎప్పుడూ 'తాగరని' అన్నీ మంచి అలవాట్లే వున్నాయనీ అందుకే ఆ ఎవార్డు మీకే ఇవ్వాలనీ మీ భార్య ఎలా చెప్పిందో అందరి భార్యలూ అలాగే చెప్పారు...! మీ భార్య చేసింది 'టామ్‌ఫూలరీ ' అయితే అందరిదీ 'టామ్‌ఫూలరీనే'! కానీ న్యాయంగా ఆలోచిస్తే తన భర్త గురించి మన కాలనీలో ఏ భార్యా 'చెడుగా' చెప్పటమో, 'కంప్లయింట్' చెయ్యడమో చెయ్యలేదు. ఈ విషయంలో నేను గర్విస్తున్నాను. మన కాలనీలో ఆడవాళ్ళకి హేట్సాఫ్..!" ఉపన్యాసం దంచింది మా ఆవిడ. అందరు ఆడాళ్ళూ చాలామంది మగాళ్ళూ చప్పట్లు కొట్టారు.

"అందరినీ స్టేజీ మీదకి పిలిచి ఇవ్వటానికి చాలా టైమ్ పడ్తుంది గనక....అందరి బదులుగా యీ అవార్డుని 'దాడీ' మామని అందుకోమని ..దాన్నీ మన అసోసియేషన్ హాల్లో భద్రంగా వుంచమనీ మనవి చేస్తున్నాను" పరిమళా అయ్యంగార్ అంది. దాడీ మామ బ్రహ్మచారి. పెద్దవాడు, మంచివాడు. ఆయన వచ్చి 75మంది తరఫునా 'అవార్డు ' అందుకోగానే అందరూ చప్పట్లు చరిచారు. (చాలామంది తృప్తిగా నిట్టూర్చడం నేను చూశా!)

"ఒక్కమనవి..! ఈ ఎవార్డుకి నామినేషన్ వెయ్యనిది మా ఆయన ఒక్కడే... ! ఎందుకంటే ..ఆయన కొంచెం' మందేస్తారు. సిగరెట్లు తాగుతారు. ఒకవేళ ఆయన నామినేషన్ వేస్తే దాన్ని నేనే చింపిపారేసేదాన్ని గానీ మా ఆయన తాగడనీ సిగరెట్లు పీల్చడనీ అబద్ధాలు మాత్రం ఆడేదాన్ని కాదు. అలాంటి పనిచేసే అవకాశాన్ని మా ఆయన నాకు ఇవ్వలా! అందుకని..ఆయన నిజాయితీకి నిజంగా సంతోషిస్తూ... 'మా ఆయన ఉత్తమపురుషుడు కాడు' అని సభాముఖంగా ప్రకటిస్తూ ఆయనకో చిన్న 'ఉంగరం' ప్రజెంటు చేస్తున్నా.... "మైకు ముందు నిలబడి నావంక చూస్తూ అంది మా ఆవిడ.

నత్తినాయంరహా, నటరాజనూ నన్ను స్టేజిమీదకు తోశారు. ముఖం 'వెలిగి' పోతుండగా మా ఆవిడ ఇచ్చిన ఉంగరాన్ని 'భక్తిగా' స్వీకరించి స్టేజి దిగాను. చాలామంది చప్పట్లు కొట్టారు. (ఎక్కువ మంది ఆడవాళ్ళే!) కొంతమంది మగవాళ్ళు వాళ్ళ పెళ్ళాల వంక 'గుర్రు'గా చూడటం గమనించా. జనం డిన్నర్ హాల్ వైపు పరిగెత్తగానే నేను... ఆకాడమీ వెనకాలకీ పోబోయా.

"ఎక్కడికీ? మందు కొట్టడానికా?" సీరియస్‌గా అంది మా ఆవిడ.

"ఏదో ఒక అవార్డొచ్చిన ఆనందంలో 'మందు' కొడితే నష్టం ఏముంది?" బ్రతిమలాడే ధోరణిలో అన్నా.

"ఓరి బడుద్దాయ్...! ఉత్తమ పురుషుడు ముందు కొట్టకూడదుగానీ నీకేం? బట్ 'ఒక్క' పెగ్గు మాత్రమే..?" నవ్వింది మా ఆవిడ.

వాటెల్స్....!

ఆ రాత్రి ఎప్పుడో ..మా ఆవిడ్నడిగా.. "అయినా సామ్రాజ్యమా... అంత మందికీ ఒకే ఎవార్డు ఇవ్వాలనే అయిడియా ఎవరిదీ?" అని

"ఇంకెవరిదీ.....? నాదే..! ఇద్దరు సూపర్ హీరోలు ఒకే 'నంది' ఎవార్డుని పంచుకోగా లేనిది...75మంది మామూలు మనుషులు ...అందునా మధ్యతరగతి వాళ్ళు ఒకే ఎవార్డుని పంచుకోలేరా? అదీగాక మీ మగాళ్ళ వ్యవహారం వేరూ... మా ఆడవాళ్ళ రాజకీయాలు వేరు. ఎవరికిచ్చినా మిగతా వాళ్ళతో తలనొప్పే... ! అందుకే ఆ 'ఎడ్జస్టుమెంటు...!" నవ్వింది మా ఆవిడ ఆవలిస్తూ.

మా ఆవిడ ఇంతే...! మరి మీ ఆవిడ?

**పి.ఎస్: తమిళంలో ఉత్తమ పురుషన్ అంటే 'ఉత్తమ భర్త' అని అర్థం. పురుషన్ అంటే భర్త. పొండాట్టి అంటే భార్య.**

■



# అమరవీరులు



రాజ్‌గురు



భగత్‌సింగ్



సుఖ్‌దేవ్

మనం స్వేచ్ఛగా జీవించడం కోసం
వారు ప్రాణత్యాగం చేశారు.
మన హృదయాలలో
వారు కలకాలం జీవిస్తారు.



**దేశం కోసం ఈ అమరవీరులు ప్రాణాలర్పించిన రోజు సందర్భంగా
దేశం కృతజ్ఞతతో వారికి నివాళులర్పిస్తున్నది.**

సమాచార, ప్రసార మంత్రిత్వ శాఖ, భారత ప్రభుత్వం

davp2003/861

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

4

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

ఎ.వి.యమ్. వారి పిక్చర్ "భూకైలాస్" గురించి చెప్పుకోవాలంటే రావణాసురుడిగా రామారావు గారు, నారదుడిగా నాగేశ్వరరావు గారు చేశారు. అందులో మండోదరి చెలికత్తెలతో పాతాళలోకం నుంచి భూలోకానికి వస్తుంది. అందులో ఒక మంచి పాట వుంది.

**"అందములు విందు చేసే అవని ఇదేనా**
**కమలాసనుని కోటిశిల్ప కూటమిదేగా "**

ఈ కాలం వారికి ఆ సాహిత్యం అర్థం అవుతుందా అని? కమలాసనుడు అంటే ఎవరు? కోటిశిల్పకూటమి అంటే ఏమిటి? పౌరాణికం కాబట్టి ఆ సాహిత్యం చాలా బాగుండేది. ఇప్పుడు పౌరాణికం అంటే సోషల్ డైలాగ్స్ చొప్పించేస్తున్నారు. అప్పుడు పౌరాణికం అంటే అంత ఉన్నతమైన సాహిత్యం, భాషా ప్రయోగం వుండేది. మంచి పౌరాణిక చిత్రమది. చాల చక్కగా ఆడింది. ఇప్పటికి కూడా దీన్ని మహాశివరాత్రి సందర్భంగా టి.విలో అర్ధరాత్రి తప్పకుండా వేస్తూనే ఉంటారు.

ఆ తర్వాత ఇంకో పాట చాలా బాగుంది. ఆ పాటను చాలా బాగా తీశారు. 'మనరాగమేగా అనురాగం'. ఆ పాటలో భూమి అలా విరుచుకుపోయినట్టు చాలా బాగా తీశారు. 'భూకైలాస్' కెమెరామెన్ కమాల్ ఘోష్ గారు రోజుకు మూడు షాట్లు మాత్రమే తీసేవారు. పొద్దున 9గంటలకి సెట్‌లోకి వెళితే - ఒక లాంగ్ షాటు ఫుల్‌గా మొత్తం సెట్టు అంతా

చిత్రం
భూకైలాస్
రచన
సముద్రాల
సంగీతం
సుదర్శనం,
గోవర్ధనం
గానం
సుశీల, బృందం







మండో : అందములు విందులయే అవని ఇదేనా
కమలాసనుని కోటిశిల్ప కూటమిదేనా
ఎందును లేనీ తీయందనాలూ
చిందులు వేసేనుగా ॥అం॥
చెలి : తెలుసును నీలో వలపుదూరం
కలచివేసినటే విచారం
చెలి : నీమది దోచే మన్మథుడెవరే
చెలి : నిజమేనా యోచనా
చెలి : ప్రణయ సుధా యాచన
చెలి : తగవేనా ఈ నటనా
మండో : చాలునింక వంచన
చాలునింక వంచన
అందరూ: అందములు విందులయే అవని ఇదేనే
కమలాసనుని కోటిశిల్ప కూటమిదేలే
మండో : తామర పూవులా తురిమేము రారే
చెలి : మనసున వేదన మితిమీరి పోనే
చెలి : అంతేనా
చెలి : ఔనౌనె
మండో : చాలు మీదు ఆగడాలు ॥2॥ ॥అందములు॥

# నేనూ నా పాటలు



చిత్రం
మూగనోము

సంగీతం
ఆర్.గోవర్ధనం

రచన
డా॥ సి.నారాయణరెడ్డి

గానం
ఘంటసాల
సుశీల

గౌరి : పగడాల జాబిలి చూడు - గగనాల దాగెను నేడు
వేయి అందాల నా రాజు - అందిన యీరోజు
ఎందుకులే నెలరేడు?
వేణు : పగడాల జాబిలి చూడు - గగనాల దాగెను నేడు
కోటి అందాల నా రాణి - అందిన యీ రేయి
ఎందుకులే నెలరేడు?
మనసూ మనసూ గుస గుస లాడెను
పెదవీ పెదవీ కువ కువ లాడెను
గౌరి : ఆకాశ దీపాలు శయనించెను
నా కళ్లు నీ కళ్లు పయనించెను ॥పగడాల॥
వేణు : బంగారు మమతలు పొంగులువారెను
కొంగులు రెండూ ముడిపడిపోయెను
గౌరి : గుడిలోని దేవుడు దీవించెను - నా
జడలోని పూవులు తిలకించెను ॥పగడాల॥



'మూగనోము' పాటల పుస్తకం కవర్‌పేజీ

ఎక్స్‌ప్లాయిట్ చేయాలంటే 9నుంచి 12 వరకు లైట్లు సెట్ చేసుకోవటం సరిపోయేది. అంటే రోజుకి మూడు షాట్లకంటే ఎక్కువ అయ్యేవికావు. అంతేకాక ఏవియం నిర్మాత చెట్టియార్‌గారు మంచి అభిరుచిగల మనిషి. ఒకవిధంగా ఇప్పటివాళ్లకు అది చాదస్తంగా తోచవచ్చుగాని, ఆర్టిస్ట్ తల గాలికి కొంచెం చెదిరి పోయివున్నా మళ్లీ రీటేక్ చేయమనేవారు.

ఇంకోటేమిటంటే ఏవియం సంస్థలో చాలా గొప్ప ట్రైనింగ్ ఇచ్చేవారు. 'మూగనోము' సినిమాలో చిన్నపిల్లవాడి క్యారెక్టర్ బ్రహ్మాజీ చేసాడు. లక్ష్మీనారాయణ అనే ఆయన రోజారమణి, బ్రహ్మాజీ- ఇలా చిన్న పిల్లలకు ట్రైనింగ్ ఇవ్వడంలో ఎక్స్‌పర్ట్. పిల్లలు వాళ్ల డైలాగ్స్ వాళ్లే చెప్పాలి. అంత చక్కటి ట్రైనింగ్.

'మూగనోము'లో నాకూ, నాగేశ్వరరావు గారికి రెండు డ్యూయెట్స్ ఉన్నాయి. 'పగడాల జాబిలి చూడు గగనాన దాగెను నేడు' ఎంత చక్కటి పాటో... పగడమేమో ఎర్రగా ఉంటుంది. జాబిలి తెల్లగా ఉంటుంది. పగడాల జాబిలి అన్నదొక మంచి ప్రయోగం. ఏవీయం సంస్థలో పర్మినెంట్ ఆర్టిస్ట్‌గా నేను చెప్పుకోవచ్చు. డబుల్ వర్షన్‌లో మొత్తం 7 సినిమాలు చేశాను. అంటే పధ్నాలుగు సినిమాలన్నమాట.

చిత్రం : భూకైలాస్ రచన : సముద్రాల
సంగీతం : సుదర్శనం, గోవర్ధనం
గానం: ఘంటసాల, సుశీల







మండోదరి : ప్రేమలీవిధమా - విషాదమే ఫలమా
మన్నాయెనా, మా ఆశలు
కన్నీరే మిగిలేనా ॥ప్రేమలీ॥
కన్నెమది చిరువెన్నెల
పున్నమియె కరువాయెనా
తీరని మదికోరిక
కొనసాగగా దరిజేరినా
తరితీయని మన ప్రేమలా
తండ్రియె దూరము చేసే ॥ప్రేమలీ॥
మనరాగమేగా అనురాగం
తనువూ మనసూ సాగిసే ప్రేమరాగం ॥మన॥
రావణ : కోరిన ప్రియులు చేరిన వెనుక
కూరిమి బేరము లాడగనేల ॥కోరిన॥
మండోదరి : కన్నులపూచే నిన్నుగనీ
రావణ : మనసు దోచేసి చేసె, నీ దాసుని
మండోదరి : కొనవోయి వెల వోసితి నా మది
రావణ : తీయని కోరికలు తీరును రావె ॥మన॥

## నేనూ నా పాటలు

ఇంకో తమాషా ఏమిటంటే - 'లేతమనసులు' షూటింగ్ టైమ్‌లోనే కృష్ణతులాభారం, సి.ఐ.డి. సినిమాలు కూడా షూటింగ్ జరుగుతూ ఉండేవి. అదే టైమ్‌లో నా పెళ్లి కూడా ఫిక్స్ అయింది. ఏవీయమ్ వారు నాకు ఆ టైమ్‌లో చాలా హెల్ప్ చేసేవారు. వాళ్ల అబ్బాయిలు కుమరన్, శరవణన్ రోజుకో రకం బూట్లు వేసుకొచ్చేవారు. ఇక తమిళ షూటింగ్ అయిపోయింది. తెలుగు షూటింగప్పుడే నాకు పెళ్లయింది. మా వారికి కూడా వారికి మల్లే రకరకాల షూస్ కుట్టించాలని కుమరన్, శరవణన్‌లను పిలిచి 'సార్, ఉంగళ మాదిరి షూస్ ఎంగ హజ్బండ్‌క్కు కూడా వేణ్ణుం' అంటే -డజన్ల కొద్దీ బూట్లు ఇంటికొచ్చేసేవి.

అన్నిటికంటే ఇంకా విచిత్రమైన అనుభవం- 'మూగనోము' తీసేటప్పటికి మా బాబు వంశీ పుట్టాడు. వాడు పుట్టిన 10 ఏళ్ల వరకూ హీరోయిన్‌గానే చేశాను. ఇటేమో 'మూగనోము'- నాగేశ్వరరావుగారితో, మధ్యాహ్నం నుండి రామారావు గారితో 'రాము' షూటింగ్. రెండూ ఏవీయమ్ వాళ్లవే. ఎదురెదురు ఫ్లోర్లలో జరిగేవి. రెండూ కూడా కాంట్రాస్ట్ క్యారెక్టర్స్. మూగనోములో హెవీ క్యారెక్టర్, పెర్ఫార్మెన్స్ రోల్.

ఇక్కడో విషయం చెప్పాలి - ఇది పాటకు సంబంధించినది కాకపోయినా ఎందుకు చెబుతున్నానంటే మేము పాతిక సంవత్సరాలు ఇండస్ట్రీని రూల్ చేసామంటే అలనాటి హీరోయిన్‌లకు ఒక కాంపిటేటివ్ స్పిరిట్ ఉండేది. పక్క వాళ్లకంటే బాగా చేయాలి అని. 'మూగనోము' సినిమాలో ఎస్వీ రంగారావు గారు నన్ను గుళ్లోకి తీసుకొచ్చి ఎవరికీ చెప్పవద్దని ఒట్టువేయించుకుంటారు. ఆయన్ని నేను ఎప్పుడూ డాడీ అని పిలుస్తుండేదానిని.

'ఇదిగో అమ్మాయ్ యాక్టింగ్‌లో నిన్ను మింగేస్తాను' అనే వారు. దానికి 'డాడీ! నేను మీ గొంతుకు అడ్డం పడతాను కదా' అని నేననేదాన్ని. ఆ సీన్ ఎంత గొప్పగా పండిందో అందరికీ తెల్సిందే.

'రాము' 25 వారాలు ఆడింది. అందులో నాది పెళ్లికాని చిన్నపిల్లవేషం. 'మామిడి కొమ్మ మళ్లీ మళ్లీ పూయునులే' అని చాలా చక్కటి పాట. మూగనోములోనేమో బిడ్డ తల్లి వేషం. అదీ 100 రోజులు ఆడింది.

ఏవీయంలో కన్నడ సినిమాలు కూడా చేసాను. ఏ భాష అయినా సరే వచ్చినట్టు నేర్చుకోవాలి. నిర్మాతలు ఒప్పుకునేవారు కాదు. ఎందుకంటే డబ్బింగ్‌లో ఈ ఎఫెక్ట్ రాదు.

'చిరంజీవులు' సినిమా టైములో రామారావుగారి మూడ్స్ గురించి తెలుసుకున్నాను. చాలామంది అంటుంటారు

చిత్రం : రాము
రచన : దాశరథి
సంగీతం : గోవర్ధనం
గానం : సుశీల



మామిడికొమ్మ మళ్లీ మళ్లీ పూయునులే
మాటలు రాని కోయిలమ్మ పాడునులే
ఆనందంతో...అనురాగంతో నా మది ఆడునులే ॥మామిడి॥
నన్నే నీవు అమ్మా అన్న నాడు
మీ నాన్న మనసు గంతులు వేసి ఆడు
నన్నే నీవు అమ్మా అన్న నాడు
మీ నాన్న మనసు గంతులు వేసి ఆడు
మంచికాలం మరలా రాదా
ముళ్లబాటే పూలతోట
ఆనందంతో...అనురాగంతో నా మది ఆడునులే ॥మామిడి॥
గూటిలోని పావురాలు మూడు
అవి గొంతు కలిపి తీయని పాట పాడు
గూటిలోని పావురాలు మూడు
అవి గొంతు కలిపి తీయని పాట పాడు
మంచు తెరలు తొలగిపోయి
పండు వెన్నెల కాయునులే
ఆనందంతో...అనురాగంతో నా మది ఆడునులే

అలా ఆ పాత్రలో లీనమైపోవటం మంచిది కాదని. కానీ బరువైన సీన్ చేసి వచ్చి, వెకిలిగా మాట్లాడుకుంటే, మళ్లా వెళ్లి ఆ సీన్ చేయాలన్నప్పుడు మూడ్‌లోకి రావడానికి చాలా టైమ్ తీసుకుంటుంది. అది అనారోగ్యానికి కారణమవుతుంది కూడా.

'చిరంజీవులు'లో సెకండాఫ్ నుండి రామారావుగారిది గుడ్డివాని పాత్ర. అప్పటికి కాంటాక్ట్ లెన్స్‌లు అవీ రాలేదు కదా. అందుకనీ ఏవో తెచ్చి ఆయనకు పెట్టారు. దానికి తోడు షూటింగ్ టైమ్‌లో రామారావుగారు తీసేవారు కాదు. కిరీటం పెట్టుకున్నా కూడా లంచ్ టైమ్, ప్యాకప్ అప్పుడు తప్పితే మిగతా టైమ్ అంతా ధరించే ఉంచేవారు. ఈ లెన్స్‌ల వల్ల రామారావు గారి కళ్లకు చాలా ఇబ్బంది కలిగింది. కళ్లు పోవాల్సిన పరిస్థితి కూడా వచ్చేసింది. అంత సీరియస్‌గా చేసారా వేషాన్ని. అది చూసిన

# నేనూ నా పాటలు



చిత్రం : చిరంజీవులు
రచన : మల్లాది రామకృష్ణశాస్త్రి
సంగీతం : ఘంటసాల
గానం : పి.లీల

తెల్లవారవచ్చె -తెలియక నాసామి
మళ్లీ పరుండేవు లేరా మళ్లీ పరుండేవు లేరా ॥తెల్లవార॥
మళ్లీ పరుండేవు మసలుతూ వుండేవు
మళ్లీ పరుండేవు మసలుతూ వుండేవు
మారాము చాలింక లేరా
మారాము చాలింక లేరా ॥తెల్లవార॥
కలకలమని పక్షి గణములు
చెదిరెను కళ్యాణ గుణధామ లేరా ॥కలకల॥
తరుణులందరు దధి చిలికే వేళాయే
దైవరాయ నిదురలేరా
తరుణులందరు దధి చిలికే వేళాయే
దైవరాయ నిదురలేరా దైవరాయ నిదురలేరా
నల్లనయ్యా రారా! ననుగన్నవాడా!
బుల్లితండ్రి రారా బుజ్జాయి రారా
నల్లనయ్యా రారా! ననుగన్నవాడా!
బుల్లితండ్రి రారా బుజ్జాయి రారా
నాన్నా మీ అమ్మ గోపెమ్మ పిలిచేను
వెన్నతిందువుగానీ రారా
నాన్నా మీ అమ్మ గోపెమ్మ పిలిచేను
వెన్నతిందువుగానీ రారా వెన్న తిందువుగాని రారా ॥తెల్లవార॥









తర్వాత నేను నేర్చుకున్నదేమింటంటే -ఆర్టిస్ట్‌కి మూడ్ అనేది కూడా చాలా అవసరం అని.

పాటలకి కూడా ఈ మూడ్ చాలా అవసరం. బాగా సహకరిస్తాయి. మొఖంలో అయితే ఏదో విధంగా మార్పు తీసుకొస్తాంగానీ, మానసికంగా మనం ఇక్కడ సంసిద్ధత కాలేదు కదా!

చిరంజీవులు హిందీ సినిమా ఆధారంగా తీసారు. వేదాంతం రాఘవయ్యగారు దర్శకుడు. డి.ఎల్.నారాయణ గారు నిర్మాత. అందులో 'తెల్లవార వచ్చే తెలియక నా స్వామి' పాట. పి.లీల గారు పాడారు. అద్భుతమైన పాట అది.

ఆ రోజుల్లో -నేను తెలుసుకున్నది ఏమిటంటే - ఫేస్‌లో మజిల్స్ కంట్రోల్ అంటారు. అంటే కనుబొమ్మలు ముడుచుకోవడం, కనురెప్పలు కదిలించడం- ఏడుపు అంటేనే కనుబొమ్మలు ముడుచుకుంటేనే కానీ ఏడువు రాదు అనుకునేవాళ్లం. అప్పుడు వేదాంతం రాఘవయ్యగారు 'అట్లా ముడుచుకోవద్దు. స్టడీగా పాడండమ్మా. ఐ బ్రోస్ కదిలించవద్దు. కళ్లలోనే దుఖమంతా చూపించాలని చెప్పటం' - నటనకు వారి దర్శకత్వంలో ఓ సూచన. అలా స్టడీగా పాడించారన్నమాట.

నటనలో ఎప్పుడు ఐ బ్రోస్ కదపాలిలాంటి విషయాలన్నీ వేదాంతం రాఘవయ్యగారు నాకు చిరంజీవులు చిత్రంలో నేర్పించారు. అదే చిత్రంలో 'కనుపాప కరువైన' పాట పర్సనల్‌గా ఇష్టమైన పాట. అందులో వాడిన కెంధూళి పదం ఇప్పటి సాహిత్యంలో మనం వింటామాండీ? ఇప్పటి వారివారికెవరికైనా తెలుస్తుందాండి? విశ్వనాధ్ గారు గోధూళి అంటేనే ఇప్పటి వాళ్లకు తెలియటం లేదు.

ఆ సినిమా షూటింగ్‌లో రామారావుగారి ద్వారా నేను నేర్చుకున్నది మూడ్ గురించి. పుట్టిల్లు సినిమాలో డా॥రాజారావు గారు అంటుండేవారు మూడ్ ప్లీజ్ అని. అప్పుడు తెలిసేది కాదు. అధిక ప్రసంగం, అనవసర విషయాల జోలికి పోకుండా ఆర్టిస్ట్‌కి మూడ్స్ ఏవిధంగా ఉండాలి, అది ఆర్టిస్ట్‌కి ఎంత అవసరం అనేది రామారావుగారిని చూస్తే తెలిసింది. అలా తెలియకుండానే రామారావుగారి ప్రభావం నా మీద పడింది. ఇప్పటిలాగా అరువు గొంతులు అప్పుడు లేవు కదా, అంతా ఓన్ టాలెంటే. మాకంటే ముందు తరానికి అయితే పాటలు పాడటం కూడా రావాలి. ఏ భాష అయినా సరే మా గొంతులతో మేమే చెప్పాల్సిందే. అరవం నేర్చుకున్నాను. రాయటం కూడా నేర్చుకున్నాను. అలాగే హిందీ మిలన్ కానీయండి, హమ్‌రాహి కానీయండి. నేనే డబ్బింగ్ చెప్పుకున్నాను. నయాఆద్మీలో మాత్రం నాకు వేరేవారు డబ్బింగ్ చెప్పారు.

(వచ్చేసంచికలో మరికొన్ని పాటల గురించి....)



ప్రముఖ దర్శకుడు
**శ్రీ సింగీతం శ్రీనివాసరావు**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**కరిజ కథలు** 12

# రంగుల చెరువు



క రాజు రాజ్యపు ముఖ్య నగరంలో ఒక చెఱువుంది. అందరూ దాన్ని రాళ్ళ చెఱువు అంటారు. ఎందుకంటే నీళ్ళల్లోంచి చూస్తే కిందున్న రాళ్ళు స్పష్టంగా కనిపిస్తాయి. ఆ నీళ్లంత శుభ్రంగా, స్వచ్ఛంగా వుంటాయన్న మాట. ఎన్నో సంవత్సరాలుగా ఆ ప్రాంతంలోని వాళ్లంతా తాగడానికి ఆ నీళ్ళనే వాడ్తుంటారు. అయితే ఇప్పుడా చెఱువును అందరూ రంగులచెఱువు అంటారు. దీని వెనుక ఒక ఆసక్తికరమైన కథ వుంది.

క రాజు రాజ్యంలో ప్రతి ప్రాంతం వారికీ, ప్రతి ఒక్కరికీ న్యాయం జరగాలనేది మంత్రిగారి ఆదర్శం. ఆ విధంగానే జరుగుతున్నదని అతని నమ్మకం కూడా. కాని ఈ మధ్య అక్కడక్కడ ప్రజల్లో కాస్త అసంతృప్తి వుందనే మాటలు విన్పించాయి. వృద్ధ కళాకారులకు ఇస్తామన్న పారితోషికాలు ఇంతవరకూ ఇవ్వలేదని, జీతాలు సకాలంలో అందడం లేదని, చేయిస్తామని చెప్పిన సౌకర్యాలెన్నో చేయించలేదని - ఇలా జనమంతా గొణుక్కుంటున్నారుట. ఈ అసంతృప్తికంతా కారణం ఒక్కటే. ఇన్నాళ్ళు ప్రజలు అభిప్రాయాలేవీ రాజుగారి చెవులదాకా, అంటే ముందు మంత్రి చెవులదాకా రాకపోవడం. ముమ్ముందు ఇలా జరక్కుండా వుండాలంటే ఒకటే మార్గం. రాజ్యంలో ప్రజాప్రతినిధులను నియమించాలి. వాళ్ళు ఎప్పటికప్పుడు ప్రజల సమస్యలు తెలుసుకొని రాజుగారికి మంత్రిద్వారా వాటిని తెలియపరుస్తూ వుంటారు.

ఆలోచన రావాలే గాని దాన్ని ఆచరణలోకి పెట్టేంతవరకు మంత్రికి నిద్ర పట్టదు. వెంటనే కరాజును సందర్శించి తన ఉద్దేశాన్ని వెల్లడించాడు. ప్రస్తుతం ముఖ్య నగరానికి ఒక్క ప్రతినిధి ఎన్నికతో ప్రారంభిద్దాం అన్నాడు. "అలాగే మంత్రీ! ప్రజలకు బాగా హితుడైన ఒకరిని ఎంపికచేసి ప్రజా ప్రతినిధిగా నియమించండి" అన్నాడు కరాజు.

"మహారాజా! నాదొక మనవి. ప్రజలకు హితుడెవరో మనం చెప్పడంకన్నా ప్రజలే వారికి సన్నిహితుడెవరో మనకు చెప్తే వాళ్ళనే మనం నియమించవచ్చు" అన్నాడు మంత్రి.

"మరి ప్రజాప్రతినిధి అన్నవాడు ఏ మచ్చాలేని సన్మార్గుడుగా వుండాలిగా? అలాంటి వానిని ప్రజలు ఎన్నుకోవడం సాధ్యమా?" అంటూ సందేహాన్ని వెలిబుచ్చాడు కరాజు.

"అది వారికే సాధ్యం మహారాజా ! కాకపోతే కలియుగంలో అసలు తప్పులు చేయని వారుండరు కదా! అందుకని అందరికంటే తక్కువ తప్పులు చేసినవానిని ఎన్నుకొనమని చెప్దాం" అన్నాడు మంత్రి. మంత్రి చెప్పిందానికి సరేనంటూ ఈ పనినెలాచెయ్యాలో మంత్రికే వదిలేశాడు కరాజు. ఈ విషయాన్ని నగరం అంతా చాటించాడు మంత్రి.

ఒక రాజ్యాధికారిని రాజుగారుకాక తమనే ఎన్నుకొనమనేసరికి జనంలో ఇదేదో సరదాగా



వింతగా కనిపించింది. కాని ఈ సరదావెనక బోలెడంత అవకాశం, లాభం వున్నదన్న విషయాన్ని పసిగట్టిన వారు ఇద్దరున్నారు. ఒకరు భూపతిరాజు, మరొకరు శ్రీపతిరాజు.

ఇద్దరూ మేధావులే. ఇద్దరూ విపరీతమైన లోకజ్ఞానం కలవారే. ఇద్దరూ ధనికులే. అన్నిటికంటే ముఖ్యం ఇద్దరికీ ఉత్తములు, సన్మార్గులు అనే పేరుంది. భూపతి రాజు ప్రతి సంవత్సరం ఉగాది నాడు అన్నదానం చేస్తే, శ్రీపతిరాజు సంక్రాంతి రోజు చేస్తాడు. భూపతిరాజు రథోత్సవం చేయిస్తే, శ్రీపతిరాజు తెప్పోత్సవం చేయిస్తాడు. ఊళ్ళో వున్న చిన్న పెద్దా అందరికీ వీళ్ళతో ఏదో విధమైన లావాదేవీలున్నాయ్. అంచేత వాళ్ళిద్దరూ ఎవరికి వారు తాము ప్రజాపతినిధులైతే బాగుంటుందని నిశ్చయించుకొని ఇది సాధించడానికి కావలసిన వ్యూహాన్ని ఆలోచించసాగారు. అయితే ఒక చిక్కుంది. వాళ్ళకు సమాజంలో సన్మార్గులనే ముద్ర వుంది కదా! ఇపుడు బాహాటంగా వారి సంకల్పాన్ని తెలియపరిస్తే వీరు స్వార్థపరులనే చెడ్డ పేరొస్తుంది. అందుకని పైకి కనపరచనీయకుండా తామనుకున్న కార్యాన్ని సాధించడానికి యుక్తిగా పన్నాగం పన్నారు.




భూపతిరాజుకు చాలా కావలసినవాడు దానయ్య. దానయ్యకు భూపతిరాజు దేవుడు. అతనెంత చెప్తే అంతే. ఈ చనువుతో భూపతిరాజు దానయ్యని పిలిచి తన పథకాన్ని ఉపదేశించాడు. దానయ్య వెంటనే జనంలోకి వెళ్ళి "భూపతిరాజుగారే సరైన ప్రజాప్రతినిధి. సందేహం లేదు కాని ఆయనకీ పదవులు ఇష్టంలేదు. అయినా మనందరి శ్రేయస్సు కోసం ఆయన మన ప్రతినిధి అయితే మనకందరికీ మంచిది" అని ప్రచారం చేశాడు. అయితే ఇదే సమయంలో శ్రీపతిరాజుకు నమ్మిన బంటైన శీనయ్య కూడా ఇదే పద్ధతిలో "శ్రీపతిరాజుకిష్టం లేకపోయినా ప్రజల శ్రేయస్సు దృష్ట్యా ఆయనే ప్రజాప్రతినిధి అయితే బాగుంటుంద"ని ప్రచారం చేశాడు.

ప్రజల్లో ఇద్దరూ మంచి పేరున్నవాళ్ళే. పలుకుబడి ఉన్నవాళ్ళే. వీరిలో ఎవరు మిన్న అని నిర్ణయించడం కష్టమైంది. చివరకు ఎవరికివారు ఒక నిర్ణయానికొచ్చారు. ఎవరు ప్రతినిధి అయితే తమకు లాభసాటిగా ఉంటుందో వాళ్ళకే తమ మద్దతు తెలుపుదామని నిశ్చయించుకున్నారు. కాకపోతే తాము సమర్థించిన వ్యక్తికాక ఎదుటి వ్యక్తి ఎన్నుకోబడితే మున్ముందు తమకెలాంటి ముప్పు రాగలదో అనే భయం కూడా వాళ్ళకుంది. అలాగని తమకే సంబంధమూ లేదని తలుపేస్కొని ఇంట్లో కూర్చుంటే ఏ లాభమూ ఉండదని కూడా తెలుసు.




వచ్చే పౌర్ణమిరోజు కోటపక్కనున్న మైదానంలో ఎంపిక జరగనుందని ప్రకటించారు. సమయం దగ్గరి కొచ్చేకొద్దీ ఉద్రిక్తత ఎక్కువైంది. ప్రచారం ఊపందుకుంది. ఇప్పుడు ఒక నాయకుని మిత్రులు ఎదుటి నాయకునికి శత్రువులు. ఎవరికి వారు తమ మిత్రత్వాన్ని వాళ్ళ నాయకులకు ఎలా బుజువు చేస్కోడమా అని తాపత్రయపడసాగారు.

భూపతిరాజుకు మొదట్నుంచీ ఆకుపచ్చ రంగంటే ఇష్టం "మనకు ఆహారం ఇచ్చే పొలాలన్నీ అదే రంగుతో ఉంటాయికదా అందుకని" అంటాడాయన. ఇక ఇంట్లోవాళ్ళకి కావాల్సిన బట్టలూ అవి తనకు వదిలిపెడ్తే ఆకుపచ్చరంగే కొంటాడు. చివఱకు తన ఇంటికి కూడా మొత్తం ఆకుపచ్చరంగు పూయించాడు.

ఇది తెలిసిన దానయ్యకు తను భూపతిరాజు పక్షపాతి అని ఘనంగా చాటుకునే పద్ధతి మెరుపులా తట్టింది. అంగట్లో ఒక తట్టెడు ఆకుపచ్చరంగు కొనుక్కుని దానిని నీళ్ళలో కలిపి ముఖంతో సహా వొళ్ళంతా పూసుకున్నాడు. ఈ రంగుతోనే ఉదయాన్నుంచి సాయంత్రం వరకు ఊళ్ళో తిరగడం మొదలెట్టాడు. ఇప్పుడు మాట్లాడకుండానే దానయ్య తను భూపతిరాజు పక్షం వాడని అందరూ ప్రత్యేకంగా చెప్పుకునేట్టు చేశాడు. దీంతో భూపతిరాజుకు దానయ్య మీద ప్రత్యేకమైన అభిమానం ఏర్పడింది.

ఇది చూసిన శీనయ్య నేనేం తక్కువ తిన్నానంటూ శ్రీపతిరాజు ఎక్కువగా ఇష్టపడి ఇంటికిసైతం కొట్టించిన ఎఱ్ఱరంగును ఒంటికి పూస్కొని తిరిగాడు. ఇప్పుడు జనానికి కొత్తవిషయం ఒకటి తెలిసివచ్చింది. తాము మద్దతు యిస్తున్న విషయం నాయకునికి తెలియాలంటే వాళ్ళుకూడా వెంటనే ఆ పక్షానికి చెందిన రంగును పూస్కొని ఊళ్ళో తిరగాలి. రెండ్రోజుల్లో భూపతిరాజు అనుచరులంతా పచ్చరంగు, శ్రీపతిరాజు అనుచరులంతా ఎఱ్ఱరంగు పూస్కొని వీధులెంబడి అట్టహాసంగా తిరగడం మొదలెట్టారు. నాయకులిద్దరికీ ఇప్పుడు వాళ్ళ పక్షం వారెవరో స్పష్టంగా తెలుస్తూంది. పరిస్థితి చూస్తూంటే ఇద్దరూ సమ ఉజ్జీలుగా కనిపిస్తున్నారు. ఎవరైనా గెలవ్వొచ్చు.

ఇది గమనించిన భూపతిరాజుకు ఒక ఆలోచన వచ్చింది. తను గెలవాలంటే శ్రీపతిరాజు ఒక మచ్చవున్న వాడుగా బుజువు చెయ్యాలి. అంటే అతను ఎప్పుడైనా, ఏదైనా తప్పుచేశాడని అని ఆరాతీయ్యాలి. అలాంటిది దొరికితే ప్రత్యర్థి ఓటమి తథ్యం.

భూపతిరాజు ఆజ్ఞ మేరకు దానయ్య శ్రీపతిరాజు పాత చరిత్రమీద పరిశోధన చేస్తే పెద్దశ్రమ లేకుండా ఒక నిజం తెలిసొచ్చింది- ఒకప్పుడు శ్రీపతిరాజు కల్తీబంగారం అమ్మిన సొమ్ముతో ఇంతటివాడయ్యాడని! ఈ వార్త ఊళ్ళో ఒక సంచలనం సృష్టించింది. ఎఱ్ఱరంగు పూసుకున్న వాళ్ళంతా తమకు ఓటమి తప్పదనే భయం పుట్టుకుంది. వెంటనే అందరూ చెఱువు దగ్గరకు పరుగుతీసి నీళ్ళల్లో దూకి పాతరంగును కడిగేస్కొని వచ్చరంగు పూస్కొని ఊళ్ళో తయారయ్యేరు. ఇప్పుడు శ్రీపతిరాజు పక్షం ఒక్కడూ లేడు.

దీంతో శీనయ్యకు ఆగ్రహం వచ్చింది. కసిగా ఆ క్షణమే భూపతిరాజు స్వంత ఊరుకెళ్ళి అక్కడ నలుగురినీ కనుక్కోగా అసలు భూపతిరాజుకు ఇప్పుడున్నది అసలు భార్యకాదనీ, కట్టుకున్న భార్యను దారుణంగా హింసించి అక్రమంగా ఆవిడ ఆస్తిపాస్తులు లాక్కొని ఇక్కడికొచ్చి కులుకుతున్నాడని తెలిసింది. అంతే ఇది విన్న తక్షణం పచ్చరంగు పూసుకున్న మొత్తం జనం మళ్ళీ చెఱువులో దూకి ఈ రంగును కడిగేస్కొని ఎఱ్ఱరంగును పూస్కున్నారు. ఇపుడు భూపతిరాజు పక్షం ఒక్కడూ లేడు.

మళ్ళీ దానయ్య, శీనయ్యలు విడవకుండా ఒకరిమీద ఒకరు పోటీగా ఎదుటి నాయకుల గుట్టులను ఒకటి తర్వాత ఒకటి బయట పెడ్తూంటే ఇన్నాళ్ళూ సన్మార్గులుగా చలామణి అవుతున్న భూపతిరాజు, శ్రీపతిరాజులు నిజానికి ఎన్నో ఘోరమైన నేరాలు చేసిన వారుగా బయట పడ్డారు. ఒక్కొక్కసారి వాళ్ళ పాత చరిత్ర బయట పడినప్పుడల్లా రంగులు పూస్కున్నవాళ్ళంతా ఉదయమనక సాయంత్రమనక చెఱువుకు వెళ్ళి స్నానాలు చేసి రంగులు మార్చి మార్చి చివరకు ఏం చెయ్యాలో దిక్కు తోచకుండా వున్నారు.

కాని దీని పర్యవసానం నగరంలోని వాళ్ళకు వేరే విధంగా తగిలింది. ఇన్నేళ్ళు స్వచ్ఛంగా వున్న చెఱువు నీళ్ళు ఇప్పుడు రంగులతో నిండిపోయి బురదలా తయారైంది. ఎప్పుడూ ఈ నీటినే తాగడానికి అలవాటుపడిన ఆ ప్రాంతం వాళ్ళు ఇప్పుడీ రంగునీళ్ళు తాగగానే వ్యాధి గ్రస్తులయ్యారు. ప్రతిఒక్కరికీ ఒక్కో రకమైన విషజ్వరం అలుముకుంది. వాంతులూ, విరోచనాలతో ఆ నగరప్రాంతమంతా బీభత్సంగా తయారైంది. ఊళ్ళోని వైద్యులంతా ఒక్కుమ్మడిగా వచ్చి బాధితుల్ని ఆదుకొని, మందులిచ్చి వాళ్ళ ప్రాణాలు రక్షించడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు.

చివరకు ఈ ఘోరం సంభవించిన దానికంతా కారణం రంగులు మార్చిన జనం అని తెలియగానే ఆగ్రహంతో అందరూ ఉప్పెనలా పైకిలేచి, కఱ్ఱలు పుచ్చుకొని రంగులు మార్చిన వారి మీదకి దండెత్తేరు.

"ఒరేయ్! ఇకనుంచి మీరెవరైనా పచ్చరంగుకాని, ఎఱ్ఱరంగు గాని మరే రంగూ గానీ పూస్కొని ఊరేగారో మీ కాళ్ళు విరగ్గొడ్తాం" అని బెదిరించారు. ఈ బెదిరింపుతో నాయకుల అనుచరులంతా భయపడిపోయి ఎన్నికల ప్రక్రియకు తాము రాబోమని కచ్చితంగా తెలిపేసారు. మిగతా ఊరి జనం కూడా అదే మాటన్నారు.

అనుకున్నదొకటి అయిందొకటి అనుకుంటూ మంత్రి ఏం చెయ్యాలో తోచక క రాజును కలిసి ఉత్పన్నమైన పరిస్థితిని వివరించి దీనికి పరిష్కార మార్గం చెప్పవలసిందిగా కోరారు.

క రాజు కాసేపు ఆలోచించసాగాడు.

"చూశారామంత్రీ! అవకాశ వాదులు రంగులు మార్చడం వల్ల దేశంలో ఎంతటి అనర్థం సంభవించగలదో!? అయినా ఒక విధంగా ఇది మంచికే వచ్చింది. సన్మార్గులనుకున్న ఇద్దరు వ్యక్తుల నిజ స్వరూపాలు అందరికీ తెలిసిపోయిందికదా. ఇక ఎటూ జనం ఈ ఎన్నికల్లో పాల్గొనము అన్నారు కనుక ప్రస్తుతానికి దీన్ని రద్దు చేస్తున్నామని ప్రకటించండి. నేరస్తులను పట్టుకునే ప్రతిభ కనబరచిన దానయ్య, శీనయ్యలను నేరపరిశోధనాధికారులుగా నియమించండి. అన్నిటికంటే ముఖ్యం వర్షాలు వచ్చేవరకు ఆ ప్రాంతంలోని ప్రజలకు తాగునీటి వసతి ఏర్పాటు చెయ్యండి!" అని ఆజ్ఞాపించాడు కరాజు.

దానయ్య, శీనయ్యలు అనుకోకుండా వచ్చిన ఈ వరంతో ఆనంద భరితులయ్యారు. కొత్త ఆదర్శంలో వాళ్ళిద్దరూ ఆప్తమిత్రులయ్యారు. కొన్నాళ్ళకు వర్షాలొచ్చి చెఱువులోకి కొత్తనీళ్ళు రావడంతో మళ్ళీ యథాప్రకారం స్వచ్ఛంగా తయారైంది. ఇప్పుడు నీళ్ళల్లో ఏ రంగూ లేదు. అయినా ఊళ్ళో జనం మాత్రం దానిని రంగుల చెఱువనే పిలుస్తూంటారు.






బాపురమణీయం
Bapu Ramaneeyam

# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల
**6**

### జరిగిన కథ

మధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్ళవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. భామకు ఇది కంటగింపుగా ఉంటుంది. శ్రీధరం బావమరిది గిరి సత్యభామపై కన్నేస్తాడు. -(ఇక చదవండి)

డోర్ నాక్ చేసి గిరి రూమ్ లోకి వెళ్ళింది భామ.

"కమాన్ ..టేక్ ఎ లెటర్... ఇవాళ తెలుగు తన్ను కొస్తుంది. నేను తెలుగులో అంటాను. మీరు ఇంగ్లీషులో రాస్కోండి. టు ది ఛైర్మన్...డియర్ సర్....ఈ క్రింది కారణముల వల్ల...."చెబుతుండగా భామ చేతిలోంచి పెన్ను జారి క్రిందపడింది. దాన్ని తీసుకోవడానికి వంగింది భామ. ఆమె పాదాల వంక చూశాడు గిరి. గోరింటాకుతో పండిన దొండకాయల్లా ఉన్నాయి ఆమె కాలివేళ్ళు, గిరి నోట్లో లాలాజలం ఊరింది.



భామ కలం తీసుకుని రాస్కోవడానికి సిద్ధమైంది.

"ఈ క్రింది కారణముల వలన..వన్..టూ..త్రీ..ఫోర్.. వన్.. చక్కటి కళ్ళు ..టూ... చెక్కిన ముక్కు...త్రీ.. సింహం నడుములాంటి... భామ నన్నని నడుము చూసి "సన్నని నడుము... ఫోర్...... టోటల్ బ్యూటీల కారణంగా



........ ఇప్పటి దాకా టైపిస్ట్‌గా బూజు పట్టి ఉన్న అందాల భామ సత్యభామగారిని ఆర్ట్ డిపార్ట్‌మెంటుకు బదిలీ చేస్తూ....వెయ్యి రూపాయల ఇంక్రిమెంటు రికమెండ్ చేస్తున్నాను" ముగించాడు గిరి.



గిరి విపరీత ధోరణి భామకు చెమటలు పట్టించింది. "నాకా?వద్దు సార్... థ్యాంక్యూ. ..నేను టైపిస్టుగానే ఉంటాను" అన్నది సన్నగా వణుకుతున్న కంఠంతో.

"మీరు ఎలా ఉండాలో ఎక్కడ ఉండాలో అది శ్రీ ఆఫీసు వారిష్టం అంటూనే బెల్ కొట్టి ఆఫీసుబాయ్‌తో "ఆ...ఆర్ట్ గారిని పిలువు...కెమేరాతో..."అని, తిరిగి భామతో "ఏం? నాకు అందాన్ని గుర్తించే టేస్ట్ లేదనా? ప్రమోషన్లిచ్చే పవర్స్ లేవనా? " విషపునవ్వు విసిరాడు గిరి.

" అది కాదుసార్..."గుటకలు మింగసాగింది భామ.

కృష్ణమూర్తి వచ్చాడు. గిరికి విష్ చేశాడు.

"మీరేం ఆర్ట్ డైరెక్టరండీ? అందాన్ని ఓ మూల పడేసి ఎవరెవర్నో మోడల్స్‌గా పెడుతున్నారు. వెరీ బ్యాడ్. ఈ అమ్మాయిని సరిగ్గా చూశారా? మోడల్‌గా రమ్మంటే రానంటోంది" అన్నాడు గిరి.

"యస్సార్..అఫ్‌కోర్స్..బాగానే ఉంటుంది" అన్నాడు కృష్ణమూర్తి.

"అలా చప్పగా అంటారేంటండీ? చూడండి. ఆ చక్కని కళ్ళు, ఆ చెక్కిన ముక్కు- ఆ సన్నటి నడుము అది అసలు ఉన్నట్లా లేనట్లా అన్నట్లుంది. అసలు ఆ పాదాలు..జస్టే మినిట్..."అని లేచి ఒక స్టూల్ తెచ్చి భామ ముందుపెట్టి "మేడమ్ ...ఆ కుడికాలు ఈ బల్ల మీద పెట్టండి" అన్నాడు గిరి.



కృష్ణమూర్తి వంక ఏడుపు ముఖంతో చూస్తూ పాదాన్ని స్టూల్ మీద పెట్టింది భామ.

పాదం మీద అందంగా ఉన్న పుట్టుమచ్చను చూపించి కృష్ణమూర్తి వైపు చూసి "చూడండి ఆ పుట్టుమచ్చ (భామ కాలు క్రిందపెట్టబోతుంటే)జస్ట్ ఏ సెకండ్... ప్లీజ్... చూడండి తమల పాకులాంటి ఆ పాదం, సంగీతం లాంటి ఆ ఆర్ట్‌డిజైన్, దీపం లాంటి ఆ పుట్టుమచ్చ ..చాలు...చాలు... మనిషి అక్కర్లేదు" గిరి పైత్యం ముదిరి పోతున్నది.



కృష్ణమూర్తి ఆవేశాన్ని నిగ్రహించుకుంటున్నాడు. బయట పడితే తమ ఉద్యోగాలకు ఎసరొస్తుంది. పైగా అబద్ధాల కోర్లనే చెడ్డపేరు కూడా.

"ఆ పాదాలు, ఆ అంచు, ఆ పుట్టుమచ్చ కంపోజ్ చేసి ఫోటోలు తియ్యండి మా చీర లక్ష కాపీలమ్ముతాను" చెప్పాడు గిరి.

కృష్ణమూర్తి తటపటాయిస్తున్నాడు. కళ్ళముందే సోదర సమానుడు దుశ్శాసనుడు తన భార్య వలువలు వలిచేస్తుంటే అసహాయంగా వీక్షిస్తున్న ధర్మరాజునిలా, తన సమక్షంలోనే కీచకుడు సైరంధ్రిగా ఉన్న తన ఇల్లాలిని అవమానిస్తుంటే బయటపడితే గుట్టురట్టయి మళ్ళీ అడవుల పాలౌతామన్న భయంతో బేలగా తలదించుకున్న యుధిష్ఠిరునిలా మౌనంగా, నిస్సహాయంగా చూస్తున్నాడు.

తన ఆదేశం తక్షణం అమలు కాకపోవడంతో గిరికి కోపం వచ్చింది.

"ఆర్టుగారూ ..మీకు టేస్టు లేదు కదూ...కళాదృష్టి ఉండాలండీ. మీకు కనపడిందా మరి? నాక్కనపడింది. అదీ తేడా! ఇప్పుడు చెప్పండి. ఈవిడ మీ మోడల్‌గా పనికివస్తుందా?" అన్నాడు.



"యస్సార్ ...ఇలాంటి వారితో కలిసి పనిచెయ్యడం నాకూ సంతోషంగా ఉంటుంది" అన్నాడు కృష్ణమూర్తి.

భామ భయపడింది. "నాకు చాలా విచారంగా, బాధగా ఉంటుందండీ, థాంక్యూ సర్" అన్నది.

"మీరా ముగ్గు డిజైన్ శారీతో ఆ పాదం స్నాప్ తియ్యండి. నేను బాస్‌తో చెప్పి ఓకే చేయిస్తాను. నాది పూచీ. డోన్ట్‌వర్రీ" ఇక వెళ్ళవచ్చునట్లుగా చూశాడు గిరి.

* * *

ఇంట్లో - రాత్రి - పడకగదిలో

భామ కృష్ణమూర్తి ఛాతీమీద చెయ్యివేసి పసిపాపలా నిద్రపోతున్నది. ఆ రోజు ఆఫీసులో జరిగిన సంఘటనతో అతని మనసు చికాగ్గా ఉంది. గిరి మాటలు చెవిలో మార్మోగుతున్నాయి. "కళాదృష్టి ఉండాలండీ. మీకు కనపడిందా ఆ పుట్టుమచ్చ? నాకు కనపడింది. అదీ తేడా...." తను చూడని అందాలు తన భార్యలో మరో మగాడికి కనిపించాయ్! ఆ కళాదృష్టి తన కెందుకు లోపించింది? నిజమే! లేత తమలపాకు వంటి ఆ పాదం మీద ముచ్చటైన పుట్టుమచ్చ. రసహృదయాలను కవ్వించే శృంగారపు ముద్ర!

భామ చేతిని నిద్రాభంగం కలగకుండా తొలగించాడు, మెల్లగా లేచాడు. చీరను గిలకల పైకి తొలగించాడు. మసక వెలుతుర్లో నక్షత్రంలా మెరుస్తున్న పుట్టుమచ్చను చూసి పరవశించాడు. పాదాన్ని తాకి ముద్దుగా ముద్దుపెట్టుకున్నాడు. భామ నరాలు మెలిదిరిగాయి. మెదడు లోని కామతంత్రులు సవ్వడి చేశాయి. ఆల్చిప్పలాంటి నయనాలు తెరుచుకు న్నాయి. పుట్టుమచ్చను ముద్దులతో మురిపిస్తున్న భర్తను చూసి మత్తుగా నవ్వింది. చూడవలసిన అందాలు చాలా ఉన్నాయని ఆహ్వానించింది.

"అమ్మ దొంగా" అన్నది జుత్తులోకి వేళ్ళుదూనిపి. కృష్ణమూర్తి కళ్ళు అరమోడ్పులయ్యాయి. "మన పెళ్ళిపుస్తకంలో ఈ ఒక్క పేజీ ఎలా మిస్సయ్యానో? నేను చూడని, నేను చదవని పేజీ ఇదొక్కటే" అన్నాడు.

"మనం చూడని పేజీలు ఇంకా చాలా ఉన్నాయి. ఏ పేజీలో ఏముందో అదే థ్రిల్" నవ్వింది భామ.

"అమ్ముకుట్టీ...." పగలైతే దొరనే కానీ రాతిరి నా రాణివి నీవే సుమా అనుకుంటూ భామ కౌగిట్లో ఒదిగి పోయాడు కృష్ణమూర్తి.

* * *

ఆఫీసులో నిన్న తాను తీయించిన భామ ఫోటోలు చూస్తున్నాడు గిరి. ఎదురుగా లేడిలా కూర్చుంది భామ.

"టేక్ ఎ లెటర్..టుది మేనేజర్ .." చెబుతున్నాడు గిరి.

భామ కంగారుగా కేక పెట్టింది "ఏమైంది?" అడిగాడు గిరి. "ఏం లేదు...చెప్పండి" అన్నది భామ సర్దుకుని.

ఫోటోలో భామ పాదం మీది పుట్టుమచ్చను తడుముతున్నాడు గిరి. భామ మళ్ళీ అరిచింది దేనికో.

"మళ్ళీ ఏమైందండీ?" అన్నాడు గిరి కొంచెం కోపంగా.

"మీరు యజమానులు కావచ్చు. మేం పనివాళ్ళం కావచ్చు. కానీ ఆ ఫోటో నాది" అన్నది గద్గద స్వరంతో.

నవ్వాడు గిరి "ఈ కాన్సెప్ట్ నాదండీ! ఈ ఫోటో ఒక బ్యూటిఫుల్ మోడల్‌ది. మా చీరల పబ్లిసిటీ కోసం.." అన్నాడు.

"నో...నేను మీ మోడలింగ్‌కు ఒప్పుకోవడం లేదు" అన్నది భామ కొంచెం స్వరం పెంచి.

వీళ్ళ వాదన వినపడి కృష్ణమూర్తి లోపల కొచ్చాడు. అతనిని చూసి "నువ్వు నో అనడానికి నేను ఒప్పుకోవడంలేదు" అన్నాడు గిరి.

కృష్ణమూర్తి ధైర్యం చేశాడు. "మీకా హక్కులేదు. ఒకవేళ మీరు సెలక్టు చేసినా నేను ఒప్పుకోవడంలేదు. ఆవిడ ఒక ఇంటి ఇల్లాలు. పరస్త్రీ అంటారు. ఆవిడను కమాండ్ చేసే హక్కు మీకు లేదు" అన్నాడు.

"పరస్త్రీని సపోర్ట్ చేసే హక్కు నీకూ లేదు" అరిచాడు గిరి.

భర్త వత్తాసు లభించడంతో గిరి చేతిలోంచి ఫోటోలు లాగేసుకుని ముక్కలు ముక్కలుగా చించేసింది భామ. బయటకు వెళ్ళిపోయింది. కృష్ణమూర్తి కూడా బయటకు వెళ్ళిపోయాడు.

కోపంతో పళ్ళుకొరుకుతూ భామ పాదంలోని పుట్టుమచ్చ కనిపిస్తున్న ముక్కను తీసుకుని తదేకంగా చూస్తున్నాడు గిరి.

* * *

శ్రీధరం లౌక్యుడైన పారిశ్రామికవేత్త. తన వద్ద పనిచేసేవారి నుంచి రూపాయికి రూపాయి పనిచేయించుకోవడమేకాదు, అప్పుడప్పుడూ వారిని విందులకు,విహారాలకు తీసుకెళ్ళి తనపట్ల భక్తిగౌరవాలతో ప్రవర్తింపజేయటం కూడా తెలుసు. కార్మికులతో కర్కశంగా ఉండటమే కాదు, సన్నిహితంగా కూడా ఉండటం, తద్వారా యజమానితో తమకు ప్రత్యక్ష సాన్నిహిత్యం ఉందని భావిస్తూ అంకితభావంతో పనిచేసేలా వారిని తయారు చెయ్యడం ఆయన వ్యాపార విజయ రహస్యం. నేడు అభివృద్ధి చెందిన ఏ సంస్థను చూసినా మనకీ విషయం స్పష్టంగా బోధపడుతుంది.

అందులో భాగంగానే వనభోజనాలు ఏర్పాటు చేసి తన సంస్థ ఉద్యోగులందరినీ ఆహ్వానించారు శ్రీధరం దంపతులు. ఆడా,మగా, పిల్లాజెల్లా అంతా చేరారు.



వెంకటేశ్వరస్వామికి పూజ చేసి హారతి పట్టి అందరికీ చూపించింది మంగళ. అందరూ భక్తి భావంతో హారతి కళ్ళకద్దుకున్నారు.

హారతిని స్వామివారి ముందు పెట్టి "చేతికి వ్రేళ్ళు తలా ఒకరకంగా ఉన్నా అన్నీ కలిస్తేనే అన్నం తింటున్నాం. అలాగే మేమందరం ఒకే కుటుంబం. తరతమా లెంచుకునే బుద్ధులు పుట్టకుండా అందరం హాయిగా కలిసి పనిచేసి, కలిసి కట్టుగా ఉండేలా మమ్మల్ని దీవించు స్వామి" అని ప్రార్థించింది.

(ఇంకావుంది)

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 4



- ఇంద్రగంటి జానకీబాల

ఎవరినే..?
నేనెవరినే ..అంటూ 'బాలరాజు' సినిమాలో తనని తనే ప్రశ్నించుకున్న ముగ్ధమోహన రూపం, అద్భుతంగా పాడిన పాట అందర్నీ మంత్రముగ్ధుల్ని చేశాయి. ముఖ్యంగా 'బాలరాజు' సినిమాకి కూర్చిన సంగీతం, అందులో అందాలను అలవోకగా పలికించిన ఎస్. వరలక్ష్మి కంఠం అందరికీ గుర్తుండి పోయాయి.

కీ.శే. గూడవల్లి రామబ్రహ్మం 1937లో 'బాలయోగిని' అనే చిత్రాన్ని నిర్మించాలనే వుద్దేశంతో చిన్నపిల్ల కోసం చూస్తున్న సమయంలో ఎస్.వరలక్ష్మి ఆయన దృష్టి నాకర్షించింది. ఎనిమిదేళ్ళ పిల్లగా ఎస్.వరలక్ష్మి బాలనటిగా సినీరంగ ప్రవేశం చేసింది.

1928లో జగ్గంపేటలో పుట్టిన వరలక్ష్మి తాగుబోతు తండ్రి వల్ల కష్టాలుపడే తల్లి. ఒక అక్క,ముగ్గురు తమ్ముళ్ళు, ఒక చెల్లెలులను వదిలి పెద్దమ్మ (తల్లి అక్క) పెదనాన్నలతో కర్నూలులో పెరగసాగింది. పెదనాన్న రంగయ్య నాయుడు సంగీత వాయిద్యాలు, గ్రామఫోన్లు అమ్మే వ్యాపారం చేస్తూండేవారు-వరలక్ష్మి చక్కగా పాడేది.

చిన్నారి వరలక్ష్మి తెల్లారగట్ట మూడున్నర గంటలకు నిద్రలేచి సంగీత సాధన చేస్తూండేది. రంగయ్య నాయుడు ఎంతో శ్రద్ధతో ఆ పిల్లకి సంగీతం నేర్పిస్తూండేవాడు. శ్రద్ధగా వర్ణాలు, కృతులూ నేర్చుకుంటూనే ఆ రోజుల్లో చలామణిలో వుండి వినిపించే గ్రామఫోను రికార్డుల పాటలూ నేర్చుకుని పాడేస్తూ వుండేది వరలక్ష్మి.

ఒకసారి గూడవల్లి రామబ్రహ్మం ఏదో పని మీద కర్నూలు వెళ్ళారు. అక్కడ రంగయ్య నాయుడు షాపుకి వెళ్ళారు. అప్పుడు రంగయ్య నాయుడు వచ్చిందెవరో తెలుసుకుని ఎంతో సంతోషించి నెమ్మదిగా ఆయనతో మాట కలిపి "మా అమ్మాయి బాగా పాడుతుంది వింటారా" అని అడిగాడు.

రామబ్రహ్మం "తప్పకుండా వింటాను. అంతకంటే కావలసిందేముంది?"అన్నారు.

వెంటనే నాయుడు వరలక్ష్మిని పిలిచారు. పాట పాడాలని తెలియగానే కాళ్ళ పట్టీలు మోగించుకుంటూ చేతులకున్న గాజులు గలగల

## సుస్వరాల వరాల ఎస్వరలక్ష్మి



లాడిస్తూ వచ్చి పువ్వుల పరికిణీ బంతిపువ్వులా గుండ్రంగా పరచుకుని కూర్చుని పాడటం మొదలుపెట్టింది. నిజానికి ఒకటికి రెండుసార్లు అడగాలనీ, చిన్నపిల్ల కదా భయం తగ్గాక పాడితే విందామనీ అనుకున్న రామబ్రహ్మంగారికి ఆశ్చర్యమే ఎదురైంది. ఆ చిన్నారి ఆయనకు ఆ అవకాశమే యివ్వలేదు. ఇరుగు పొరుగు వారొచ్చి ఆ పిల్ల పాడటం ఆసక్తిగా వినడం మొదలు పెట్టారు. ఏకబిగిన కృతి తర్వాత కృతి పాడేస్తున్న వరలక్ష్మిని చూసి ఆయన ముచ్చటపడ్డారు. అన్నింటా కొత్తదనం కావాలని కోరుకునే రామబ్రహ్మం వరలక్ష్మి గొంతులోని కొత్తదనాన్ని గుర్తించారు.

'నేను వెళ్ళి వుత్తరం రాస్తాను. అమ్మాయిని తీసుకుని మద్రాసు రండి' అని వెళ్ళిపోయారు.

ఆరోజు నుండి బుల్లి వరలక్ష్మి, రామబ్రహ్మం ఎప్పుడు వుత్తరం రాస్తారా అంటూ ఎదురుచూసే వుత్సాహంలో కొన్నాళ్ళు స్కూలు కూడా మానేసింది.పెదనాన్నని అడగటానికి భయపడేది. రోజులు గడిచిపోయాయి. వరలక్ష్మి నిరుత్సాహపడింది. రంగయ్య నాయుడూ నిరుత్సాహపడినా పెద్దవాడు కనుక బయట పడలేదు 'మర్చిపోయారేమో' నని సరిపెట్టుకున్నారు.

నెల్లాళ్ళు గడిచాక వరలక్ష్మి స్కూలులో వుండగా పెదనాన్న వచ్చేసరికి హడలిపోయింది. తనేదో తప్పుచేసింది, అందుకే పెద్దనాన్నను పిలిపించారని వణికిపోయింది. కానీ ఆయన హెడ్‌మిస్ట్రస్‌తో, క్లాసు టీచరుతో చెప్పి ఇంటికి తీసుకొస్తూ 'నిన్ను తీసుకురమ్మని ఆయన తంతి యిచ్చారు'అన్న మాటలు విని ఇంటివైపు ఒకటే పరుగు.

అప్పుడు 'బాలయోగిని' లో మొదటిగా నటించింది వరలక్ష్మి. రెండవ చిత్రం ఒక తమిళ చిత్రం. దానిపేరు 'సేవాసదన్' -'ప్రేమసాగర్' అనే హిందీ చిత్రం మూడోది. అప్పట్నించి 'రైతు బిడ్డ', 'ఇల్లాలు', 'పరుశురామన్' (తమిళం) , 'అపవాదు'లాంటి చిత్రాలలో నటించినా వాటిలో తన పాటలకి ఎక్కువ ప్రాముఖ్యం లేదు. అయితే **'కోయిలొకసారొచ్చి కూసిపోయింది'**

అంటూ ఆమె 'ఇల్లాలు' (1940) సినిమాలో పాడిన పాటతో ఆమె పాటకు గుర్తింపు వచ్చింది. అందరూ మెచ్చుకున్నారు. 1942లో సాలూరి రాజేశ్వరావుతో కలిసి 'బాలనాగమ్మ'లో నటిస్తూ పాడారు.

1947లో 'వల్నాటియుద్ధం' లో **'చందమామా - ఓ చందమామా', 'ఈ కుహూరాతిరి'** అనే పాటలు పాడి మరొక్కసారి తన బాణీని, ప్రతిభని చాటి చెప్పుకుంది వరలక్ష్మి.

ఏమైనా 1948లో బాలరాజు సినిమా తోనూ, అందులోని పాటలతోను ఎస్.వరలక్ష్మి ఆంధ్రదేశమంతటా అఖండ ఖ్యాతి నార్జించారని చెప్పక తప్పదు.

'బాలరాజు' సినిమా కథ ఒక చిత్రమైన జానపద కథ. ఒక యక్షిణి భూలోకంలోకి వచ్చి, తన ప్రియునితో విలాసంగా గడుపుతూ ఇంద్రుని అజ్ఞను తిరస్కరిస్తుంది. ఇంద్రసభలో నాట్యం చేయడం తనకిష్టంలేదని, తనకి తన అందం, స్వేచ్ఛా కావాలని తెగేసి చెప్తుంది. ఆ యక్షిణి పాత్రలో అంజలీదేవి అద్భుతంగా నటించి, స్త్రీ అంటే ఆటబొమ్మ కాదని ధైర్యంగా పలికి చివరగా"అంతగా ఇంద్రుడికి నాట్యం కావాలంటే ఆయన సతీమణి శచీదేవిని చేయమనండి" అని పౌరుషంగా మాట్లాడి ఇంద్రుడి శాపానికి గురవుతుంది. ఆ శాపమేమంటే"నువ్వు భూలోకంలో మానవకాంతగా పుట్టి, నీ ప్రియుడు నిన్ను ఉపేక్షిస్తే అతని కోసం విరహంతో అలమటిస్తావు"అని.

ఆ యక్షిణి సామాన్య బాలికగా పుట్టి పెరుగుతుంది. సర్వసాధారణ సినిమా పద్ధతిలో ఆ పెరిగిన పిల్ల 'అంజలీదేవి'గా వుండాలి. కానీ ఇందులో ఆ పిల్ల ఎస్.వరలక్ష్మి - ఇలా జరగడానికి మరేదైనా కారణం వుండి వుండవచ్చునేమో గానీ, ఈ 'బాలరాజు' సినిమా ద్వారా ఎస్.వరలక్ష్మి తన అద్భుత సంగీత ప్రతిభను, అమె గళ సౌందర్యాన్ని దేశానికి చాటిచెప్పారు. ఆమె అందులో పాడిన పాటలు అందర్నీ ముగ్ధుల్ని చేశాయి. యక్షిణి రూపంలో 'అంజలీదేవి'కి ఈ తీయని వెన్నెల రేయి' అనే పాట వక్కలంక సరళ పాడారు. ఈ సినిమాకి గాలి పెంచల నరసింహారావు, ఘంటసాల వెంకటేశ్వరరావు నంగీతం కూర్చినట్టుగా వున్నా కొన్ని పాటల్లో సి.ఆర్.సుబ్బు రామన్ పోకడలు కనిపిస్తాయి. అయితే అప్పట్లో ఘంటసాల, సి.అర్. సుబ్బురామన్ దగ్గర పని చేస్తూ వుండేవారు. అందువల్ల ఆ ప్రభావం వుంటే వుండవచ్చు. ఆ పాటలకు వాద్యగోష్ఠి కూడా సుబ్బురామన్ అర్కెస్ట్రాదే.

**'ఓ బాలరాజ- జాలి లేదా బాలరాజా..'**

**'వతిరూవము నీయరయా'** పాటలు మరెవ్వరూ పాడలేనంత గొప్పగా వరలక్ష్మి పాడారు. ముఖ్యంగా 'ఎవరినే....నేనెవరినే..' పాటను దర్శకులు ఎంత ప్రతిభావంతంగా కట్టేరో, అంత గొప్పగా అర్థం చేసుకుని వారు ప్రయోగించిన 'గ్రహభేదం'తో అద్భుతంగా పాడి శభాష్ అనిపించుకున్నారు. అర్థం చేసుకున్నా, గొంతులో అంత బాగా పలికించటం అందరికీ కష్టమేగానీ, వరలక్ష్మికి చాలా సులువు.

ఈ సినిమాలో ఒక పాట అక్కినేని నాగేశ్వరరావుతో కలిసి పాడారు (పల్నాటి యుద్ధంలో రెండు; ఓహో చారుశీలా, నాగమ్మ తలగొట్టి). అప్పట్లో నటులే వీలయినంత వరకు పాడుకుంటూ వుండేవారు. ఈ 'బాలరాజు' పాటల గురించి అడిగినప్పుడు అక్కినేని చక్కగా వివరించారు.

"వరలక్ష్మి గారూ నేనూ కలిసి బాలరాజు సినిమా కోసం పాటలు పాడి రికార్డు చేశాం. ఆమెకి బాగా సంగీతం అదీ తెలుసు. వాయిస్ కూడా గంభీరంగా, అందంగా వుంది. ఆ గొంతు ముందు నాది అంత బాగున్నట్టుగా అనిపించ లేదు. నాకెలాగో వుంది. కానీ ఏం చెప్పేందుకూ భయం. పైగా ఏం తెలీదు. నేనిలా మధనపడు తుండగా ఆ సినిమా దర్శక నిర్మాత ఘంటసాల బలరామయ్యగారు కూడా కుర్రాడి వాయిస్ ఆమె గొంతు ముందు పీలగా వుంది అనుకున్నార్ట. కానీ ఎలా చెప్పడం కుర్రాడు నిరుత్సాహపడతాడు అని ఊగిసలాడుతున్న సమయంలో నేనే వెళ్ళి ధైర్యంచేసి "నాకెందుకో నా పాట నచ్చకుండా



వుంది. వరలక్ష్మి గొంతు ముందు నాది తేలిపోయినట్టుంది" అన్నాను. ఆయన వెంటనే 'నీకెలా చెప్పాలా అని బాధపడుతున్నా. నువ్వే అన్నావు కదా. అది నిజమే , నీకు ఘంటసాల వెంకటేశ్వరావు చేత ప్లేబాక్ పాడిస్తాం' అన్నారు. అయితే అప్పటికే నేనూ వరలక్ష్మి పాడిన పాట టేపు, డిస్కు తయారీ కోసం బొంబాయి వెళ్ళిపోయింది. అర్నెల్లు ముందు పంపితేగానీ సమయానికి డిస్క్ తయారవదు కదా! ఆ తర్వాత 'చెలియా కనరావా' పాట ఘంటసాలతో రికార్డుచేసి, నాకు ప్లేబ్యాక్ పెట్టారు. అందుకే డిస్క్‌లో నేనూ, సినిమాలో ఘంటసాల పాడింది వుంటుంది" అంటూ అక్కినేని నాగేశ్వరరావు గారు పాత జ్ఞాపకాలు నెమరేసుకుంటూ ఆనందంగా చెప్పారు.

"అంతేకాకుండా 'వతిరూవము నీయరయా' నాకెంతో ఇష్టం. ఆ పాట ఎంతో కష్టం పాడటం, కానీ ఆమె చాలా సులువుగా, గొప్పగా పాడేశారు" అన్నారు. ఆ పాటలో 'భవ భయ భంగా- రామలింగా' అనే చోట మరీ యిష్టం"- అన్నారాయన గుర్తుతెచ్చుకుంటూ.

1950లో ఎ.వి.ఎం. వారి 'జీవితం'లో ముఖ్యపాత్ర నిర్వహించారు ఎస్.వరలక్ష్మి. అందులో అందాల తార వైజయంతిమాలను పరిచయం చేస్తూ, బరువుగల పాత్రను ఎస్.వరలక్ష్మి కిచ్చారు. ఈమె మగవారి మాయ మాటలకు మోసపోయిన, ఒక పల్లెటూరు అమాయకురాలిగా చక్కగా నటించారు.

**"మేలుకోవె తెల్లవారె తెల్లగా"** అనే పాట బాగా ప్రచారం పొందింది. ఒక విషాద గీతం కూడా వుందిందులో.

ఆమె నటించిన 'శ్రీకృష్ణతులాభారం' ఆంధ్రదేశమంతటా గొప్ప విజయాన్ని సాధించింది. ముఖ్యంగా సత్యభామగా ఆమె పాడిన పాటలు, అందులో **'మీరజాల గలడా - నా యానతి'** అని వరలక్ష్మి పాడిన తీరు స్థానం వారినే సవాలు చేసేటట్టుగా వుంటుంది. ఈ **'మీరజాలగలడా'** అనే పాట నిజానికి గాయకులకు ఒక ఛాలెంజ్ - ఒక గీటురాయి అని చెప్పవచ్చు. నాటకంలో అత్యంత పాప్యులర్ అయిన ఈ పాటను స్థానం నరసింహరావు, కపిలవాయి రామనాథశాస్త్రి గ్రామఫోను రికార్డులుగా యిచ్చారు.

స్టేజి మీద కమలా చంద్రబాబు -జమున పాడారు. ప్లేబ్యాక్‌లో పి.సుశీల, ఎస్.జానకి పాడారు. - అయితే తనే నటిస్తూ పాడుకున్న ఎస్.వరలక్ష్మి పాటలో మాధుర్యం, ధీరత్వం అపారమైన నంగీత ప్రతిభవున్నాయి. 'వైదర్భికి....' అన్నచోట వలికించే వెక్కిరింపు,నిస్పాటం, అహంకారం ఒక స్థాయిలో వలుకుతాయి. ఈ 'కృష్ణతులాభారం' (1955) లోని పాటలు ఏవీ ఇప్పుడు దొరకడంలేదు. (రంగారావు-మోహిని॥, ఆంధ్రప్రభ ప్రచురణ, 1997) అందుకే దొరికిన 'మీరజాలగలడా?' పాటలో పి.సుశీల ప్రథమ స్థానంలో వుంటారు.

అసలు ఎస్. వరలక్ష్మి ఏ సినిమాలో వున్నా అందులో పుష్కలంగా మంచి పాటలుంటాయని సంగీతాభిమానులనుకుంటారు.

**లీలాకృష్ణా నీ లీలను నే**
**లీలగనైనను తెలియనుగా**

అంటూ మహామంత్రి తిమ్మరసు (1962) లో ఒక విలక్షణమైన పద్ధతిలో పాడారు. ఇందులోనే సుశీలతో కలిసి **'తిరుమల తిరుపతి వెంకటేశ్వరా - కోరిన వరముల నొసగుమయా'** పాట ఎప్పుడు విన్నప్పటికీ నిత్యనూతనంగా వుండటమే కాకుండా ఆ యిద్దరి కాంబినేషన్ ఎన్నిసార్లు విన్నా ఆశ్చర్యం కలిగిస్తుంది. ఒకరిని మించి ఒకరు పోటీపడి, విజృంభించి మరీ పాడారనిపిస్తుంది.

మంగళంపల్లి బాలమురళీకృష్ణ సంగీత సారథ్యంలో సతీసావిత్రి (1957) **'నమ్మితినే జననీ....'**గొప్పగా పాడిన పాట. అలాగే 'వీరభాస్కరుడు', 'వీరపాండ్య కట్టబ్రహ్మన్న' 'బభ్రువాహన' సినిమాలలో పి.బి.శ్రీనివాస్,

బి.గోపాలంలతో చక్కని యుగళగీతాలు పాడారు. బభ్రువాహన లాంటి సినిమాలు ఎక్కువ సక్సెస్ కాకపోయినా **'నాసాటివారు ఏచోట లేరు'** అంటూ ధీమాగా పాడిన తీరు ముచ్చటగా వుంటుంది.

'శ్రీ వేంకటేశ్వర మహాత్యం (1960)లో ఆమె **'శ్రీదేవినీ నీదు దేవేరినీ...'** గమకాలతో పాడటమే కాకుండా అదే సినిమా 'భగవాన్ బాలాజీ'గా డబ్బింగ్ చేసినప్పుడు **'శ్రీదేవి హమ్ తేరి అర్ధాంగినీ'** అంటూ నిరాఘాటంగా, భాష యందే మాత్రమూ భయం లేకుండా పాడారు. ఇందులో**'వరాల బేరమయా'** మంచి ఉషారుగా వరలక్ష్మి పాడినపాట.

ఎస్.వరలక్ష్మి పాడుతూ నటించిన చిత్రాలలో దాదాపు చివరి చిత్రం విజయావారి 'సత్యహరిశ్చంద్ర'. ఇందులో ఎన్నో పద్యాలు, ఒక దండకం, పాటలూ పాడే అవకాశం లభించింది. పెండ్యాల సంగీత సారథ్యం వహించిన ఈ 'సత్యహరిశ్చంద్ర' పెద్దగా హిట్ కాలేదు. డబ్బులు రాలేదు. దానికి కారణం "ఈ సినిమా నాటకంలా కాకుండా సినిమాలా వుండటమే దీని నేరం" అంటారు వి.ఏ.కె. రంగారావు గారు. 1965లో విడుదలైన ఈ చిత్రంలో హరిశ్చంద్రుడిగా ఎన్.టి.రామారావు, చంద్రమతిగా ఎస్.వరలక్ష్మి నటించారు. ఇందులో వరలక్ష్మి ఘంటసాలతో కలిసి పాడిన

**'నమో భూతనాథా**
**నమో భక్త పాలా - నమో దివ్యతేజా'**

అనే పాట బాగా ప్రజాదరణ పొందింది. శివుని గురించి చక్కని స్తుతిలా శ్రోతలు ఆదరించారు.

ఆ తర్వాత నెమ్మదిగా ఎస్.వరలక్ష్మి నాయిక పాత్రల నుండి వదినెగా, తల్లిగా, అత్తగా రూపాంతరం చెందారు. అలాంటి పాత్రలకు సాధారణంగా పాటలుండక పోవడం వల్ల పాటలూ ఆగిపోయాయి.

'దానవీరశూర కర్ణ'లో కుంతిగా, బంగారు పంజరం'లో రామన్నపంతులుగారి సరసన అతి నిక్కచ్చిగల జమిందారిణిగా, 'లవకుశ'లో భూదేవిగా బాగా రాణించారు.

ఎస్.వరలక్ష్మి పాటతో కలిసినప్పుడే ఆమె మంచి గాయక నటీమణిగా చెప్పుకోవాలి. పాటను పక్కకు పెడితే ఆమె ఎందరో మంచి నటీమణులలో ఒకరు. ఆమెకున్న గొప్పవరం ఆమె కంఠం, ఆమె సంగీత జ్ఞానం. అందరిలోనూ వేరుగా కనిపించేది ఆమె కంఠస్వరంలో వుండే ప్రత్యేకతయే.

ఎస్.వరలక్ష్మి అంటే ఆమె పాటే!

ఎస్.వరలక్ష్మి మొదట్లో కొన్ని ప్రయివేట్ రికార్డులు యిచ్చారు. ఏభైలకు ముందు ఎస్.రాజేశ్వరరావుతో కలిసి కొన్ని పాటలు పాడారు.

బసవరాజ అప్పారావు రచించిన **'ఆనందమే లేదా -లోకమున'** అనే యుగళగీతం బాగా పాప్యులర్.

**'కనవోయి వసంతము రేయి**
**మన వలపు సీమలో హాయి**
**నవవసంత వలపుపూల బాలనోయి'** ఆ రోజుల్లో బాగా పాప్యులర్ అయి, అందరి మన్ననలు పొందాయి. వీటి వరనలు ఘంటసాలవి.

ఆ తరం నటీమణుల్లో అంత బాగా పాడగలిగి, చక్కని రూపముండి, నటించగలిగిన కొద్దిమందిలో ఎస్.వరలక్ష్మి ఒకరు. భానుమతి లాంటి సమాన ప్రతిభగల గాయనితో పోటీపడి తనదైన శైలిలో తను నిలబడిన ఎస్.వరలక్ష్మి తెలుగువారికి సంగీత స్వరాల వరాలిచ్చిన వరలక్ష్మి తెలుగువారికి సంగీత స్వరాల వరాలిచ్చిన వరలక్ష్మి, సుస్వర లక్ష్మి. ●

---

### చిత్రం : బాలరాజు
**సంగీతం:గాలి పెంచలనరసింహారావు**
**రచన:సముద్రాలసీనియర్ గానం:ఎస్.వరలక్ష్మి**

ఓ బాలరాజా
ఓ బాలరాజా
జాలి లేదా బాలరాజా... ఆ... ఆ... ఆ...
బాలరాజా... బాలరాజా... ॥ఓ॥
చలమేల... మానరా
పరుగేలరా
నిన్ను మాని నిలువ జాల
నా.. రాజ రాజ ఓ బాలరాజా
ఈడుజోడు దాన ॥ఈడు॥
నీదానవోయి జాణ ॥ఈడు॥
కదలకు రాజా ॥కద॥
నను వదలకు రాజా
మాయని మమతలు
మదిలో రేపి ఊపి ॥మాయ॥
మాయ
మాయమయేనా పగలా వగలా ॥ఓ బాల॥

### చిత్రం : బాలరాజు
**సంగీతం:గాలి పెంచలనరసింహారావు. ఘంటసాల**
**రచన:సముద్రాలరాఘవాచార్య గానం:ఎస్.వరలక్ష్మి**

ఎవరినే...నే నెవరినే వగవగలా నే నెవరే.....
విరిసీ విరియని రేకల మురిసే మురిపమునే
తరతరాల వరాలైన
తరుణారుణ శోభనే ॥ఎవరినే॥
జగజగాల చిగురులకూ ఎగిరిపోవ గోరుదునే
యెవరే నన్నెగుర నీరు ఎందులకీ బంధమూ
ఎవరెరుగని గాధనే ఏమో
తెలియని బాధనే - ॥ఎవరినే॥

### చిత్రం : మహామంత్రి తిమ్మరుసు
**సంగీతం : పెండ్యాల**
**రచన : పింగళి గానం : ఎస్.వరలక్ష్మి**

లీలా కృష్ణా నీ లీలలు నే
లీలగనైనా తెలియనుగా
తెలిసీ తెలియని బేలల కడ - నీ
జాలములేవీ చెల్లవుగా ॥లీలా కృష్ణా॥
వేణు గానము న చేరగ పిలిచి
మౌనము పూనగ ఏలనో
అలక యేమోనని దరిరాకుండిన
జాలిగ చూచే వేలనో ॥లీలా కృష్ణా॥
నీ చిరునవ్వుల వెన్నెలలో
మై మరువగ చేయగ నేలనో
మైమరచిన చెలి మాటే లేదని
ఓరగ చూచే వేలనో.. ॥లీలా కృష్ణా॥

### చిత్రం : శ్రీకృష్ణతులాభారం
**సంగీతం : వైతా గోపాలం**
**రచన : స్థానం నరసింహారావు గానం : ఎస్.వరలక్ష్మి**

మీరజాలగలడా - నాయానతి
వ్రత విధాన మహిమన్- సత్యాపతి-
నటన సూత్రధారి - మురారి-
ఎటుల దాటగలడో - నాయానతి-
వ్రత విధాన మహిమన్ - సత్యాపతి ॥మీరజాల॥
సుధాప్రణయ జలధిన్ -వైదర్భికి
ఈద తావు గలదే - నాతోనిక
వాదులాడ గలడా - సత్యాపతి ॥మీరజాల॥
మధుర మధుర మురళీ గాన
రసా స్వాదమున
అధర సుధారస మదినే గ్రోలగ ॥మీరజాల॥

### చిత్రం : జీవితం
**సంగీతం : ఆర్. సుదర్శనం**
**రచన: తోలేటి గానం : ఎస్.వరలక్ష్మి**

ఆనందమౌగా పల్లెసీమా - మా పల్లెసీమా
దాన ధర్మాల కిల్లు మా పల్లెసీమ - మా పల్లెసీమా
రంగు బంగారు పైరులూ - పొంగారు పంటలూ
నాట్యాలు సేయు మా పల్లెసీమలో-
మా మంచి తీరూ - మా వూరు-
తియ్యని నీరూ- కోనేరూ ॥ఆనంద॥
దేశదేశాల పోషించు పల్లెసీమా -
ఆశలే లేని సహకారి పల్లెసీమా-
మాతోడ కూడి - మా తోవ చేరి
మన దేశానికి సేవ చేయాలీ- ॥ఆనంద॥

### చిత్రం : శ్రీకృష్ణార్జున యుద్ధం
**సంగీతం : పెండ్యాల**
**రచన:పింగళి గానం:ఎస్.వరలక్ష్మి & కోరస్**

వేయి శుభములు కలుగు నీకు
పోయిరావే మరదలా!
ప్రాణపదముగ పెంచుకుంటిమి
నిన్ను మరువగ లేములే ॥వేయి॥
వాసుదేవుని చెల్లాలా - నీ
ఆశయే ఫలియించెలే
దేవదేవుల గెలువ జాలిన
బావయే పతి ఆయెలే ॥వేయి॥
భరత వంశము నేలవలసిన
వీరపత్నివి నీవెలే
వీరధీర కుమారమణితో
మరల వత్తువుగానిలే ॥వేయి॥




రంగారావు స్వయంగా డాన్సర్, డాన్స్ క్రిటిక్. రెండు ఆలయాలలో గత ముప్పై ఎనిమిది ఏళ్లుగా నృత్యం చేస్తున్నారు. తెలుగుసినిమాలలో ఆయన కిష్టమైన నర్తకీమణులెవరని అడిగితే "కమలాలక్ష్మణ్, ఎల్.విజయలక్ష్మి చాలా బాగా చేశారు. 'విప్రనారాయణ'లో 'చింతామణీ'లో భానుమతి చాలా గొప్పగా చేశారు. అభినయం ఆవిడ ముఖంలో పలికినట్టుగా, భావాలు ఒలికించినట్లుగా ఏ డాన్సరు ముఖంలో పలకడం నేనెరుగను." అన్నారు.

సంగీతం, నృత్యంతో బాటు రంగారావు సాహిత్యాన్ని కూడా ఔపోసన పట్టారు. అహల్య రాయి అయిందన్న పుక్కిటిపురాణం గురించి రాస్తూ 'వాల్మీకి రామాయణమే అసలు సిసలు రామాయణమని నా ఉద్దేశం. అందులో గౌతముని శాపం అహల్య రాయివి కమ్మని కాదు. వాయుభక్షా, అదృశ్యరూపా, భస్మశయ్యా గా ఉండమని. అంటే దుమ్ములో పడివుండమని. రాముని ఆశ్రమ ప్రవేశంతో విమోచనమన్నాడు. అన్నమయ్య కూడా 'కామిని పాపము కడిగిన పాద'మని ('బ్రహ్మ కడిగిన పాదము'లో) అన్నాడు.'అంటూ రాశారు. అందుకే ముందుమాటలో ముళ్లపూడి రమణగారు రాసినట్టు రంగారావు 'మ్యూజికాలమిస్టే కాదు, మ్యూజికాలజిస్టు, లిటరేచరాలజిస్టు కూడా!'

ఆ కారణం చేతనే కాబోలు, ఈ పుస్తకంలో కనబడే వ్యాసాలు సంగీతానికే పరిమితం కాలేదు. పుస్తకసమీక్షలు, జానపద కళారూపాలు, దర్శనీయ క్షేత్రాలు, ఇతరపత్రికలలో వచ్చిన వ్యాసాలపై వ్యాఖ్యలు - అన్నీ కనబడతాయి. 'సరాగమాల' రాసే రోజుల్లో సమకాలీన సినిమాల పాటల గురించి రంగారావు వ్యాఖ్యల గురించి ఎదురుచూసేవారు. 'ఆలాపన'కు వచ్చేసరికి ఆ సౌలభ్యం పోయింది. ఏ వారం 'ఆలాపన'లో ఏమొస్తుందో ఎవరికీ తెలియని పరిస్థితి వచ్చింది. ఈ వారం 'ఆవారా' గురించి రాస్తే వచ్చేవారం 'కృష్ణాతీరం' గురించి కావచ్చు. ఆ పైవారం వరంగల్ కోటలో ఆయనకు ఆలయాలు చూపినతని గురించి కావచ్చు.

అయితే 'ఆలాపన' అని పేరు పెట్టినందుకు కాబోలు అన్ని వారాల్లోనూ క్రమం తప్పకుండా ఓ పాట సాహిత్యం ఇచ్చారు. వాటి సూచిక చివర్లో ఇచ్చారు. అవన్నీ పాతవే కావడం చూసి రంగారావుగారికి కొత్తంటే పడదు కాబోలు అనుకుంటే పొరబాటు. ఆయన తన అభిరుచుల గురించి చెబుతారు కానీ అందరూ అదే పట్టుకు వేళ్లాడాలని అనరు. పాతవాళ్లందరూ ఘనులని పొగడరు. మచ్చుకు కొన్ని -

"సంగీతపరంగా స్వర్ణయుగం అనేది మనిషి వయసును బట్టి మారుతుంది. మీ కొలమానాలు 12-19 సం॥ల మధ్య ఘనీభవిస్తాయి. నాకు 1938 నుండి 1951 వరకూ వచ్చిన సినిమా సంగీతం చాలా ఇష్టం, నేను దానిలో ప్రత్యేక పరిశ్రమ చేసినవాడిని కాబట్టి."

"'దేవదాసు'లో 'తానే మారెనా గుణమ్మే మారెనా' ఎందుకూ పనికిరాని టెక్స్ట్. ముందుగా అరవంలో 'అన్నే పావమా' అని తయారుచేసుకుని దానికి తగ్గట్టు రాసేరు. తను మారడం వేరు, గుణం మారడం వేరూనా? సాహిత్యం, ట్యూను పడుగు, పేకలా ఉండాలి. ఏది సరిగా లేకపోయినా చీర బాగా లేదంటాం."

"పాశ్చాత్య పోకడలు కర్ణాటకసంగీతంలో వినిపించింది ఇళయరాజా కాదు. ఏ.ఆర్.రెహమాన్ కాదు. త్యాగరాజు, దీక్షితార్! బ్యాండ్ మేళం వినే త్యాగరాజు 'శరశరసమరైక' కుంతలవరాళిలో చేశారు. అలాగే దీక్షితార్!"

"'చెంచులక్ష్మి'లో టైటిల్ మ్యూజిక్‌గా సి.ఆర్.సుబ్బురామన్ లాటిన్ అమెరికన్ మ్యూజిక్ వినిపించాడు."

"అదే సంవత్సరంలో 'మంగమ్మా శపథం' అనే తమిళసినిమాలో రాజేశ్వరరావు 'మామా యూ కేరో..'ఇంగ్లీషు ట్యూన్స్‌ను కొంతవరకు ఎడాప్ట్ చేసుకుని వరుసలు చేశారు."

"సుబ్బురామన్‌లో వుండే మంచితనం, రాజేశ్వరరావులో లేనిదీ ఏమిటంటే ఆ యా కంఠాలకి తగిన సంగతులే వేయడం. రాజేశ్వరరావువి సేడిస్టిక్ వేషాలు. సింగర్ కంఠంలో ఏ సంగతి పడదో ఆ సంగతి వేసి వారు పాడలేకపోతూంటే 'అమ్మాయిగారు అలా పాడటం లేదు సార్' అనేవాడు. పెండ్యాల ఎవర్ని పెట్టుకుంటే వాళ్ల కంఠాలలో ఏ ఒదుగు అందంగా ఉంటుందో అదే పెట్టేవారు. సి.రామచంద్ర కూడా టు ఏ లార్జ్ ఎక్స్‌టెంట్ అంతే!"

అంత గొప్ప రాజేశ్వరరావుపై ఇంత ఘాటు వ్యాఖ్యలా!? రమణగారు ముందుమాటలో అననే అన్నారు - 'రంగారావు తినడం కోసం కాకుండా వినడం కోసం బ్రతికే ఋషి. గడ్డం పెంచని, గాంభీర్యం నటించని మహర్షి. ఆగ్రహం వస్తే దుర్వాసుడు. అనుగ్రహం వస్తే అశుతోషుడైన భోళాశంకరుడు. పేచీ, పంతం వస్తే శకునీ, చాణక్యుడూ, మేకియవిల్లీ మేనమామ.'

మల్లాదిరామకృష్ణశాస్త్రిగారిపై వీరభక్తి చాటుకున్నా సముద్రాల-మల్లాది పాటల విషయంపై 'నడిరేయి గడిచేనే చెలియా' పాటపై రాసిన వ్యాసంలో రంగారావు తన అభిప్రాయం ఖచ్చితంగా రాశారు -



ఆలాపన (వ్యాస సంకలనం)
-వి.ఏ.కె.రంగారావు

**వెల** : 250/- రూ॥లు
**పబ్లిషర్** : డా॥భార్గవి, పామర్రు,
bhargavipmr@yahoo.com.in
**ప్రతులకు - విశాలాంధ్ర, నవోదయా**

"సముద్రాల జూనియర్ నాతో చెప్పిన ఒక విషయం గుర్తు చేసుకోవాలిక్కడ. "ఆ రోజుల్లో రచన మా నాన్నగారి పేరున ఉన్నా, నా పేరున ఉన్నా, దాంట్లో మల్లాది వారి హస్తం ఉండడానికి అవకాశం ఉంది." దీని వలన ఆ తండ్రీ కొడుకుల పేరున వచ్చిన ప్రతిపాట మల్లాది వారిదే అనుకోవడం అనవసరం. పోకడను బట్టి నిర్ణయించుకోవాలి."

రంగారావు ఆరాధించే మరో వ్యక్తి సి.రామచంద్ర. ఆయనను కలిసి మీరు పాడిన పాటలు చాలా బాగుంటాయని అంటే రామచంద్ర 'సంగీతంలో మీ టేస్టు చాలా పూర్. మీరు చెప్పిన పాటల్లో నూటికి తొంభైశాతం వేరెవరో పాడాలని ప్లాను చేసినవి. ఆ మనిషి అప్పటికి రాకపోతే నేను పాడాను. అవి గొప్పగా ఉన్నాయంటున్నావ్ నువ్వు." అని ఎగతాళి చేశాడు.

దానికి రంగారావు ఇచ్చిన వివరణ చాలా బాగుంది. "ఆయన్ని వండర్‌ఫుల్ సింగర్ అన్నాను కానీ గ్రేట్ సింగర్ అనలేదు. నా తరంలో గ్రేట్ సింగర్స్ అంటే రఫీ, ఘంటసాల యిద్దరే. ఎం.ఎస్.రామారావు ఒక పదిపాటలు వండర్‌ఫుల్‌గా పాడాడు. అతన్ని గ్రేట్ సింగర్ అని ఎవరూ అనరు. నేనూ అనను."

తనకు ఏ మేరకు నచ్చినదీ తనకు తాను బాగా తెలుసుకొని, ఆ మేరకే మెచ్చుకోవడం రంగారావు పద్ధతి అని ఈ వాక్యాలు తెలుపుతాయి.

(సశేషం)

**- ఎమ్బీయస్ ప్రసాద్**

“ఎలా చెప్పాలో తెలియటం లేదు డాక్టర్”
“ఏ ప్రాబ్లమైనా ధైర్యంగా చెప్పటం నేర్చుకోవాలి ఏం ఫర్వాలేదు చెప్పండి”.
“ఐతే, మీ అమ్మాయిని ప్రేమిస్తున్నాను డాక్టర్.”





పేషంట్ : నా మతిమరుపు పోవడానికి మంచి మందు ఇవ్వండి డాక్టర్.
డాక్టర్ : నేను డాక్టర్‌నని జ్ఞాపకం చేసినందుకు థ్యాంక్స్.



జడ్జి : పట్టపగలే దొంగతనం చెయ్యడానికి ఎంత ధైర్యం నీకు!?
దొంగ : ఏం చెయ్యమంటారు సార్ రాత్రి పూట నిద్రకి ఓర్చుకోలేక పోతున్నాను ఈ మధ్య.

**ఈ జోకులను పంపినవారు: ఏ.వి. మూర్తి, విశాఖపట్నం.**

“పెళ్ళిరోజున మా సంసారం [illegible] ఆరుకాయలుగా వర్ధిల్లాలని దీవించింది తమరే కదూ? కోపంగా పంతుల్ని ప్రశ్నించాడు సుధాకర్.
“అవును. ఏమైంది?”
“ఇంకా ఏం కావాలి...!? మా ఆవిడ మూడు కాన్పుల్లో ఆరుగురు పిల్లల్నికంది” అంటూ భోరుమన్నాడతను.





“బజార్లో కొనుక్కొనే వాటిని శుభ్రంగా కడిగి తినడం మంచి అలవాటు” అంటూ చెప్పి “ఇంతకీ నువ్వేం కొనుక్కొన్నావు? ” అని బాబిని అడిగింది వాళ్లమ్మ.
దానికి బాబి సమాధానం “ఐస్‌క్రీం”

**ఈ జోకులను పంపినవారు: బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం.**



టీచర్: హోమ్‌వర్క్ చేయకుండా బద్దకించిన వాళ్లను చేతులెత్తమంటే అందరూ ఎత్తారు. నీవు చెయి ఎత్తలేదంటే లెఖ్ఖలన్ని చేసుకొచ్చావన్నామాట.
స్టూడెంట్: చెయ్యిఎత్తడానికి కూడా బద్దకంగా ఉంది సార్.
టీచర్: ? ? ?

**ఈ జోకులను పంపించిన వారు: మేడామస్తాన్ రెడ్డి, విశాఖపట్నం.**



కస్టమర్ : అరటిపండ్ల ధర ఎంత బాబూ?
వ్యాపారి : డజను అయిదురూపాయిలు బాబయ్యా
కస్టమర్: రెండుడజన్లు తీసుకున్నా అంతేనా?
వ్యాపారి : అంతే ఎట్టా అవుతుంది బాబయ్యా? రెండు అయిదులు పదిరూపాయలు అవుతుంది.



“ఏంటయ్యగారు! అమ్మగారి గురించి ఏ విషయం వచ్చినా అలా పైకి శూన్యంలోకి చూస్తూ మాట్లాడతారు. కొంపదీసి, అమ్మగారు..” అంటూ కొత్తగా వచ్చిన ఆఫీసర్ని అడిగాడు ప్యూన్ భయం భయంగా!
“అబ్బే ! అలాంటిదేం లేదోయ్ ఆమెని నాకు ముడిపెట్టిన వాళ్ళు అక్కడ ఉన్నారు. వాళ్ళకి వినపడాలని వాళ్ళని తల్చుకుంటూ మాట్లాడతానంతే ” నిబ్బరంగా చెప్పాడా కొత్త ఆఫీసరు మళ్లీ పైకి చూస్తూ.



భార్య: పక్కపోర్షన్‌లో కొత్తగా వచ్చిన అన్నయ్య గారు సెక్రటేరియట్‌లో పనిచేస్తారుట! ఆ వదిన గారు చెప్పారు.
భర్త : అప్పడే వరసలు కూడా కలిపేసావే !?
భార్య : మీకిష్టం లేదంటే చెప్పండి, అలా పిలవను.
భర్త : అప్పుడే ఎలా చెప్పను...? నేనింకా ఆవిడ్ని చూడందే !?

**ఈ జోకులను పంపినవారు: రమణ శాస్త్రి సంగారెడ్డి.**

ఓ కెమిస్ట్రీ క్లాసులో .....
"మనం ఒక ఇనుప వస్తువును ఒక రాత్రి వర్షంలో పెడితే ఏం అవుతుంది?"
"తుప్పు పడుతుంది టీచర్"
"మరి బంగారు వస్తువును పెడితే?"
"మాయం అవుతుంది టీచర్"



ఓ సేల్స్‌మెన్ ఎంక్వయిరీ చేస్తున్నాడు. దానికి ఇంట్లో ఉన్నతని జవాబులు ఇలా ఉన్నాయి.
"మీరు వాడే టూత్ పేస్ట్ ?"
"శ్యామ్స్"
"మీరు వాడే బ్లేడ్ ?"
"శ్యామ్స్ "
"మీరు వాడే బనియన్ ?"
"శ్యామ్స్"
"ఇదేమిటి శ్యామ్ అనేది కొత్త కంపెనీయా... నేను ఎప్పుడూ వినలేదే !?"
"శ్యామ్ అనేది నా రూమ్‌మేట్ పేరు"




కారు యాక్సిడెంట్‌లో గాయపడిన తన భర్తను చూడటానికి హస్పిటల్‌కి వెళ్ళిందో ఇల్లాలు.
అప్పుడే కళ్ళు తెరిచి చుట్టూ ఉన్న కొత్త వాతావరణాన్ని చూస్తూన్న తన భర్తతో
" ఇప్పుడు మీరు స్వర్గంలో ఉన్నారు,తెలుసా!? " అంది పరిహాసంగా.
"నువ్వు చెప్తున్నది అబద్ధం" అన్నాడా భర్త
"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలరూ?" అందా ఇల్లాలు ఆశ్చర్యపోతూ.
"నువ్వు నా ప్రక్కన ఉంటే ఇది స్వర్గం ఎందుకు అవుతుంది చెప్పు!?" అని నిర్ధారించాడా భర్త.



**ఈ జోకులను పంపించిన వారు: జి. సురేష్ చౌదరి, తాడేపల్లి గూడెం.**



ఒకావిడ ఓ పత్రికాఫీసుకు ఫోన్ చేసి
"నాకు ఒకే డెలివరిలో ఆరుగురు పుట్టారు సెన్సేషనల్ న్యూస్‌గా మీ పత్రికలో వేస్తారా, ఫోటోతో సహా పంపిస్తాను" అడిగింది.
టెలిఫోన్ లైన్లు సరిగా లేవు.
"మళ్ళీ రిపీట్ చెయ్యగలరా మేడమ్" అంటూ నమత్రగా అడిగింది టెలిఫోన్ ఆపరేటర్.
"అబ్బే ఇప్పుడే కుదర్దు, ఇంకో సంవత్సరం పడుతుంది" అంటూ నిర్మొహమాటంగా చెప్పి ఫోన్ పెట్టేసిందావిడ.



"ఈ మాత్రల్ని సోమ, బుధ, శుక్రవారాల్లో వాడమన్నారు. వాడాను. కాని ఏమీ తగ్గలేదు డాక్టర్ గారు" అంటూ చెప్పాడు పేషంటు.
"అయితే మందులు సరిగ్గా వాడలేదేమో" సందేహపడ్డాడు డాక్టర్.
"సరిగానే వాడాను సార్. కానీ జ్వరం మంగళ, గురువారాల్లో వస్తోంది దానికేం చెయ్యాలో తెలీడంలా" అన్నాడా పేషంటు దీనంగా.

**ఈ జోకులను పంపినవారు: గొల్లపూడి శైలజ, హైదరాబాద్**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన
**ఏ.వి.మూర్తి-విశాఖపట్నం, బి.చంద్రశేఖరయ్య - రామసముద్రం, మేడా మస్తాన్‌రెడ్డి - విశాఖపట్నం, రమణశాస్త్రి - సంగారెడ్డి, గొల్లపూడి శైలజ-హైదరాబాద్, జి.సురేష్‌చౌదరి - తాడేపల్లిగూడెం గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'వన్స్‌మోర్ ఎన్.టి.ఆర్.' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**

SOHAN
MUSIC



# హాసం క్లబ్ కార్యక్రమ విశేషాలు

## రాజమండ్రి

ప్రముఖ ఇంద్రజాలికుడు పి.సి.సర్కార్ (సీనియర్) ప్రదర్శన ఇవ్వడానికి ఓ విదేశానికి వెళ్లారు. అనుకోకుండా ఆలస్యమయిపోయింది. ఏడుగంటలకు ప్రారంభం కావాల్సిన కార్యక్రమానికి అరగంట లేటయినా మెజీషియన్ రాకపోవడంతో ప్రేక్షకులు అసహనంగా ఉన్నారు. ఇంతలో వేదికపై సర్కార్ ప్రత్యక్షమయ్యాడు. ప్రేక్షకులు నోరు తెరిచి ఏదో అనబోయేటంతలో - 'నేను పంక్చువాలిటీ తప్పలేదు. కావాలంటే మీ గడియారాలు చూసుకోండి. సరిగ్గా ఏడయింది." అన్నారు సర్కారు. వాచీ చూసుకుంటే సరిగ్గా ఏడుగంటలే! "ఈ మాస్ హిప్నాటిజమే నా మొట్టమొదటి ఐటమ్" అన్నారు సర్కారు.

'ఈ రోజు సాయంత్రం సరిగ్గా 6.00లకు మీటింగన్నారు. 6.15 అయింది, ఇంకా ప్రారంభించరేమిటి అంటున్నారా? మిమ్మల్ని కూడా మాస్ హిప్నాటిజమ్ చేయడం జరుగుతోంది. (వాచీలకు బదులు) మీ చేతిలో కరపత్రాలు చూడండి. సభాసమయం 6.00లు అని ఉందా? లేదా?"

17.04.04న రాజమండ్రిలో 'హాసం క్లబ్' రెండో కార్యక్రమం ఆలస్యంగా ప్రారంభిస్తూ నిర్వాహకులు మొదట్లోనే పేల్చిన ఈ ప్రాక్టికల్ జోకును హర్షధ్వానాలతో ఆహ్వానించిన సభానదులు రెండుగంటలపాటు నడిచిన కార్యక్రమం ఆసాంతం ఇదేవిధంగా ఎంజాయ్ చేశారు.



జోక్స్ చెబుతున్న పెరుమాళ్ల రఘునాథ్

ఫ్యామిలీ ఎంటర్‌టైనర్స్ ద్వారా తెలుగు సినీప్రేక్షకుల హృదయాలను దోచుకున్న సౌందర్య ఆ రోజే మృతి చెందడాన్ని పురస్కరించుకుని రెండు నిమిషాల మౌనం ద్వారా 'హాసం క్లబ్' ఆమెకు శ్రద్ధాంజలి ఘటించారు;

## రాజమండ్రి 'హాసం క్లబ్' లో చదివిన వార్తావాహినిలో కొన్ని భాగాలు

'...ఎన్నికల సందర్భంగా జరుగుతున్న శబ్ద కాలుష్యం కారణంగా గాలిలో ప్రయాణం చేస్తున్న ఓ విమానం ఇంక ముందుకు సాగలేక నగరశివార్లలో ఉన్న ఓ అపార్ట్‌మెంటు కాంప్లెక్స్ డాబాపై బలవంతంగా ల్యాండ్ కావలసివచ్చింది. దాని కారణంగా ఇళ్లల్లో ఉన్న ఫర్నిచరు పాడయి ఆస్తినష్టం సంభవించింది కానీ ప్రాణనష్టం సంభవించలేదు. ఆ సమయంలో ఆ కాంప్లెక్సులో కరంటు లేని కారణంగా టీవీ సీరియల్స్ చూడడానికి యావన్మంది జనం పక్క కాంప్లెక్సుకు వెళ్లడం వల్ల జననష్టం జరగలేదని తెలిసింది. టీవీ సీరియల్స్‌ను విమర్శించేవారు వీటివల్ల జరిగే మేలును కూడా గుర్తించాలని 'జిల్ల టీవి' ఛానెల్ వారు ఈ సందర్భంగా విజ్ఞప్తి చేశారు.

అదే విమానంలో ప్రయాణం చేస్తున్న తాజామాజీ శాసనసభ్యుడు ఈ ప్రమాదం పై వెంటనే విచారణ జరిపించాలనీ, తమవంటి ప్రతిపక్ష సభ్యులతో కలిసి ఓ కమిటీ ఏర్పరచి విదేశాలలో ప్రమాదాలపై కూడా అధ్యయనం చేయించాలని ఆయాసపడ్తూ..క్షమించాలి..ఆవేశపడ్తూ.. డిమాండ్ చేశారు.

దీనిపై స్పందిస్తూ అవుననడానికి, కాదనడానికి ప్రస్తుతం తమ చేతిలో అధికారం ఏదీ లేదని, అంతా ఎన్నికల కమీషన్ ఇష్టాయిష్టాలపై నడుస్తోందని, వారు కనుక అనుమతిస్తే కమిటీ వెంటనే ఏర్పాటు చేస్తామని సంబంధిత మాజీమంత్రి హామీ ఇచ్చారు. అయితే కమిటీ సభ్యులకై ప్రతిపక్షాలనుండి సభ్యులను తీసుకోవాల్సిన అగత్యం పట్టలేదని తమ పార్టీకే చెందిన అసమ్మతివాదులు, టిక్కెట్టు దొరకని తిరుగుబాటు దారులు చాలినంత మంది ఉన్నారని ఈ సందర్భంలో జ్ఞాపకం చేశారు.'

..'ఎన్నికలలో ప్రతి పార్టీ కూడా రైతులను ఉద్దేశించి వారు దేశానికి వెన్నెముక అంటున్నారని, తమగురించి ఎవరూ పట్టించుకోవటం లేదని వ్యాపారస్తుల సభ నిరసన వ్యక్తం చేసింది. సభకు హాజరయిన 'ఫలానా' పార్టీ ప్రతినిథి వ్యాపారస్తుల వ్యథ అర్థం చేసుకున్నామని, ఇప్పటినుండి వ్యాపారస్తుల గురించి ప్రస్తావించేటప్పుడు 'పక్కటెముకలు'గా వ్యవహరిస్తామని హామీ ఇచ్చారు.'

'రాజమండ్రి పేపరుమిల్లు ప్రాంతంలో ఏర్పడిన దుర్వాయుగుండం పోను పోను తీవ్రమవుతూ పోయి బంగాళాఖాతంలోని వాయుగుండాన్ని తాకబోతోంది. దీని ప్రభావం వల్ల కోస్తావాసులకు అన్నంపై అనాసక్తి, వాంతులపై అనురక్తి కలిగే ప్రమాదం ఉందని, ఊపిరి బిగబెట్టడం వంటి సులభపద్ధతుల ద్వారా ఈ ప్రమాదం నుండి తప్పించుకోవచ్చని సంబంధిత అధికారులు ఓ పత్రికా ప్రకటన ద్వారా తెలియజేశారు. ఈ దుర్గంధం వల్ల గోదావరిలోని చేపలు కూడా ప్రాణాయామాన్ని అభ్యసిస్తున్నాయని వాటివల్ల తమ వృత్తికి హాని కలుగుతోందని జాలర్లు వాపోతున్నారు.'



టీవీ సీరియల్ టైటిల్ సాంగ్సు స్కిట్ ప్రదర్శిస్తున్న డి.వి.హనుమంతరావు, విజయలక్ష్మి

శ్రీయుతులు అప్పారావు, పెరుమాళ్ల రఘునాథ్, వి.పల్లంరాజు, కలా రామచంద్రమూర్తి, డా॥ పి.వి.మురళీకృష్ణ, కార్టూనిస్టు శేఖర్, రమణశ్రీ, మాధురి, వి.లక్ష్మి చక్కటి జోకులు వినిపించారు. ఎన్నికల మీద వ్యంగ్యోక్తులు, కవితలు వినిపించారు జో.రా.శర్మ.

మహమ్మద్ రఫీ, కిశోర్‌కుమార్ల సినీజీవితాల నుండి సినీనటుడు, గాయకుడు శ్రీ జితమోహన్ మిత్ర కొన్ని సంఘటనలను వివరిస్తూ సందర్భోచితంగా హిందీ సినీగీతాలు పాడుతూ సభికులను రంజింపజేశారు.

బేబీ మాధురి 'నే తొలిసారిగా కలగన్నది నిన్నే కదా' (సంతోషం) ట్యూన్‌లో టీవీ సీరియల్స్‌పై తన తల్లి రాసిన ప్యారడీపాటను పాడి ఆహూతులను ఆకట్టుకున్నారు. బేబీ శ్రీ లక్ష్మి 'లాలీ లాలీ అని రాగం పాడుతుంటె ఎవరూ నిదురపోరె - చిన్నబోదా మరి చిన్ని ప్రాణం' పాటని చాలా శ్రావ్యంగా పాడింది. చిరంజీవి తేజస్వి నృపేష్ పక్కలు ఎక్కి తొక్కే కోతుల గురించి సరదా రైమ్ ఒకటి చెప్పి అందరి చేతా 'ఔరా' అనిపించాడు.

శ్రీమతి విజయలక్ష్మి నటరాజ ప్రార్థన చేయడంతో బాటు రెండు ప్రఖ్యాత సినీగీతాలలోని పోలికలు సోదాహరణంగా పాడి చూపించారు. "అన్నానా మోహనా" (సారంగధర) పాట పల్లవితో మొదలుపెట్టి 'నిన్నె నమ్ముకున్నానని..' చరణం తర్వాత 'నీవె నాకు ప్రాణమని...,' (శ్రీకృష్ణార్జునయుద్ధంలోని 'అలిగితివా' పాటలోని చరణం) పాడి మళ్లీ ముక్తాయింపుగా 'ఆద మరచి ఎపుడైనా అన్నానా భామినీ'తో ముగించారు. శ్రీయుతులు సూర్యనారాయణ, ఎస్.కృష్ణారావు చక్కని లలితగీతాలు ఆలాపించారు.

కార్యక్రమ నిర్వాహకుడిగా వ్యవహరించిన శ్రీ డి.వి.హనుమంతరావు శ్రీమతి విజయలక్ష్మితో కలిసి 'టివిటైటిల్స్ స్కిట్', శ్రీ కానూరు నాగేశ్వరరావుతో కలిసి 'మతిమరుపు డాక్టరు' స్కిట్ ప్రదర్శించడంతో బాటు వ్యంగ్యవార్తలు చదివి వినిపించారు. ఆహూతులందరి పరస్పర పరిచయ కార్యక్రమంతో కార్యక్రమం ముగిసింది.

**తరువాతి కార్యక్రమం మే నెల 16, ఆదివారం సాయంత్రం గం॥ 6.35 ని॥లకు శ్రీరామనగర్‌లోని శ్రీఅప్పారావు గారి ఇంట్లో (ఫోన్ 0883-2438085)** జరుగుతుందని కన్వీనర్లు అప్పారావు, హనుమంతరావు గార్లు ప్రకటించారు.



'లిటిల్ మంకీస్' రైమ్ చెప్పి అందరినీ నవ్వించిన చి॥తేజస్వి నృపేష్

# ఏలూరు

ఏప్రిల్ నెల మూడవ ఆదివారం (18 04 2004) నాడు 'హాసం క్లబ్' సమావేశం సాయంత్రం 6 గం॥ 45 ని॥లకు ఏలూరు హాసంక్లబ్ కన్వీనర్లలో ఒకరైన డి.రామకృష్ణారావు గారి ఇంటివద్ద జరిగింది. ఈ సారి కార్యక్రమానికి కూడా ప్రశాంతి వాకర్స్ అసోసియేషన్ సభ్యులు అధికసంఖ్యలో హాజరయ్యారు. గరికపాటి సీతారామశర్మ, గరికపాటి ఆర్ట్ థియేటర్స్ నిర్వాహకులు గరికపాటి కాళిదాసు "చింతామణి" నాటకంలోని పద్యాలను ఆలపించారు. కరింశెట్టి సుబ్బారావు తెనాలి రామకృష్ణుని సమయస్ఫూర్తిని తెలియజేస్తూ "కుంజర యూథంబు దోమ కుత్తుక జొచ్చెన్" అన్న సమస్యాపూరణ ఘట్టాన్ని వివరించారు. శ్రీ యస్.వి.రామారావు 'సిరిగలవానికి చెల్లున్' పద్యంతో బాటు 'మీ ఓట్లే నే కోరుతున్నా' ప్యారడీపాట వినిపించారు. ఇంకా ఈ సమావేశంలో సీనియర్ అడ్వకేట్ డి.శివకుమార్ శాస్త్రి, రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్ కె.వి.యస్.ప్రకాశరావు, డి.అప్పారావు తదితరులు పాల్గొన్నారు. తదుపరిసమావేశం మే16 సాయంత్రం జరుగుతుంది.



సభాసదుల్లో గ్లోబలైజేషన్ జోక్ చెప్పిన తల్లాప్రగడ సుబ్బారావు, తదితరులు

నిర్వాహకులు యస్.వి.రామారావు, డి.శివకుమార శాస్త్రి

'గ్లోబలైజేషన్ అన్నది ఇవాళ పుట్టింది కాదు, 'మేరా జూతాహై జాపానీ' అనే పాటలో రాజ్‌కపూర్ ఎప్పుడో చెప్పాడు - చెప్పులు జపానీవి. పంట్లాం ఇంగ్లండుది, నెత్తిమీద టోపీ రష్యాది, హృదయం చూడబోతే హిందూస్తానీది' అని. అయితే పోను పోను గ్లోబలైజేషన్ మరింత పెరిగి, ప్రపంచం మరింత కుచించుకుపోయి, విశ్వమంతా కలిసి కుగ్రామం అయిపోయిందనడానికి ఓ చిన్న ఉదాహరణ -

**ప్రిన్సెస్ డయానా మరణం గురించి విన్నారు కదా, అక్కడ జరిగిన గ్లోబలైజేషన్ గురించి ఒక్కసారి ఆలోచించి చూశారా!?**

చనిపోయిన డయానా ఇంగ్లీషు యువరాణి. మరణించినది ఫ్రాన్సులో. ఆవిడతో బాటు చనిపోయిన బాయ్‌ఫ్రెండు **ఈజిప్టు** దేశీయుడు. వాళ్లెక్కిన కారు జర్మన్‌ది. దాని ఇంజన్ హాలండ్‌ది. డ్రైవరు బెల్జియం వాస్తవ్యుడు. అతడు మోతాదుకు మించి తాగినది స్కాటిష్ విస్కీ. వాళ్లను వెంటాడిన విలేఖరి ఇటాలియన్. అతనెక్కిన మోటర్‌సైకిల్ జపాన్‌ది. అతడు గాయపడ్డాక బ్రెజిల్‌లో తయారయిన మందునుపయోగించి చికిత్స చేసిన డాక్టరు **అమెరికన్!**

గ్లోబలైజేషన్ పతాకస్థాయిని చేరుకుందని ఇప్పటికైనా ఒప్పుకుంటారా, లేదా?

ఏలూరు 'హాసం క్లబ్'లో తల్లాప్రగడ సుబ్బారావు చెప్పగా హైలైట్‌గా నిలిచిన గ్లోబలైజేషన్ మీద జోకు యిది

# సరిగపదమని

కూర్పు : టి.నవీన్, హైదరాబాద్

**18**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | ● | 2 | | | ● | 3 |
| | ● | ● | 4 | | ● | ● | 5 | |
| ● | 6 | ● | ● | | ● | 7 | | ● |
| 8 | | ● | 9 | | ● | ● | | ● |
| | ● | 10 | ● | 11 | | 12 | ● | 13 |
| | ● | 14 | | ● | ● | 15 | 16 | |
| ● | 17 | | ● | 18 | ● | ● | | ● |
| 19 | | ● | 20 | ● | 21 | 22 | | 23 |
| | ● | 24 | | | ● | | ● | |

పంపినవారి పేరు :.................................................................

వయసు :........... వృత్తి :.........................................................

చిరునామా :........................................................................

.........................................................................................

.......................................................ఫోన్ :..............................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



**అడ్డం:-**

1. '.......... తీయగా చల్లగా ' (3)
2. మా ..... తల్లికి మల్లెపూదండ మాకన్న తల్లికి మంగళారతులు (3)
4. '......మంచు కరిగింది తలుపు తీయనా ప్రభూ' స్వాతి కిరణం చిత్రంలో సిరివెన్నెల గీతం (2)
5. '.......కావాలా పాటకావాలా ' చిరంజీవి అభినయించిన గీతం (2)
7. చిలకపచ్చ ...... పెట్టినాది కేక (2)
8. '.......సక్కనోడమ్మా చందమామా రాక రాక ఇంటికొచ్చె అయ్యే.....' మణిశర్మ స్వరపరిచిన గీతం (2)
9. 'అదిగో అల్లదిగో శ్రీహరి వాసము ......వేలు శేషుల పడగలమయము' అన్నమయ్య గీతం (2)
11. 'జయమ్ము నిశ్చయంబురా భయమ్ము ..........' (3)
14. '....... గంటలు మ్రోగిన వేళా మది సంబరపడుతోంది' (2)
15. '......... ముద్దులమావా నీకు రాసిస్తా రాయలసీమ' (3)
17. '.......బండిని నడిపేది పచ్చజెండాలే బ్రతుకుబండిని నడిపేది పచ్చనోటేలే (2)
18. '.....పాడితే లోకమే పాడదా' కొత్త మిస్సమ్మ పాట (1)
19. '......తాత మన బాపూజీ బాలలతాత బాపూజీ' దొంగ రాముడు చిత్రంలోని గీతం (2)
21. 'ప్రియా ...........రాగాలూ సఖీ కుశలమా అందాలు' నాగార్జున అభినయించిన గీతం (4)
24. '........లహరీ స్వప్నసుందరీ నువ్వే నాఊపిరి' కీరవాణి స్వరపరిచనదీ.. ఇటీవల మరణించిన తార (3)

**నిలువు:-**

1. ' పావురానికి పంజరానికి పెళ్ళిచేసె .......లోకం' వెంకటేష్ అభినయించిన గీతం (2)
2. '.......... ........... నెలరాజ నీ రూపు ........' రాముడు-భీముడు చిత్రంలోని పాట (5)
3. 'మళ్ళీ మళ్ళీ పాడాలి ఈ......' (2)
5. '....... వీధిలో హాయిగా ఎగిరేవు దేశ దేశాలన్ని తిరిగిచూసేవు' పాత మల్లీశ్వరిలో పాట (3)
6. '.........ఎంత మధురం ప్రియురాలు అంత కఠినం (2)
8. 'అందరి బంధువయా భద్రాచల ..........' (3)
10. '........ పూచే .........కాచే ఓ లచ్చా గుమ్మాడి' ముత్యాల ముగ్గులో పాట (3)
12. ....... క్రిష్ణయ్యా ...... క్రిష్ణయ్యా దీనులను కాపాడ ...... క్రిష్ణయ్యా (2)
13. 'సైయ్యారె ...... నేనేరా అన్నయ్య' (2)
16. 'విరిసినది .......గానం ' భైరవ ద్వీపం చిత్రం కోసం మాధవపెద్ది సురేష్ స్వరపరచినది (3)
17. 'చికు బుకు చికు బుకు ...... అదిరెను దీని స్టయిలే' ఏ.ఆర్.రెహమాన్ గీతం (2)
19. 'ఛాంగు.... బాగుంది కదా తమ జోరు' సౌందర్య అభినయించిన గీతం (2)
20. 'ఔనంటే .....నిలే కాదంటే ఔననిలే ఆడువారిమాటలకు అర్థాలె వేరులే' (2)
22. '......హో నగరి కలకత్తాపురి (2)
23. భారత ......కు జేజేలు(2)

**పజిల్, కూపన్ 15-05-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)




రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



29

**హెచ్చరిక**

బిరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





**జరిగిన కథ**

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తుంది. దాన్ని చంపడానికి పెట్టిన ఎలుకమందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చు పెట్టిస్తారు. ఎలుకను చంపడానికి పిల్లిని తెస్తే పిల్లికూనలు పెడుతుంది. వాటిలో ఒకటి చస్తుంది. ప్రాయశ్చిత్తం అంటూ తూతూమంత్రాలతో పురోహితుడు దోచుకుంటాడు. ఈ కష్టాలన్నిటికీ వాస్తు సరిగ్గా లేకపోవడం కారణమంటూ వాస్తుపండితులు భయపెడతారు. **(ఇక చదవండి)**

"ఏంటలా పేకాటలో సర్వస్వం కోల్పోయిన వారిలా దిగాలుగా ఉన్నారు? ఏమైంది?" అడిగాడు వక్రతుండం.

సుందరికి బీరకాయ పీచు బంధువు వక్రతుండం. వరసకు బాబాయి అవుతాడు. కోర్టు కేసులో సాక్ష్యం చెప్పడానికి హైదరాబాద్ వచ్చాడు. హోటల్ ఖర్చును పార్టీ ముందుగానే చెల్లించినా ఖర్చు కలిసొస్తుంది కదా అని సుందరి ఇంటికి వచ్చాడు. అతగాడి బాంధవ్యాన్ని గుర్తుకు తెచ్చుకోడానికి గంట పట్టింది సుందరికి.

"నా పెళ్ళిలో ఎక్కడా నిన్ను చూసినట్లు గుర్తులేదే" అన్నది సుందరి.

తాను పేకాటలో ఉండటం వలన పెళ్ళి పందిట్లోకి రాలేకపోయానని, సరిగ్గా సూత్రధారణ సమయానికి తాను షో చేసి రెండు మూడు కౌంట్లు లెక్కపెట్టుకోవాల్సి వచ్చి అక్షింతలు వేయలేక పోయానని వివరణ ఇచ్చాడు వక్రతుండం.

వెంకట్రావు ఆఫీసు నుంచి వచ్చాక ముభావంగా ఉండటంతో వారి దిగులుకు కారణమడిగాడు.

మొదటినుంచి జరిగినదంతా పూస గుచ్చినట్లు వివరించాడు వెంకట్రావు.

"అబ్బో...అయితే ఇంట్లో చాలా లోపాలున్నాయి. ఇల్లు కట్టేముందే ఎవరైనా మంచి వాస్తు పండితుడికి చూపించాల్సింది" అన్నాడు వక్రతుండం.

"దాదాపు వంద వాస్తు గ్రంథాలు తిరగేశాను మామయ్యగారూ" చెప్పాడు వెంకట్రావు.

"అది పెద్దపొరపాటు. ఏ ఒక్క రెండు గ్రంథాలు ఒకటిలా ఉండవు. ఒక వాస్తు పండితుడు రాసే దానికి మరొకడు రాసే దానికి పొంతన ఉండదు. అందుకని ఏదో ఒక్కదాన్నే నమ్ముకోవాలి".

"వాస్తుకు అంతటి పవరుందా మామయ్య గారూ?"

"తిన్నగా అంటావేంటి అల్లుడూ? వాస్తు అనేది మహా పవర్‌ఫుల్. ఇంటికి, రోడ్డుకు,




గ్రామానికి, పట్నానికి, రాష్ట్రానికి, దేశానికి, ప్రపంచానికి కూడా వాస్తు అనేది చాలా అవసరం. రెండో ప్రపంచ యుద్ధంలో అణుబాంబులతో సర్వనాశనమై కూడా జపాన్ అంత త్వరగా కోలుకుని అగ్రదేశం ఎలా అయిందంటావ్? ఆ దేశంలో సూర్యుడు ముందుగా ఉదయిస్తాడు. ఆ సహజ వాస్తు ప్రభావం వలన జపాన్ అభివృద్ధి చెందిన దేశమైంది".

"అసలీ వాస్తుకు అర్థమేంటి బాబాయ్?"

"చెబుతా. వాస్తు అనేది గొప్ప వ్యాకరణ పదం. వాస్ అంటే వ్యాసుడు. తు అనగా ఉద్భవించినది. టోటల్‌గా వాస్తు అంటే వ్యాసుడి ముఖతా ఉద్భవించినదని పిండితార్థం".

"ఈ వాస్తు అనే మాటకు ఒక్కొక్కరు ఒక్కోరకమైన నిర్వచనం ఇస్తున్నారు".

"అంతే అల్లుడుగారూ, తెలిసీ తెలియని వారినడిగితే అలాగే చెబుతుంటారు. తూర్పు పడమరలు తెలిసిన ప్రతివాడు నేడు వాస్తు నిపుణుడే".

"అయితే మీరు తెలిసే చెబుతున్నారా?"

"ఒహ్హో..హ్హో...అహ్హా..హ్హా...హ్హా..అల్లుడుగారు భలే చమత్కారి. అల్లుడుగారూ... నేను గత ఏభైసంవత్సరాలుగా మా స్వగ్రామంలోనూ చుట్టుపక్కల గల పాతిక గ్రామాల్లోనూ వాస్తు చెబుతున్నాను. ఒక్కమాటలో చెప్పాలంటే వాస్తులో నేను వాస్తవంగా పండిపోయాను".

"అయితే చెప్పండి. మాఇంట్లో వాస్తు లోపాలకు పరిష్కారం ఏమిటి?"

"మీరేం దిగులు పడకండి. మంచి తాపీ పనివారిని నలుగురిని మాట్లాడండి. ఏవేం కూలగొట్టాలో క్షణంలో కూలగొట్టించి అవతల పారేస్తాను. సిటిలో ఎలాగూ రెండురోజుల పని మీదొచ్చాను. మరో రెండు నెలలుండటానికి నాకేం అభ్యంతరం లేదు".

"ఎంతో కష్టపడి దగ్గరుండి మరీ కట్టించాను మామయ్యగారూ...ఆర్నెల్లపాటు ఆఫీసుకెళ్ళి సంతకం చేసి అఫిషియల్ వర్క్ అని రిజిష్టర్లో రాసి ఇంటికొచ్చి దగ్గరుండి వాస్తు పుస్తకాలు చేతపట్టుకుని చదువుతూ కట్టించాను. దీన్ని కూలగొట్టడానికి నా మనసు అంగీకరించడంలేదు. దాని కంటే ఉన్నదాన్ని ఉన్నట్లు అమ్మెయ్యడం మంచిది".

"చూడబ్బాయ్..ఎవరికంటికీ కనిపించని, ఉందో లేదో తెలియని మనసు అనే పదాన్ని పట్టుకుని వేలాడుతూ మనం నిర్ణయించవలసిన విషయాలను దాని అంగీకార అనంగీకారాలకు వదిలెయ్యడం ప్రాజ్ఞుల లక్షణం కాదు. ఇన్ని లోపాలున్న ఇంటిలో మీరు నివసిస్తూ నానా కష్టాలూ పడుతుంటే పెద్దముండాకొడుకులం మేము చూసస్తూ కూర్చోలేం కదా. ఇల్లు కూలగొట్టడమా అమ్మేయడమా అనే విషయం నా కొదిలిపెట్టు".

"ఏమిటో...సరైన సలహా చెప్పే వారెవరూలేక..."

"అది ఇంతవరకూ. ఇప్పుడు నేనున్నానుగా. ఇహ మీకు ఏ చీకూ చింతావద్దు".

"ఇల్లు కట్టించడం సులభమే కానీ అమ్మడం చాలా కష్టం మామయ్యగారూ".

"భలే వాడివే అల్లుడూ, ఇళ్ళు అమ్మడంలో నాకు నలభైసంవత్సరాల అనుభవం ఉన్నది".

"అంటే మీరు రియలెస్టేట్ బిజినెస్ చేసేవారా?"

"రియలెస్టేటా నా బొందా? అన్నీ సొంతిళ్ళే అమ్ముకున్నాడు" చెప్పింది సుందరి.

"సొంతిళ్ళా? ఎన్నిళ్ళున్నాయి మీకు? దేనికమ్మారు?" ఆశ్చర్యంగా అడిగాడు వెంకట్రావు.

"దేనికా? పేకాటకు" నిష్ఠూరంగా అన్నది సుందరి.

"చూడమ్మాయ్..అలా అనకూడదు. పేకాట అనేది నిమిత్త మాత్రం, అసలు కారణం పరువు ప్రతిష్టలు. చూడండి అల్లుడుగారూ...నేను ఇరవై



నాలుగు గంటలూ పేకాటాడే మాట నిజం. పేకాట కోసం అరడజను వారసత్వంగా వచ్చిన ఇళ్ళు, అరవై ఎకరాల పొలం, నూటిరవై సవర్ల బంగారం అమ్మిన మాట నిజమే. ఒకసారి డబ్బులన్నీ అయిపోయి ఒకడికి ఐదురూపాయలు అప్పుపడ్డాను. అంత మాత్రానికి వాడు మా వంశం గురించి అనరాని మాట అన్నాడు. పరువుకోసం ప్రాణాలిచ్చే వంశం మాది. అందుకే అయిదు రూపాయల కింద ఎకరం పొలం రాసిచ్చేశాను.. ఈ నాటికి ఆ సంఘటనను మా ప్రాంతంలో ఒక విశేషంగా చెప్పుకుంటారు'' నవ్వుతూ చెప్పాడు వక్రతుండం.

"అబ్బో.... అయితే మీకు పేకాట పిచ్చి చాలా ఉందే" అన్నాడు వెంకట్రావు.

"అదే మనదేశ దౌర్భాగ్యం. క్రికెట్టును, హాకీని, బరువులెత్తడం, దించడంలాంటి వాటిని ఆటలంటారు. ఇంకా అందంగా క్రీడలు అంటారు. పేకాటను మాత్రం పిచ్చి అంటారు. మనవాళ్ళకసలు టేస్టులేదు. నన్నడిగితే పేకాట అనేది ఎ గేమ్ ఆఫ్ స్కిల్. పదమూడు ముక్కల్లో ఎంత టెన్షన్?! ఏం ముక్కలొస్తాయో తెలియదు. అవతలవాడికి ఏం కావాలో ఊహించి గ్రహించి వాడికి కావలసింది వెయ్యకూడదు".

"అయితే అనుభవం బాగానే సంపాదించారు"

"పేకాటలో నాది అరవై ఏళ్ళ అనుభవం. కార్డువెనుక నుంచి చూసి అదేం కార్డో చెప్పగలను. నా జీవితంలో నేను కొన్న పేక సెట్లు నిజంగా భద్రపరచాలంటే ఫుడ్‌కార్పొరేషన్ వారి గోడౌన్లు కూడా సరిపోవు. అదేదో పిన్నీసు బుక్కో ఏదో అంటారు చూడండి..."

"గిన్నీస్ బుక్...."

"ఆ..అదే.. న్యాయానికి నాపేరు దాన్లో సువర్ణాక్షరాలతో లిఖించాలి".

"అంత మజా ఉందా పేకాటలో?"

"తిన్నగా అంటారేంటి? పేకాడుతుంటే ఆకలికాదు. నిద్ర పట్టదు. డబ్బుగెలిచినా ఆడాలనిపిస్తుంది. ఓడినా ఇంకా ఆడాలనిపిస్తుంది. ఎంతసేపు ఆడినా విసుగు పుట్టదు. రెండు రోజులు కూర్చున్నా నడుము నొప్పి అనిపించదు. ఒకసారేమైందో తెలుసా?"

"చెప్పండి"




"ఒకరోజు నేను క్లబ్బుకు పోతుంటే...మీ ఆవిడకు నెలతప్పింది. సాయంకాలం ఆస్పత్రికి తీస్కెళ్ళాలిరా.. అన్నది మా అమ్మ. సరేనని వెళ్ళాను. రమ్మీ భలే రంజుగా సాగుతున్నది. ఒకటే ఉత్కంఠ. అది ఉదయమో తెలియదు. సాయంత్రమో తెలియదు, రాత్రో తెలియదు. నేనేదైనా పనిమొదలుపెట్టానంటే శ్రద్ధ, భక్తి, ఏకాగ్రతతో చేస్తాను. మీ ఆవిడ ప్రసవించింది ఇంటికి రారా అని మా అమ్మ కబురు పంపిస్తేగానీ తెలియలేదు. అప్పటికి తొమ్మిది మాసాలనుంచి ఆపకుండా ఆడుతున్నానని" పెద్దగా నవ్వాడు వక్రతుండం.

నోరు తెరిచాడు వెంకట్రావు "మరీ అంత పట్టుదలా?"అన్నాడు.

"మరి! మన పెద్దలేమన్నారు? పట్టరాదు. పట్టి వీడరాదు అన్నారు. ముక్కలు చేతపట్టామంటే అమీతుమీ తేలిందాకా వదలక పోవడం శూరుల లక్షణం".

"పెద్దలు ఆ మాటన్నది పేకాటకా?" అన్నది సుందరి.

"చూడమ్మాయ్..సామెతలను మనకు సరిపోయేట్లుగా అన్వయించుకోవడం వివేకుల లక్షణం".

"పేకాట అనేది ఒక మత్తు లాంటిది" అన్నాడు వెంకట్రావు.

"పొరబాటు. అదో గమ్మత్తు. ఒక విషయం తెలుసా? పెళ్ళిళ్ళకు వెళ్ళిన మగాళ్ళలో ఎంతమంది అసలు పెళ్ళి చూస్తున్నారు. పెళ్ళిమంటపం ఎక్కడుందో కూడా చూడకుండా పేకాటకు ఎక్కడ దుప్పటి పరచాలా అని చూస్తారు. ఆఖరుకు సూత్రధారణ సమయంలో కూడా కూర్చున్న చోటునుంచే అక్షింతలను ఎడమచేత్తో విసిరేస్తుంటారు. ఒకసారి నేను అలా విసిరిన అక్షింతలు అక్కడున్న వెధవముండ బోడిగుండు మీద పడటంతో అది మమ్మల్ని తిట్టి దిగపారబోసింది".

"ఎంత అనుభవముంటే ఏం లాభం? ఆస్తులన్నీ పోగొట్టుకున్నారుగా!"

"అది ఆత్మజ్ఞానం లేనివాళ్ళనే మాట. వెధవాస్తులు! పోయేటపుడు కట్టుకుపోతామా? మనిషికి అరవై ఎకరాల భూమి ఉన్నా చచ్చిన తరువాత కావలసినదెంత? ధర్మరాజు ఎంతటి జ్ఞాని! అటువంటి వాడు రాజ్యాన్ని, అన్నదమ్ముల్ని, జాయింటు భార్యను సైతం పాచికలాటలో పోగొట్టుకున్నాడు. అంత మాత్రాన ఆయన పరువు ప్రతిష్టలకు భంగం కలిగిందా? గౌరవం తరిగిందా? ఆయనను జూదగాడని లోకం నిందించిందా?లేదే! మాట కోసం అడవుల పాలైన ఘనుడిగా ముల్లోకాలూ ఆయనను కీర్తించాయ్! ఆ రోజుల్లో ప్రజలకు అంతటి సంస్కారం ఉన్నది. కాబట్టే ధర్మం నాలుగు పాదాలా నడిచింది".

"పోనీ వాళ్ళు పడిన కష్టాలు చూసైనా ఇటువంటి జూదాలు మానుకోవచ్చు కదా?"

"చూడండల్లుడుగారూ. యుద్ధం అన్న తరువాత ఎవరో ఒకరే గెలుస్తారు. గెలుపూ ఓటమి చీకటి వెలుగుల్లాంటివి. ఎల్లకాలమూ చీకటి ఉండనట్లే ఓటమే ఉండదు. గెలుపోటముల చాలా సహజం. ధీరుడెపుడూ ఓటమిని పట్టించుకోడు. పేకాటలోని ఉత్తేజం, ఉద్వేగం తెలిసిన వాడు ఓటమిని గడ్డిపరకలా చూస్తాడు".

"ఏంటో ఆ ఉత్తేజం,ఉద్వేగం".

-(ఇంకావుంది)

# నితిన్






## బాలీ-వుడ్‌కు ఆదరణ!

ఓ వ్యక్తి అంతరాల్లో దాగున్న ప్రతిభ ఏ రోజున బయటపడుతుందో ఎవ్వరూ చెప్పలేరు. దేనికైనా సమయం రావాలని పెద్దలు అందుకే చెబుతుంటారేమో! ఓ ఛానల్ లో ప్రొడక్షన్ కో- ఆర్డినేటర్‌గా పనిచేసే నితిన్ బాలి..ఆ తర్వాత పాప్‌స్టార్ అవుతాడని ఎవరూ ఊహించి వుండరు - అతని తండ్రి తో సహా!

జీవితంలో ప్రతి మలుపు ఓ కొత్త అనుభవాన్ని ఇస్తుందనడానికి నితిన్ బాలి జీవితం ఓ గొప్ప ఉదాహరణ. ముంబాయిలోని రిజ్వి కాలేజీలో కెమిస్ట్రీలో పట్టాపొందిన నితిన్ బాలి నిజానికి సంగీతంలో ఏ రకమైన శిక్షణా తీసుకోలేదు. జీ.టి.వి. లో ప్రొడక్షన్ కో -ఆర్డినేటర్‌గా కెరీర్‌ను ప్రారంభించాడు. ఆ ప్రారంభ దినాల గురించి చెబుతూ " ప్రసార మాధ్యమాలలో పనిచేయాలనే కోరిక నాకుండేది. అందుకోసమే జీ సంస్థలో చేరి దాదాపు మూడు సంవత్సరాలు పనిచేశాను. ఆ తర్వాత ఛానెల్ 'వి' లో నాకు మెరుగైన అవకాశం వచ్చింది. అక్కడ వుండగానే ఎబిసిఎల్ (అమితాబ్‌బచ్చన్ కార్పొరేషన్ లిమిటెడ్)లో మళ్ళీ ప్రొడక్షన్ మేనేజర్ ఉద్యోగం రావటంతో అటువెళ్ళాను. 1996 లో ఎబిసిఎల్ సంస్థ ఆధ్వర్యంలో జరిగిన ప్రపంచ అందాల రాణి పోటీ నిర్వహణలో నేను పాలుపంచుకున్నాను. మొత్తం మీద చిన్నతనం నుండి సంగీతం మీద అభిమానం వుండటం.... జీ..వి... ఛానెల్స్ లో పనిచేసినప్పుడు వివిధ సహాయకులు - సంగీత నిపుణులతో ఏర్పడిన పరిచయం నన్ను ఓ గాయకుడిని చేశాయి" అని చెప్పారు.

## విఫలమైన ప్రేమ వివాహం



ప్రముఖ యాంకర్, నటి రూబీ భాటియాను 1996లో నితిన్‌బాలి ప్రేమించి మరీ పెళ్ళి చేసుకున్నాడు. అయితే ఆ మూడుముళ్ళ బంధం మూడేళ్ళకే తెగిపోయింది. 1999లో వీరిద్దరూ విడిపోయారు. విడాకులూ తీసుకున్నారు. రూబీ భాటియాతో ఎడబాటు గురించి నితిన్ మాట్లాడటానికి అంగీకరించకపోయినా - రూబీ మాత్రం తమ అనుబంధాన్ని ఇలా చెప్పింది : "నేను ఛానెల్ 'వి' లో యాంకర్‌గా వున్నప్పుడు మేం సాయంత్రాలు ఖరీదైన హోటల్స్‌లో జాలీగా గడిపేవాళ్ళం. నేను ఆశించినట్టుగా నితిన్ గొప్పగా చదువుకోలేదు. అలానే మా అలవాట్లు - అభిరుచుల్లో కూడా ఎంతో తేడా వుంది. కానీ ఆ సమయంలో నేను మనసు చెప్పినట్టు ప్రవర్తించాను. ప్రేమ అన్నింటినీ అధిగమింపచేస్తుందని భావించాను. 1996లో నితిన్‌ను పెళ్ళి చేసుకుని ముంబాయి శివార్లలో కాపురం పెట్టాను. భర్త, డబ్బు, సంతోషం - విజయం అన్నీ వున్నా నాకు ఏదో తెలియని వెలితిగా వుండేది. దేవుడు లేకుండా నా జీవితం పరిపూర్ణం కాదని నేను భావిస్తుండే దానిని. కానీ అది నితిన్‌కి అర్థం అయ్యేది కాదు. అతను ముందు సిగరెట్లు తాగడం మానేస్తానని హామీ ఇచ్చాకే మేం పెళ్ళి చేసుకున్నాం. కానీ అతను ఆ దురలవాట్లను మానలేదు. నేను మంచి అమ్మాయిలా వుండాలని కోరుకుంటాడు తప్పితే అతను అలా వుండాలని అనుకోడు. దాంతో నాకు నితిన్ అంటే గౌరవం పోయింది. ఇక విడాకులే మంచిదని 1999 జనవరిలో విడిపోయాం" అని చెప్పింది రూబీ భాటియా.

## మొదటి ఆల్బమ్ 'నా జానే'

ఇవాళ పాప్ఆల్బమ్ విడుదల చేయటం అనేది నల్లేరుమీద బండినడకలా అయిపోయింది. సంగీతంలో అనుభవం, అవగాహన లేని వ్యక్తులు కూడా పాప్ఆల్బమ్స్‌ను అలవోకగా విడుదల చేసేస్తున్నారు. ఆడియో మార్కెట్‌లో స్థబ్దత నెలకొనడానికి క్వాలిటీలేని పాప్ఆల్బమ్స్ రావడం కూడా ఓ కారణం. సహజంగానే సంగీతాభిమానులు ఈ రకమైన ఆల్బమ్స్‌ను వినడానికి ఉత్సుకత చూపడంలేదు. ఈ నిరాసక్త ధోరణి కారణంగా మంచి ఆల్బమ్స్‌ను ఒకోసారి దాటేస్తున్నారు. అయితే అదృష్టవశాత్తు నితిన్ బాలి తొలి ఆల్బమ్ 'నా జానే' ఆ రొటీన్ కేటగిరిలోకి చేరలేదు.

ఎనిమిది పాటలున్న ఈ ఆడియోలో వీలైనంత వైవిధ్యాన్ని నితిన్ ప్రదర్శించాడు. అయితే ఈ ఆల్బమ్ రూపకల్పన ఓ విషాద సంఘటనతో ప్రారంభమైంది. తనలోని గాయకుడిని వెలికితీసి ఆల్బమ్ చేయడానికి తీవ్రంగా ప్రయత్నించడమే కాకుండా - నితిన్ -తన స్నేహితుడు మనుచోప్రాతో కలిసి కొన్ని గీతాలను రచించాడు. ఓ డెమో టేప్‌ను తయారుచేశాడు. ఈ పాటల్ని మొట్టమొదట తన తండ్రికే వినిపించాడు నితిన్. గాయకుడిగా కొడుకు కొత్త జీవితానికి నాంది పలుకుతున్నాడని నితిన్ తండ్రి సంతోషించాడు. పాటలూ ఆయన్ని విపరీతంగా ఆకట్టుకున్నాయి. కానీ పాపం అదే రోజు రాత్రి గుండె పోటుతో తనువు చాలించాడు. నితిన్ బాలికి ఇది ఊహించని దెబ్బ. ఈ అశనిపాతం నుండి కోలుకున్న నితిన్ బిఎంజిక్రెసెండో సంస్థలోని సురేష్ థామస్‌ని కలిశాడు. నితిన్ పాటలు థామస్‌ను బాగా ఆకట్టుకున్నాయి. వెంటనే బాలి ఆల్బమ్ 'నా జానే'ను విడుదల చేయడానికి సంస్థ అంగీకారాన్ని తెలిపింది. అలా 1997 లో నితిన్ పాప్ సింగర్‌గా సంగీత ప్రపంచానికి పరిచయం అయ్యాడు.

సురేష్ థామస్ అందించిన సహకారం- ఇచ్చిన స్వేచ్ఛ ఇప్పటికీ మరవలేనని నితిన్ బాలి చెబుతున్నాడు. తొలి ఆల్బమ్‌లోని పాటల గురించి చెబుతూ "ఇందులో పాప్, భాంగ్రా -పాప్ టెక్నో,రాప్.. ఇలా అన్ని రకాలు వున్నాయి. కేవలం ఒకే తరహా పాటల్ని పాడే పాప్ గాయకుడిగా ముద్ర వేయించుకోవటం నాకిష్టం లేదు" అని చెప్పాడు. అయితే తొలి ఆల్బమ్‌కి లభించిన ఆదరణ, గుర్తింపును చూడటానికి తన తండ్రి లేకపోవటం ఎంతో బాధకు గురిచేసిందని నితిన్ చెబుతున్నాడు. 'నాజానే' సక్సెస్‌తో నితిన్ 'అఖఁ నల్ అఖియఁ మిలైజా' (AKKHAN NAL AHHKIAN MILAIJA)ను విడుదల చేశాడు. మొదటి ఆల్బమ్‌లో మెలోడి భాంగ్రా రొమాంటిక్ సాంగ్స్‌కు ప్రాధాన్యం ఇచ్చిన నితిన్ ఇందులో మూడు పంజాబీ గీతాలు, ఐదు హిందీ రొమాంటిక్ సాంగ్స్‌కు స్థానం కల్పించాడు.

## రీమిక్స్ వైపు దృష్టి!

మార్కెట్ నాడిని పట్టుకున్న నితిన్ పాప్ ఆల్బమ్స్ కంటే రీమిక్స్‌లకు ఆదరణ పెరగడంతో తన దృష్టి అటు మరల్చాడు. కిషోర్‌కుమార్ ఎవర్‌గ్రీన్ సాంగ్స్‌ను ఎంపిక చేసి 'బాలి-వుడ్' పేరుతో వరుసగా రెండు క్యాసెట్స్‌ను మార్కెట్ లో విడుదల చేశాడు నితిన్‌బాలి. మొదటి రెండు కంటే కూడా గాయకుడిగా అతను పరిణతి చెందాడని ఈ రీ-మిక్స్‌లను చూస్తే అర్థం అవుతుంది. మాతృకలోని స్వచ్ఛతను కోల్పోకుండా రీ-మిక్స్ చేసి మరోసారి సక్సెస్‌ని పొందాడు. 'సంగీతమంటే వున్న అభిమానంతోనే తానా రంగానికి వచ్చానని డబ్బుకంటే కెరీర్ తనకి ప్రధానమని చెబుతున్న నితిన్ బాలి గాయకుడిగా మరెంత ఎత్తుకు వెళతాడో వేచి చూడాలి.

**- వి. అరుణసత్యవతి**






వెల : రూ॥ 32/-
విడుదల: సోహాన్ మ్యూజిక్

# రాజా ఆడియో రివ్యూ

జగపతిబాబు,కళ్యాణి హీరోహీరోయిన్లుగా ఎం.ఎల్.కుమార్‌చౌదరి నిర్మించిన 'పెదబాబు' ఆడియో క్యాసెట్ విడుదలయింది. చక్రి ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

క్యాసెట్‌లో తొలుత వినిపించే - 'నవ్వవయ్యా బాబూ నీ సొమ్మేం పోతుంది' పాటని ఆడియోకి, సినిమాకి కూడా హిట్ సాంగ్‌గా పేర్కొనాలి. చాలా మంచి, క్యాచీ, హిట్ ట్యూన్‌ని ఈ పాటకు ఇచ్చాడు చక్రి. తన పర్సనల్ హిట్స్‌లో ఒకటిగా నిలిచిపోయే స్థాయిలో పాడింది కౌసల్య. పాట మధ్యలో జగపతిబాబు వాయిస్‌తో మాటలు, చివర్న చక్రి పాడిన చరణం వస్తాయి. జగపతిబాబుకి తగ్గట్లుగా పాడటంలో కూడా చక్రి మంచి ఎఫెక్టనిచ్చాడు. 'నవ్వు నీలవేణీ' దగ్గర ఎఫెక్ట్‌ని బాగా గమనించవచ్చు. భాస్కరభట్ల రవికుమార్ ఈ పాటని తన మానసిక గురువు సీతారామశాస్త్రి గారి పంథాలో రాయడానికి ప్రయత్నించాడనిపిస్తుంది. **'ఆడదిలా వెంటపడీ అడుగుతుండగా - మూతినలా ముడుచుకుని ఎంతసేపలా'** ఇది సీతారామశాస్త్రిశైలి. దాన్ని బాగా పట్టుకున్నాడు రవికుమార్. అలాగే చక్రి కూడా ఇళయరాజా మెలోడీస్‌ని బాగా గుర్తుచేస్తున్నాడు. ఈ పాట ఇంటర్లూడ్స్‌లోనూ, చరణాలలోనూ ఆ ఇన్‌స్పిరేషన్ బాగా కనిపిస్తుంది.

'నాలో నువ్వుండాలి నీలో నేనుండాలి' పాటకూడా ఇళయరాజా మెలోడీయే అన్న ఫీలింగ్ కలగజేస్తుంది. ఒక విధంగా ఆ స్వర స్రవంతి తిరిగి జన స్రవంతిలో ప్రవహించటానికి చక్రి కారకుడు కావటం ప్రశంసించదగ్గ విషయం. చరణాల సెకాండాఫ్‌లో స్త్రీ,పురుష స్వరాలతో కట్స్ అండ్ కౌంటర్స్‌గా పాడించడం ట్యూన్ పరంగా ఎంత బావుందో అందుకు తగ్గ సాహిత్యాన్ని సమకూర్చడం కూడా అంతే బావుంది. భాస్కరభట్ల రచనకి కౌసల్యతో పాటు పాడిన యస్పీబాలు కంఠం, ఆ స్పష్టత వినగానే పాటలోని అక్షరాలకే కాకుండా శ్రోతలకు కూడా ప్రాణం లేచొచ్చినట్టుంటుంది.

జాలాది రాయగా రవివర్మ, సునీతా బాలాజీ పాడిన 'బావ బావ బావా ముగ్గులోకి రావా' పాట పూర్తిగా సరదా పాట. ఇందులోని గాయని సునీతా బాలాజీ మనకు తెలిసిన గాయని కమ్ డబ్బింగ్ ఆర్టిస్ట్ సునీత కాదు. ఈ సునీతా బాలాజీ ప్రస్తుతం కె.విశ్వనాథ్ తీస్తున్న 'స్వరాభిషేకం' సినిమాలో నటిస్తోంది కూడా! ఈ పాట రెండో చరణానికి ముందు అకార్డియన్ వాద్యానికి ప్రాధాన్యతనిస్తూ వినిపించిన ఇంటర్‌లూడ్ సంగీతపరంగా గుర్తించదగినది. అకార్డియన్ మీద ఇంత లెంగ్త్ ఇంటర్లూడ్ ఈ మధ్య ఏ తెలుగు పాటలోనూ రాలేదేమో! వెనుకటి రోజుల్లో ఈ వాద్యానికి ఉత్తరాదిన శంకర్ - జైకిషన్ మాత్రమే ఇంత ఇంపార్టెన్స్ నిచ్చేవారు. ('సంగమ్'లోని 'హర్ దిల్ జో ప్యార్ కరేగా' పాటలో రాజ్‌కపూర్ పాడుతూ వాయించేది ఈ వాద్యమే)

జాలాది రాసిన 'ఒక వేకువ దీపంతో ఈ లోకం మేలుకొని' పాటకు మాటలు హాయిగా వినిపించే ట్యూన్ జతపడింది. సంబరాల పాట కదాని మాటల్ని మింగేసే వాద్యఘోషని జోడించకపోవడం వల్ల పాట మీద సదాభిప్రాయం పెరుగుతుంది. మళ్లీ ఇన్నాళ్లకు బాలు గొంతు విలువ, ఆయన పాడే పద్ధతి విలువ - సంగీత దర్శకులు తెలుసుకుంటున్నందుకు సంతోషంగా అనిపిస్తుంది- ఈ పాట వింటుంటే!

ఇదే పాటని శాడ్ వెర్షన్ లో - వేరే ఒక చరణంతో బిట్ సాంగ్‌గా ఏ సైడున పొందుపరచడం జరిగింది. ఇందులో "ఏడడుగుల జీవితమా' అంటూ జాలాది రాసిన వాక్యం ఎంతో గొప్పగా ఉంది. ఒక జీవితం ఇంకో జీవితంతో ముడిపడాలంటే ఏడడుగులు, అదే జీవితం వరినమాప్తమయ్యాక పూడ్చిపెట్టడానికి ఏడడుగులు.... హాట్సాఫ్ టు జాలాది!!

జాలాది రాసిన 'ఫెళ్లున విరిగిందిరో శివధనసు పెళ్లికి రమ్మందిరో సీతమనసు' పాటక్కూడా హుషారైన ట్యూన్ జతపడింది. కౌసల్య, సందీప్‌భౌమిక్ కూడా మాంఛి ఊపుతో పాడి సంగీత సాహిత్యాలని బాగా ప్రాజెక్ట్ చేశారు. ■

**రచన: భాస్కరభట్ల రవికుమార్ (1) గానం : కౌసల్య, జగపతిబాబు, చక్రి**

ఆ: నవ్వవయ్యా బాబూ....
నీ సొమ్మేం పోతుంది...........నీ సోకేం పోతుంది ॥2॥
నవ్వు దొరబాబూ...!
అరె నీకేమయ్యింది చిరునవ్వే రాకుందీ ॥2॥
ఆడదిలా వెంటపడీ అడుగుతుండగా
మూతినలా ముడుచుకునీ ఎంతసేపటా..
తెగ ఉరిమిన ఆకశాన నవ్వు చినుకులే
నవ్వు చినుకులే ..ఓయ్ పెదబాబూ.. ॥నవ్వవయ్యా॥
మూటలే తరిగేనా.... కోటలే కూలేనా
నవ్వితే ఓసారి...కొంపలే మునిగేనా
వింతలే జరిగేనా.... ఇంతలో ఏ(మైనా
నవ్వితే మనసారా...కొండలేం కరిగేనా
నేను చూడలేదురోయ్... నువ్వు నవ్వగా
అంత కోపమెందుకోయ్...వరసకు బావా....
ఇదిగో ఈ వేళా నవ్వాలా
పకపకమని కిలకిలమని కాకుల రొదలా
అ: ఏయ్....ఏంటీ!?
ఆ: కోకిలా శృతిలా ॥నవ్వవయ్యా॥
మణులే అడిగానా... మాన్యాలడిగానా
నువ్ తప్ప ఏమైనా....నిన్ను నేనడిగానా
నగలే అడిగానా...నాణ్యాలడిగానా
చిన్న నవ్వు కాకుండా... చీరలే అడిగానా
దాచుకోకు నవ్వునీ పెదవి చాటునా
ఫక్కుమంటు నవ్వితే చాలనుకోనా
చెబుతా వింటావా ఇపుడైనా
పడిపడి నువు నవ్వర మరి నా అత్తకొడకా
అ: ఒళ్ళిలా వుందే...!?
ఆ: కాదని అనకా... ఒరేయ్ పెదబాబూ
అ: నవ్వు దొరసానీ....
చిరునవ్వుల సవ్వడితో...నువ్వు సందడి చేయాలి ॥2॥
నవ్వు నీలవేణీ....
కొంటెనవ్వుల పల్లకిలో....నిను రోజూ చూడాలి ॥2॥
అ: నిత్యమల్లె పువ్వులాగ నువ్వు ముద్దుగా
నవ్వుతుంటే ముత్యమైన సాటిరాదుగా
గలగలమని నవ్వుతుంటే నాకు పండగా..నాకు పండగా

**రచన: జాలాది (3) గానం: సునీతాబాలాజీ, రవివర్మ**

ఆ: బావ....బావ....బావా....ముగ్గులోకి రావా
ముద్దులాడి పోవా.. సింగారంగా
అ: భామ...భామ...భామా... ముగ్గులోని ప్రేమా
ముద్దబంతి సిగ్గులా వుండాలంట
ఆ: అలాగైతే ఇలా వచ్చి ...భలేగా పెళ్ళి చుక్క పెట్టరాదా
అ: ప్రేమకైనా పెళ్ళికైనా .....అదేదో కలిసివచ్చే కాలముందిగా
ఆ: ముద్దు పుట్టినప్పుడే చంకనెక్కమంటే
మొక్కుబడి మాటలింక ఎందుకంట
అ: హేయ్ చంకలోని బిడ్డకు
చందమామ ముద్దుకు .....
సంబరాల వేళ కాదుగా ॥భామ॥
ఆ: కొండమీద పొద్దుకి........ కలువలమ్మ ముద్దుకి
బంధమేదో...అనుబంధమేదో
అ: కారుమబ్బులొచ్చినా..... కాలమెంత మారినా
తీరదంటా.. ప్రేమ మారదంట.
ఆ: కలవపువ్వు రేకులన్ని రాల్చకుండా
కాలమంత వుంటుందా .. హోయ్..
అ: చేసుకున్న పుణ్యమే దేనికైనా
ఆశ తీర్చకుంటుందా...
ఆ: అందుకే నా బావా..... నా పొందులోకి రాలేవా
అ: శివ శివ ఓ బేలా ఇక్కడెందుకీ గోలా ॥భామ॥
అ: వాన చుక్క వరద....తేనె చుక్క సరదా.
అందినప్పడే ..దాన్ని పొందినప్పడే
ఆ: చేను పంటకైనా..... చేదు నోటికైనా
తియ్యనేగా .... తీపి బంధమేగా
అ: సృష్టికే మూలమైన ముద్దులాట
నోచుకున్న వారికంట ..హోయ్....
ఆ: అందుకే అందమైన ఆశలన్నీ
పొందుకోరే మోజులన్నీ.....
అ: శివ శివ ఏమిటంటా...... యిప్పడెందుకీ తంటా
ఆ: చక్కనైన మన జంటా.....మక్కువే తీర్చమంటా ॥బావ॥

**రచన: భాస్కరభట్ల రవికుమార్ (2) గానం: కౌసల్య,ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం**

ఆ: నాలో నువ్వుండాలి... నీలో నేనిండాలి
నువ్వేనేనవ్వాలి ఏనాటికీ
అ: నా వెంటే నడిచాకా.. నా చెంతే చేరాకా
నువ్వంటే నేనేగా ముమ్మాటికీ
ఆ: వద్దన్నా వినకుండా నువు సాయం చేస్తుంటే
పదిమందీ చూశారా బాగోదులే
అ: ఎవరేమీ అనుకున్నా ఎగతాళే చేస్తున్నా
నీ సేవలో నిత్యం వుంటానులే.. ఆ: ॥నాలో॥
ఆ: నీతో నిమిషం మాటాడినా
నూరేళ్ళ సావాసం అనిపించదా.....
అ: యుగమే క్షణమై పోతుందిగా
నీ వైపు చూస్తుంటే అలవాటుగా
ఆ: ఏ పూజల ఫలమో ఇది నీ తోడే ఒక వరమై
దొరికిందని అనిపించగ సంతోషమే
అ: మూసిన ఆ: కనులు
అ: దాచెను ఆ: కలలు
అ: ఊసులే ఆ: మొదలై
అ: ఆశలే ఆ: అలలై
అ: నదిలో ఆ: మదిలో
అ: ఉరికే ఆ: జడిలో
అ: ఒకసారి ఆ: ఒడిచేరి
అ: మురిసేనంటా..... ఆ: ॥నాలో॥
ఆ: పతిలో దైవం కనిపించగా
ప్రతిరోజు ప్రేమించీ పూజించనా
అ: ఇలలో స్వర్గం ఇల్లేననీ
ఇల్లాలిగా నిన్ను పంపించెనా
ఆ: నా గుండెకు నీ నవ్వులే నులివెచ్చని కిరణాలై
తాకినవని కలిగెను మరి ఆనందాలే
అ: నీకిది ఆ: తెలుసు
అ: మూగది ఆ: మనసు
అ: నా చెలి ఆ: కురులే
అ: పూచిన ఆ: విరులై
అ: ఇదిగో ఆ: ఇపుడే
అ: తకథిం ఆ: తకతై
అ: కదలాడి ఆ: దరిచేరి
అ: పిలిచేనంటా



రచన: జాలాది (4) గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, బృందం

ఒక దేవుడు మనిషైతే... తన తల్లికి ఎడమైతే...
విలపించే అనురాగం... విలువెంతో తెలిసేది..
చిటికెడు కుంకుమ తల్లికి పంచే కొడుకై పుట్టాలా
కంచికి చేరని కథలా బ్రతుకు విలవిల ఏడ్వాలా...
ఏడడుగుల జీవితమా...
ఇది దేవుడి శాసనమా...
ఏడ్పించే నా గతమా...
ఓదార్చని జీవితమా...!

రచన: జాలాది (5) గానం :ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, బృందం

హర హర మహాదేవ శంభో హర ఓం.......
శుభకర శివానంద జగదీశ్వర ఓం......
ప్రణవాంశ శక్తి స్వరూపాయ ఓం......
ప్రళయాగ్ని సెగశిఖల నిటలాక్ష ఓం...
ప: ఒక వేకువ దీపంతో ..ఈ లోకం మేలుకొని...
ఒక దేవుడి రూపంతో తన దీవెనలందుకొని...
ముసి ముసి నవ్వుల ..విరిసిన పువ్వుల ........
పల్లె ఝల్లుమంది....
ఆ వెలసిన దేవుడి ముంగిట నిలబడి... తలలు వంచుకుంది.
హరి ఓం శాంతి శాంతి.....
డమరుక నాద విశ్వశాంతి.... ॥హరి॥
ఢం చిక ఢం చిక చమ్‌చక్క......
చక్కనమ్మ ముగ్గులెట్టె ఎంచక్కా.....
పాడిపంట పొంగులాడే ఢం చిక...
ఊరువాడ చిందులాడే ఎంచక్కా..... ॥ఒక వేకువ॥
ధనధాన్యం రాసులు పోసి....
ధర్మానికి దోసిళ్లేసి
గుణ శీలం జనకోలువైతే
మహదేవుడు మారాజైతే
ముత్యాల పండే లోగిళ్లలో
వరాలనవ్వుల జల్లంటరో...
చుక్కల్లో వెన్నెల బొమ్మ.....
పుట్టింటికి నడిచొస్తుంటే...
పక్కన చిరునవ్వుల వాడే...
శివదేవుడు అనిపిస్తుంటే....
ఆ తాత మనవళ్లాట...ఈ ఊరికి ఊయల పాట..
ఆ కుంకుమ రేకుల మూట.... మా గడపకి వచ్చిన పూట...
పండగే వచ్చినంత సందడంటరో..
సందెపొద్దు చిందులాడె వేడుకంటరో..
హరి ఓం శాంతి శాంతి
డమరుక నాద విశ్వ శాంతి..!!
అనురాగం పురుడోసుకుని
అనుబంధం ముడులేసుకుని
దేవుడు మనిషై పుడుతుంటే...
నలుగురితో నడిచొస్తుంటే...
బుడి బుడి అడుగుల నాట్యానికి
ఆ నటరాజే గురుతొచ్చేనట
మనిషిని మహనీయుడు జేసే...
మమతల గుడి ఒడి జేసుకుని.....
కనిపించే తల్లులు వుంటే...
లోకాలను వెలిగిస్తుంటే...
ఆ వెలుతురు కిన్నెరబాట
తాతయ్యకు వన్నెల కోట
ఆ కోటకు రారాజెవరో
ఈ కాలమె చెప్పేనంటా
ఝూం కొకో ఝూం కొకో కోడి పుంజురో...
జాతికోడి కూతలేసే పండగంటరో....
చంకలాడే సంకురాతి రొచ్చెనంటరో...
గొబ్బిళ్లమ్మ పువ్వులెట్టి ముగ్గులంటరో... ॥ఒక వేకువ॥

రచన: జాలాది (6) గానం: కౌసల్య, సందీప్‌భౌమిక్

ఆ: ఫెళ్ళున విరిగిందిరో శివధనసు పెళ్ళికి రమ్మందిరో సీత మనసు
అ: ఆకాశం పందిట్లో అక్షింతలై
భూదేవి గుండెల్లో పులకింతలై
ఆ: కళ్యాణం సంబరానికి... హోయ్...హోయ్.....హోయ్...హోయ్..
అ: మత్తుగా గమ్మత్తుగా ..చిత్తుగా చిరెత్తగా
ఆ: వెచ్చగా గుండెల గిచ్చగా మెచ్చగా కోర్కెలు రెచ్చగా ॥ఫెళ్ళున॥
అ: జత పెదవుల్లో కథలన్నీ .... శృతిలయ ఒడిలో సవరిస్తే
ఆ: పదనిసలాడే పరువంలో....మదనుడు నీవై కవ్విస్తే
అ: జివ్వను నవ్వుల్లో తేలించనా.... యవ్వన పువ్వుల్లో దొర్లించనా
ఆ: కోరుకున్న కొండంత దైవం ...... కోర్కెలన్నీ తీరుస్తానంటే
అ: అందుకేగా నా అర్ధ భాగం....ముందుగానే ముడుపిచ్చుకుంది.
ఆ: అల్లుకో నను గిల్లుకో...హరివిల్లుగా నను దాచుకో
అ: రెచ్చిపో నను గుచ్చుకో.. నులివెచ్చగా వాటేసుకో ॥ఫెళ్ళున॥
కో: బంగినపల్లి బంగారమ్మా
రంగుల బుట్ట గంగానమ్మా
చిందులు తొక్కే సింగారమ్మా
టింగుల టంగుల తాయారమ్మా
ఆ: తొలకరి జల్లై నువ్వొస్తే... వలపుల వాళ్ళే తడిపేస్తే
అ: పిడికెడు నడుమే అందిస్తే... పిడుగుల మెరుపై మెలికేస్తే
ఆ: అమ్మో నాకేదో భయమేస్తుంది... ముందే నన్నిట్లా వొణికిస్తుంటే
అ: కొత్తలో మరి ఏ జంటకైనా... చిత్తరంగా వుంటుందిలే
అ: పైట చెంగుల పందేలతోటి....... పగలూ రేయీ గడిచేనులే
అ: కొద్దిగా చలిముద్దుగా... కౌగిళ్ళలో ఆడొచ్చులే
ఆ: వొద్దులే అసలొద్దులే..... సరిహద్దులే దాటొద్దులే ॥ఫెళ్ళున॥





పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

SKC Ch.పద్మావతి సమర్పించు
శ్రీ కీర్తి క్రియేషన్స్



# పెదబాబు

యమ్.ఎల్.కుమార్‌చౌదరి చక్రి పరుచూరి మురళి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : రమేష్-గోలి, స్వామిజీ, విజయ్ |
| ఫోటోగ్రఫి | : భూపతి |
| స్టిల్స్ | : రఘు |
| కాస్ట్యూమ్స్ | : అంజిబాబు |
| మేకప్ | : బాబు |
| పబ్లిసిటీ డిజైనర్ | : రమేష్‌వర్మ |
| పి.ఆర్.ఓ. | : పులగం చిన్నారాయణ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : కొండా వెంకటేష్, విజయ్ కుమార్ |
| క్యాషియర్ | : యం.వి. బాషా |
| ప్రొడక్షన్స్ ఎగ్జిక్యూటివ్స్ | : యన్. గోవింద రామారావు, యం. సీతారామరాజు |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : ఎ. హరికృష్ణ, రాజ్‌కుమార్, కె. సాయిబాబా |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : బి.వి. గిరిరాజు, బిందు కిషన్, శంకర్ .బి |
| కో-డైరెక్టర్స్ | : యన్. ప్రణవానంద్, సునీల్ |
| సమర్పణ | : సి.హెచ్. పద్మావతి |
| సంగీతం | : చక్రి |
| నిర్మాత | : యం.యల్.కుమార్ చౌదరి |
| స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : పరుచూరి మురళి |

## తారాగణం

జగపతిబాబు, కళ్యాణి, కె.విశ్వనాథ్, శరత్‌బాబు, సుహాసిని, కోటశ్రీనివాసరావు, సునీల్, రాళ్ళపల్లి, ఆలీ, పొన్నాంబళం, మల్లికార్జునరావు, భరత్, అజయ్, ప్రభు, నఖి, గోవింద్, మాస్టర్ దీపక్ సరోజ్


యమ్.ఎల్.కుమార్ చౌదరి


పరుచూరి మురళి


చక్రి


జాలాది


భాస్కరభట్ల





# కొమ్మ కొమ్మకో సన్నాయి...



## పాటసారి డైరీ లోంచి..

రాజన్- నాగేంద్రలను
తలచుకోని
నా సినీజీవితగీతం
నిస్స్వరం, నీరసం,
ఈ కన్నడాంధ్ర
సోదరులిద్దరూ
సంగీత సరస్వతికి
రెండు కళ్లు.
అందులో చిన్నవారు
శ్రీ నాగేంద్ర
మనమధ్య ఈనాడు లేరు.
కానీ ఆయన చేసిన
బాణీలు,
నేపథ్యవాద్యవాణీలు
చిరంజీవులు.



కర్పూర వీణలు, కస్తూరి వీణలు కవుల ఊహాగానాలకు పల్లవులు. రాజన్-నాగేంద్రల సంగీతం అమ్మవారి సారణి వీణ ఝుంకారంతో ఓంకార స్వరంగా నినదించింది. వారి రాగాలలో ఆరు ఋతువులూ ఉయ్యాల లూగాయి. కృష్ణాతరంగాలు, కిన్నెర సానులు నాట్యం చేశాయి. హంపి వాకిట స్వరాల కలయంచ జల్లిన హాయిగానాలవి. వాయులీనాలవి. కంకరరాలను సైతం తేనెవెన్నెల లేహ్యాలతో అనునయించిన లలిత లావణ్యలాస్యాలా బాణీలు!

సినీ కవులకు నంది పురస్కారాలు ప్రకటించిన తరువాత తొలి పురస్కారం నాకు తెచ్చిపెట్టింది వారికి నేను రాసిన **'మానస వీణా మధుగీతం మన సంసారం సంగీతం'** అనే గీతం. రస హృదయులు నవతా కృష్ణంరాజుగారు నిర్మించిన 'పంతులమ్మ' చిత్రంలోనిది ఆ పాట. ఆ పాట నాటి ప్రేక్షక శ్రోతల ఆదరాభిమానాలను ఎంతగానో చూరగొన్నది. యం.వి.యల్ వంటి విజ్ఞులు ఆ పాటను అక్షరాలా ఆరాధించడం, వివిధ పత్రికలలో రాయడం జరిగింది. అందులో **'కురిసేదాకా అనుకోలేదు శ్రావణ మేఘమని తడిసేదాకా అనుకోలేదు తీరని దాహమని,'** వంటి చరణాలు వాటి చుట్టూ అలుముకున్న వర్ష గీతావరణం వారికే చెల్లింది.

వాద్య హృదయభాషకు మధురిమలు హత్తిన మెత్తని సరిగమలువారివి. 'పంతులమ్మ' చిత్రం ఆనాడు 'పాటలమ్మ'గా పేరు తెచ్చుకుంది. అందులో ప్రతి పాటా రాగభావాల పూలబాట. అందుకు నిదర్శనాలు, **'పండగంటి వెన్నెలంతా సెందరయ్యా దండగై పోయిందే సెందెరయ్యా'** అనే పాట, **'ఏడారిలో కోయిలా తెల్లారని రేయిలా'**, **'మనసెరిగిన వాడు మా దేవుడు,'** మొదలైన గీతాలు.

దురితమైన స్వరము, దూకుడైన నడక ఏనాడూ వారి స్వర సంప్రదాయంలో కానవచ్చేది కాదు. ఆ సోదరులిద్దరి జీవన విధానము, మాటవరస అందుకు తగినట్లే వుండేది. వారి కంపోజింగు గది ప్రార్థనా మందిరంలా ఏకాగ్రతకు నిలయంగా భాసించేది. మంత్రాలయ రాఘవేంద్రస్వామి ధ్యానం వారి ప్రథమ ప్రాణం. శ్రుతిలయలు స్వరపదాలు మిగిలిన వారి నాలుగు ప్రాణాలు. పరిమళాచార్యుని ద్వైత సంప్రదాయ పరిమళాలు వెదజల్లే అగరువత్తుల ధూమగంధాలతో 'సంగీత జ్ఞానము భక్తి వినా సన్మార్గము గలదే'అన్న త్యాగరాజు స్వామి కీర్తన రూపుదాల్చినట్లు వుండేది వారి స్వరకల్పనా ప్రావీణం.

నాగమల్లి, నాలుగు స్తంభాలాట, మూడుముళ్ళు, ఇంటింటి రామాయణం, సొమ్మొకడిది సోకొకడిది, వయ్యారిభామలు వగలమారి భర్తలు, ఆ ఆ ఇ ఈ, మంచుపల్లకి వగైరా చిత్రాలు సంగీత రంజితాలు కావడానికి రాజన్ -నాగేంద్రల తపశ్శక్తి ప్రధానకారణం. ఆ చిత్రాలలో సంగీత సాహిత్యాల ఏకత్వం అద్వైత సిద్ధికి ప్రబల నిదర్శనం- అంతటిదీ ఆ స్వరపదసంధానం. అందుకు మూలకారకులు దర్శకులు శ్రీ జంధ్యాల, శ్రీ సింగీతం శ్రీనివాసరావు. కథ, సన్నివేశాలు సజీవమైతే పాటలూ పదికాలాలపాటు నిలిచి వుంటాయి.

పాటల చిత్రీకరణలో కొత్త పుంతలు తొక్కి, కవితాత్మకు, కన్నులకు కర్పూరంలా చల్లగా అంటించగలిగిన శ్రీ జంధ్యాల నా పాటలను చిత్రీకరించడంలో చూపిన శ్రద్ధ, ప్రతిభ అపూర్వం. రాజన్ - నాగేంద్ర స్వరకల్పనతో వచ్చిన **'చినుకులా రాలి నదులుగా సాగి వరదలైపోయి కడలిలాపొంగు'**ప్రేమను వర్ణిస్తూ వ్యాఖ్యానించే పాటను, అదేవిధంగా 'నాలుగుస్తంభాలాట' చిత్రంలో మిగతా అన్ని పాటలను ఎంతో మమకారంతో తీసిన దర్శకుడు శ్రీ జంధ్యాల.

నైమిశారణ్యాలలో, గంధమాదన పర్వతాలలో, చిరపుంజి చినుకులలో,సుందరవన సాగరతీరాలలో, మలయానిలంలో వీచే పవన పరిమళాలు రాజన్ నాగేంద్రల సుస్వరాలు. అవి వాతావరణ కాలుష్య జనితాలు కావు, అతీతమైనవి అతిమధురమైనవి.

**'అల్లో నేరేడుపళ్ళు అమ్మాయి కళ్ళు'**, అంటూ అల్లరి పాటచేసినా రాగవల్లరిగా తీర్చిదిద్దిన సుకుమారులు రాజన్-నాగేంద్ర. **'కాస్తందుకో దరఖాస్తందుకో ప్రేమ ధరకాస్తందుకో'** అనే మనవిని మధురంగా పలికించిన జంటకవులు వారు. అన్నిటికీ మించి ఆప్తమిత్రులు, ఆత్మసాక్షులు ఆ అపూర్వ సహోదరులు.

**- వేటూరి సుందరరామమూర్తి**

**రాజన్**-నాగేంద్రల ఫోటో మా వద్ద లేదని బాధపడుతూంటే తన పర్సనల్ ఆల్బమ్‌లోంచి తీసి ఇచ్చిన ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం గారికి, సంధానకర్తగా వ్యవహరించిన ఆయన పి.ఏ. విఠల్ గారికి, వ్యవధి తక్కువగా ఉండటం చేత ఫ్లైట్‌లో అప్పటికప్పుడు తీసుకువచ్చిన సంగీత దర్శకుడు మాధవపెద్ది సురేష్‌గారికి కృతజ్ఞతలు

- హాసం

**చిత్రం: పంతులమ్మ సంగీతం: రాజన్-నాగేంద్ర**
**రచన: వేటూరి గానం: పి.సుశీల, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

ఆ: మానసవీణా మధుగీతం - మన సంసారం సంగీతం
సంసారం సంగీతం - సాగర మథనం అమృత మధురం
సరిగమ సరిగమ స్వరపారిజాతం ॥మానస॥
ఆ: ఏ రాగమో ఏమో మన అనురాగం
వలపువసంతాన హృదయపరాగం
ఎదలోయలలో నిదురించిన -నా కోరిక పాడే కోయిల గీతం
అ: శత వసంతాల దశదిశాంతాల
సుమసుగంధాల భ్రమరనాదాల
కుసుమించు నీ అందమే -విరిసింది అరవిందమై
కురిసింది మకరందమే ॥మానస॥
అ: జాబిలికన్నా నా చెలి మిన్న- పులకింతలకే పూచిన పొన్న
కానుకలేమి నేనివ్వగలను - కన్నులకాటుక నేనవ్వగలను
ఆ: పాలకడలిలా వెన్నెల పొంగింది
పూలపడవలా నా తనువూగింది
ఏ మల్లెల తీరాల నిను చేరగలను
మనసున మమతై కడతేరగలను
అ: కురిసేదాకా అనుకోలేదు- శ్రావణమేఘమని
ఆ: తడిసేదాకా అనుకోలేదు - తీరని దాహమని
ఇ: కలిసేదాకా అనుకోలేదు- తీయని స్నేహమని

**చిత్రం: నాలుగు స్తంభాలాట సంగీతం: రాజన్-నాగేంద్ర రచన: వేటూరి గానం: పి.సుశీల, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

అ: చినుకులా రాలి నదులుగా సాగి వరదలైపోయి
కడలిగా పొంగు నీ ప్రేమ నా ప్రేమ నీ పేరే నా ప్రేమ
నదివి నీవు కడలి నేను మరచిపోబోకుమా మమత నీవే సుమా
ఆ: చినుకులా రాలి నదులుగా సాగి వరదలైపోయి
కడలిగా పొంగు నీ ప్రేమ నా ప్రేమ నీ పేరే నా ప్రేమ
అ: ఆకులు రాలే వేసవిగాలి నా ప్రేమ నిట్టూర్పులే
కుంకుమపూచె వేకువ నీవై తేవాలి ఓదార్పులే
ఆ: ప్రేమలుకోరే జన్మలలోనే నే వేచి వుంటానులే
జన్మలుదాటే ప్రేమను నేనై నే వెల్లువౌతానులే
అ: నే నావనవుతానులే
ఆ: హిమములా రాలి సుమములై పూచి ఋతువులై నవ్వి
మధువులై పొంగు నీ ప్రేమ నా ప్రేమ నీ పేరే నా ప్రేమ
శిశిరమైనా శిథిలమైనా
మరచిపోకుమా విరహమైపోకుమా
ఆ: తొలకరి కోసం తొడిమను నేనై అల్లాడుతున్నానులే
పులకరమూగే పూవులకోసం వేటాడుతున్నానులే
అ: నింగికి నేల అంటిసలాడే ఆ పొద్దు రావాలిలే
పున్నమి నీవై రేపటి నీడై ఆ ముద్దు తీరాలిలే
ఆ: తీరాలు చేరాలిలే
అ: నవ్వునై విరిసి గానమై పిలిచి కలలలో కలిసి
గగనమై ఎగసి నీ ప్రేమ నా ప్రేమ తారాడే మన ప్రేమ
కువలయమైన గగనమైన
ప్రేమ మనమే సుమా
ప్రేమ మయమే సుమా ॥చినుకులా॥

మే 10 చంద్రబోస్ పుట్టినరోజు సందర్భంగా...





# సంగీత దర్శకుడు కాగలిగిన అర్హతలన్నీ నూటికి 150 పాళ్ళున్నాయి చంద్రబోస్‌లో...

**- కీరవాణి**

చంద్రబోస్‌గారితో నా మొదటి పరిచయం ఆయన్ని చూడకుండా ఆయన పాటతో, ఆయన వాయిస్‌తో, ట్యూన్‌తో పరిచయం అయింది. ఈటీవీ వారు రకరకాల ప్రోగ్రామ్స్ కోసం చిన్న చిన్న బిట్ సాంగ్స్ చేయించుకునేవారు. ఆ రోజుల్లో 'మాస్టర్ మైండ్స్' అని ఓ ప్రోగ్రామ్ చేయడం జరిగింది. 'ఓ కుర్రాడితో పాట రాయించాం. ట్రై చేసి బాగుంటే... చేయండి' అంటూ నాకు లిరిక్‌తో పాటు క్యాసెట్ లో పాడిన పాట కూడా ఇచ్చారు ఈటీవీ జనరల్ మేనేజర్ బాపినీడు గారు.

'ఎందుకు? ఏమిటీ?ఎప్పుడు?ఎక్కడ? మొదలగు ప్రశ్నలకే బదులిడదామా' అంటూ చంద్రబోస్ గారి వాయిస్‌లో లిరిక్ వచ్చింది. ఆ పాటకు వేరే ట్యూన్ ఎంత ట్రై చేసినా రావటం లేదు. క్యాసెట్‌లో ఉన్నదే బాగున్నట్టనిపించి దానినే చేసేశాను. తర్వాత ఎప్పుడో బాపినీడు గారు కలిసినప్పుడు "ఏవండీ.. మాస్టర్ మైండ్స్ ప్రోగ్రామ్‌కి ఆ కొత్త రైటర్ చేసిన ట్యూన్ బాగుంది, అదే యాప్ట్‌గా కూడా అనిపించి అదే చేసేశాను. ట్యూన్ నాది కాదు కాబట్టి నాకు ఇచ్చే పారితోషికంలో సగం తగ్గించండి. నేను కేవలం దానిని రికార్డ్ మాత్రమే చేసాను కదండి" అన్నాను. చంద్రబోస్ గారితో ఆ విధంగా పరోక్ష పరిచయం జరిగింది.

ఆ తర్వాత 'పెళ్లిసందడి' టైంలో చంద్రబోస్ గారిని పర్సనల్‌గా కలుసుకున్నాను. రాఘవేంద్రరావుగారు పరిచయం చేశారు. అసలు రాఘవేంద్రరావు గారు మొదట జొన్నవిత్తుల గారిని ఎంకరేజ్ చేశారు. రాఘవేంద్రరావు గారు కొత్తవాళ్లని సాధారణంగా ఎంకరేజ్ చెయ్యరు, ఆల్రెడీ ఎస్టాబ్లిష్ అయిన వాళ్లని మాత్రమే ఎంకరేజ్ చేస్తారనే అపవాదు తప్పని ప్రూవ్ చేయడానికి ఇక్కడ జొన్నవిత్తుల గారి విషయం గుర్తు చేస్తున్నాను. అయితే రాఘవేంద్రరావు గారు ఎవరినైనా కాన్‌స్టెంట్‌గా ఎంకరేజ్ చేస్తారు. చంద్రబోస్‌కు 'తాజ్‌మహల్' మొదటి చిత్రమే కావొచ్చు, ఎవరికైనా కాన్‌స్టెంట్‌గా ఎంకరేజ్ చేసిన వాళ్లు వారి కెరియర్‌లో ప్రధాన వ్యక్తులు అవుతారు. రాఘవేంద్రరావు గారు చంద్రబోస్‌ను చాలా బాగా ఎంకరేజ్ చేసారు. ఆయన ప్రోద్బలం వల్ల చాలా చక్కటి పాటలు వ్రాయటం, మంచి పేరు తెచ్చుకోవటం జరిగింది. ప్రక్కన ఉండి చాలా సరదాగా కలిసి మెలిసి ఉండటం వల్ల మా అనుబంధం బలపడింది.

రైటర్‌గా ఆయన గురించి చెప్పమంటే నేను ఫీలయ్యేదేమిటంటే...శ్రీశ్రీ గారు 'కుక్కపిల్ల సబ్బుబిళ్ల అగ్గిపుల్ల కాదేది కవిత కనర్హం' సూత్రాన్ని చంద్రబోస్ ఫాలో అవుతున్నారా అనిపిస్తుంటుంది... కాదేదీ పాటకనర్హం అని! నా అబ్జర్వేషన్ ఏంటంటే - స్నానం చేసి బట్టలు తొడుక్కుని కాలు బయటపెట్టింది లగాయితూ తిరిగి ఇంటికి చేరే వరకూ ఆయన బస్సు ఎక్కితే బస్సు టిక్కెట్టు, ఎవరింటికైనా వెళితే వాళ్ల పిల్లల ప్రోగ్రెస్ రిపోర్టులు, తెప్పించుకునే పేపర్లు, మాలతీ చందూర్ గారి పిండి వంటల పుస్తకం... ఇలా ఏదీ వదలిపెట్టరు. అన్నీ చూసి చదివేయడం... అవి తను రాసే పాటకి ఏమైనా ఉపయోగపడతామోనని ఆలోచించటం. బస్సు టిక్కెట్టు తీసుకుంటే దాని వెనకాల రాసే కొటేషన్స్ ఏదైనా పాటలో పెట్టుకోవచ్చా అని - ఇలా కళ్లకు అడ్డువచ్చిన ప్రతి దానిని సినిమా పాటగా మార్చేయటం అనే వింత విద్య ఉంది ఆయన దగ్గర.

మిగతా రైటర్స్ ఎవరి దగ్గరా నేను అటువంటి విద్యను చూడలేదు. మిగతా రైటర్స్ రాయల్సిన చోట రాస్తారు, భోంచేయాల్సిన చోట భోం చేస్తారు. పడుకోవాల్సిన చోట పడుకుంటారు. ఈయన భోజనానికి శరవణభవన్ లాంటి హోటల్లో పార్శిల్ తెప్పించుకున్నారనుకోండి ఆ పార్శిల్ పేపర్ మీద ఏవైనా చిన్న అక్షరాలు ఉన్నాయనుకోండి ఇవి ఏంటి అని అబ్జర్వ్ చేయటం, వాటిని పాటల్లో పెట్టేయటం... ఇలాంటి లక్షణం వైరముత్తు గారికి కొద్దిగా ఉంది. అంటే...లేటెస్ట్‌గా వచ్చిన న్యూస్ కానీయండి, లేటెస్ట్ హాపెనింగ్స్ అన్నీ పాటలలో పెట్టే లక్షణం ఆయనకు ఉంది. ఫరెగ్జాంపుల్ ఎదురుగా తోరణాలు ఎండిపోయి కనిపించాయనుకోండి ఎండిపోయిన తోరణాల గురించి ఎందుకు రాయకూడదు అని వీరు ఆలోచిస్తారు. వేరే యావగేషన్ ఏదీ వీరికి ఉండదు. ఇలా ఉండటం కళాకారునికి ప్లస్ పాయింట్ అవుతుంది.

వేటూరిగారు ఓసారి అన్నారు 'లిరిసిస్ట్‌కు సంగీతజ్ఞానం ఉండాలి, పాడగలిగిఉండాలి.

పాడలేకపోతే లిరిసిస్ట్ వేస్టు' అని. ఆయన బ్రహ్మాండంగా పాడతారు. అలాగే సీతారామశాస్త్రిగారు పాడతారు. చంద్రబోస్ కూడా పాడతారు. మరో లక్షణం కూడా చంద్రబోస్ కు ఉంది. సాధారణంగా లిరిసిస్ట్‌లు ఓ ట్యూన్‌లో పాడతారు. అంటే వాళ్లు ఆ పాటకు అనుకున్న దాన్ని బేసిక్ ట్యూన్ అంటుంటాం. అయితే చంద్రబోస్ గారు ఏమిటంటే వింత పోకడలతో కూడా పాట పాడగలరు. ఆయనకు ఆ శక్తి ఉంది. **నేను చేసిన 'పడ్డానండీ ప్రేమలో మరి' ట్యూన్ మొత్తం ఆయనదే.** ఇది నీది ఇది నాది అని మేం అనుకోం. ఒక్కోసారి నాకు ఆయన హెల్ప్ చేస్తుంటారు. ఒక్కోసారి నేను చేస్తుంటాను. మా ఇద్దరి కాంబినేషన్ చాలా వరకూ సక్సెస్ కావటానికి ఓ కారణం అదే!

సంగీత దర్శకులు రెండు రకాలు. కీ బోర్డు ప్లేయర్ల మీద ఆధారపడేవాళ్లు. ఆధారపడని వాళ్లు. ఆధారపడని వాళ్ల సంగతి వదిలేస్తే, చంద్రబోస్ మ్యూజిక్ డైరెక్షన్ స్టార్ట్ చేస్తే కీ బోర్డ్ మీద ఆధారపడి మ్యూజిక్ చేసే వాళ్లందరూ కొంచెం ఉలిక్కి పడవలసి వస్తుంది. లేదా తట్టా బుట్టా సర్దుకోవలసిన పరిస్థితి కూడా రావచ్చు. లిరిసిస్ట్‌గా ఉంటూనే మ్యూజిక్ డైరెక్టర్‌గా కూడా ఆయన రాణించగలరు. అయితే చంద్రబోస్ ఎందుకు లిరిసిస్ట్‌గానే కంటిన్యూ అవుతున్నారో తెలియదు. గొప్ప మ్యూజిక్ డైరక్టర్ అయ్యే చాలా లక్షణాలు ఉన్నాయి ఆయనకి.

సంగీత దర్శకునికి కావలసిన అర్హతలు.... 150 శాతం కలిగి కూడా చంద్రబోస్ సంగీత దర్శకత్వం ఎందుకు చేయటం లేదో నాకర్థం కావటం లేదు. ఆయనకు గిట్టుబాటు అవదో లేదా గొడ్డు చాకిరి చేయాలి కనుక లిరిసిస్ట్ పనే బాగుంది అనో ఆయన అనుకుని ఉండొచ్చు.

ఇక చంద్రబోస్ తన జీవితంలో అనుభవిస్తున్న సుఖం గురించి మాట్లాడుకుందాం. సెల్‌ఫోన్‌లు వచ్చిన కొత్తలో సీమెన్స్ వచ్చింది. తర్వాత ఎరిక్సన్ వచ్చింది. 1995లో అనుకుంటా మొదటిసారి సెల్‌ఫోన్‌లు రావడం... అప్పట్లో అందరూ వెరైటీ ఫోన్‌లు తీసుకోవటం. రింగ్‌టోన్స్ సెట్ చేయటం, అవసరం ఉన్నా లేకపోయినా అందరికీ ఫోన్ చేయటం.... నేను కూడా అవన్నీ చేస్తుండేవాడిని. సెల్‌ఫోన్ అనేది స్టేటస్ సింబల్ అనుకోండి, క్రేజీ సింబల్ అనుకోండి.... ఆ రోజుల్లో ఈ సెల్‌ఫోన్ తాలూకూ లగ్జరీని మన సినిమా ఇండస్ట్రీలో మాగ్జిమమ్ ఎంజాయ్ చేసిన వ్యక్తులలో చంద్రబోస్ ఒకరు.

ఎలాగయ్యా అంటే ఆయనకు సెల్‌ఫోన్ ఉంటుంది. కానీ అది ఎవరికీ దొరకదు. కాబట్టి ఆయన టైమ్‌ని మనం వేస్ట్ చేసే అవకాశం ఎవరికీ రాదు. సో ఆయన టైం సద్వినియోగం అవుతూ ఉంటుంది. ఆయన ఎప్పుడు దొరకాలని భావిస్తూ ఉంటారో అప్పుడు దొరుకుతారు - శ్రీ కృష్ణ పరమాత్ముని లా! వాళ్ల అబ్బాయి పేరు వనమాలి. కాకపోతే ఈయనే వనమాలిలా ఉంటారు - ఈ యాంగిల్‌లో.... (సరదాగా అంటున్నానులెండి.)

చంద్రబోస్ గారు నాకు రాసిన పాటల్లో నాకు బాగా నచ్చిన ప్రయోగాలు... 'గంగోత్రి' లో **పనిమనిషి తనమనిషి అవుతాడని** అన్నారు. అలాగే 'ఈ అబ్బాయి చాలా మంచోడు' చిత్రంలో **నది గొంతులో అల పాటలా తడబాటులేని ప్రేమ** అన్నారు. 'యువరత్న' లో ఆడువారి మాటలకు అర్థాలే వేరులే ని మార్చి **ఆడాళ్ల మాటలకు కొత్త డిక్షనరీ కావాలన్నారు.** 'స్టూడెంట్ నెం.1'లో **అయస్కాంతానికి వయస్కాంతం** అని, 'ఒకటో నెంబర్ కుర్రాడు'లో **ప్రేమించు మించకపో** అనటం తమాషా. అలాగే **డిగామవాస్కో కులాసడ్రింకో** అని 'సింహాద్రి'లో , **ఆనందభాష్పాలే అనుకోని అతిథులై** అని 'సీతయ్య'లో ఇలా చక్కటి, వెరైటీ ప్రయోగాలు చేశారు.

తమసోమా జ్యోతిర్గమయ అంటే చీకటి నుండి వెలుగులోకి నడిపించమని అభ్యర్థన. నేను నడిపిస్తాను నేనున్నాను కదా అని తమసోమా జ్యోతిర్గమయలాంటిదే తెలుగులో 'చీకటితో వెలుగే చెప్పెను నేనున్నానని'.... పాట! అందులో **తగిలే రాళ్లని పునాది చేసి ఎదగాలనటం. అందులో తరిమేవాళ్లని హితులుగా తలచి ముందుకు వెళ్లాలి** అనటం చక్కటి ప్రయోగం. దీనికి నాకో చిన్న ఎక్స్‌పీరియన్స్ ఉంది.

తిరుమలలో ఆడ వాలంటీర్లు, మగ వాలంటీర్లు లైన్‌లో నిలబడి - వెళ్లే వాళ్లని కర్కశంగా తోసేస్తూ ఉంటారు. ఒక్క సెకనుకూడా దేవుణ్ణి చూడనివ్వరు. వీపు మీద చెయ్యేసి తోస్తూ ఉంటే బీ.పీ. పెరుగుతూ ఉంటుందండి. మనం ఎంతో భక్తితో వస్తే... ఏంటి వీళ్లు... ఏమను కుంటున్నారు అసలు... ఇట్లా తోసేస్తున్నారు అని అనిపిస్తూ ఉంటుంది.

## చంద్రబోస్ పాట పై 'హాసం' కామెంట్‌కు కీరవాణి స్పందన

**16-30 ఏప్రిల్ 2004 సంచికలో 'నేనున్నాను' ఆడియో రివ్యూలో 'నూజివీడుకెళ్లినా' పాటలో 'వస్త్రం మారినా వరస మారునా అనే మాటలను ఏ అర్థంతో ప్రయోగించారో చంద్రబోసే చెప్పాలి' అంటూ రాయటం జరిగింది.**

**అది చదివిన కీరవాణి "సాధారణంగా మనం కుట్టించుకునే షర్ట్‌కి కొలతలు తీసుకునేటప్పుడు మెడ, చేతులు, పొడవు, వెడల్పు ఇలా ఓ వరసలో టైలర్స్ తీసుకుంటారు కదండీ...మనం ఏ క్లాత్ ఇచ్చినా తీసుకునే వరస మాత్రం అదే కదండీ ! ఆ యాంగిల్‌లో రాసేరేమోనండీ...!?" అన్నారు 'హాసం'తో చిలిపిగా నవ్వుతూ.**

తర్వాత్తర్వాత నాకు జ్ఞానోదయం కలిగి నేను ఇంకోలాగా భావించటం మొదలు పెట్టాను. 'ఓరి పిచ్చి సన్నాసుల్లారా మీ కోరికలు ఏంటి - సినిమా హిట్ కావాలనో, అబ్బాయి పరీక్ష పాస్ కావాలనో, కాలు బాగుపడాలనో....ఇలా ఏవో ఏవో కోరికలతో వస్తారు. ఇవన్నీ అల్పమైన కోరికలు. వీటిని తీర్చటానికి స్వామివారికి అరసెకను చాలు. ఇక్కడ అనవసరంగా టైమ్ వేస్ట్ చేయవద్దు. మీరు వెళ్లిపోయి మీ మీ ఊళ్లలో మీ మీ పనులు శుభ్రంగా చేసుకోండి' అన్నట్టుగా వాళ్లు తోస్తుంటారని.... ఎప్పుడైతే ఫీలయ్యావో వారి చేతి స్పర్శ బీ.పీ. రప్పించటానికి బదులు పులకింతలు కలిగిస్తుంది. వాళ్లు ఎప్పుడు తోస్తారు, తోస్తే బాగుణ్ణు అని అనిపిస్తూ ఉంటుంది.

తరిమేవాళ్లని హితులుగా తలచి ముందుకు వెళ్లాలన్న లైన్ చూసినప్పుడు నాకు ఈ సంఘటన గుర్తుకు వస్తూ వుంటుంది..... సరదాగా!

చంద్రబోస్ గారిలో చాలా గొప్ప టాలెంట్ ఉందని నేను గ్రహించిన మూమెంట్ ఒకటుంది. అలా తెలుసుకున్నది ఎప్పుడంటే **'ఒకరికి ఒకరు'** సినిమాకి **'అల్లో నేరేళ్లు'** పాట చేస్తున్నాను. ముందే ఆయన పాట రాసేశారు. **'ఏటి పాయల పాపిటకి కుంకుమ బొట్టే ఆభరణం'** అని మొదటి చరణంలో ఉంటుంది. ఆ చరణానికి నేను ఇచ్చిన ట్యూన్‌కి ఆయన ఇచ్చిన రియాక్షన్స్ చూస్తే అప్పుడు తెలిసింది నాకు ఈయన చాలా గొప్పటాలెంటెడ్ అని. ఎందుకంటే మ్యూజికల్‌గా నేను ఎక్సల్ అయింది ఆ చరణంలో. అది ఆయన రికగ్నైజ్ చేశారు, ఎక్నాలెడ్జ్ చేసారు అని నాకు తెలుసు కాబట్టి ఆయనలో చాలా టాలెంట్ ఉందని నాకు అనిపించింది. ఎందుకంటే అది ఓ మ్యూజిక్ డైరక్టర్ మాత్రమే పట్టుకోగలరు. రసూల్ గారికి కూడా అది బాగా ఆకట్టుకుంది. నేను ఏంటో ఆయన కనిపెట్టగలిగారు.

చంద్రబోస్ గారిలో మరో సుగుణం కూడా ఉంది. అదేంటంటే పక్క రైటర్ బాగా రాస్తే మెచ్చుకోవటం, అతనికన్నా బాగా రాయాలని పట్టుదలతో కృషి చేయటం ఇవన్నీ నేను చంద్రబోస్ లో బాగా అబ్జర్వ్ చేసాను. జెలసీ అస్సల్లేదు. కాంపిటీటివ్ స్పిరిట్ చాలా ఎక్కువ.

**'నొప్పింపక తానొవ్వక**
**తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ'**

అనే పద్యాన్ని చంద్రబోస్ కోసం

**'నొప్పింపక తానొవ్వక**
**మెప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ'**

అని మార్చాలనిపిస్తుంది.

అలా ఉండగలగడం చాలా కష్టం. అదే చంద్రబోస్ సిస్టమ్. అందుకే ఆయనంటే నాకు ఇష్టం. ●

# చంద్రబోస్ సినీ గీతాలు

## చిత్రం : బొంబాయి ప్రియుడు

సంగీతం : కీరవాణి　　గానం : చిత్ర, కీరవాణి

ప్రణయమా మరుమల్లె పూలతోటలో ఘుమఘుమా
పరువమా సరసాల వీణ పాటలో సరిగమా
మోయలేని భావమా　రాయలేని కావ్యమా
నండూరి వారి గేయమా　॥ప్రణయమా॥
ఔననకా కాదనకా మనసే వినకా మురిపిస్తావేల ప్రాయమా
రేయనకా పగలనకా తపనల వెనకా తరిమేస్తావేల న్యాయమా
నిన్నలేని చోద్యమా　నిన్ను ఆప సాధ్యమా
నిన్నలేని చోద్యమా　నిన్ను ఆప సాధ్యమా
ఆ... ఆ... ఆ... ఆ...
గుండెచాటు గానమా　గొంతుదాటు మౌనమా
ఎదలోని ఇంద్రజాలమా　॥ప్రణయమా॥
పూలనకా ముల్లనకా వలచిన క్షణమే విహరిస్తావేల హృదయమా
రేపనకా మాపనకా ఆ మరుక్షణమే విసిగిస్తావేల విరహమా
ఇంత వింత సత్యమా　ఎంతకైన సిద్ధమా
అంతులేని ఆత్రమా　అందులోనె అందమా
ఆ... ఆ... ఆ... ఆ...
కోటి కలల నేత్రమా
కొంటె వలపు గోత్రమా
శృంగార సుప్రభాతమా　॥ప్రణయమా॥

## చిత్రం : నీకు నేను నాకు నువ్వు

సంగీతం : ఆర్.పి.పట్నాయక్　　గానం : యస్.పి.చరణ్

తెలుగు భాష తియ్యదనం తెలుగుజాతి గొప్పదనం
తెలుసుకున్న వాళ్లకి తెలుగే ఒక మూలధనం
తల్లితండ్రి నేర్పినట్టి మాతృభాషరా
తెలుగు మరచిపోతే వాళ్లని నువు మరచినట్టురా
ఇది మరువబోకురా　॥తెలుగు॥
అమ్మా అన్న పిలుపులోన అనురాగం ధ్వనిస్తుంది
నాన్నా అన్న పదంలోన అభిమానం జనిస్తుంది
మమ్మీడాడీలోన ఆ మాధుర్యం ఎక్కడుంది
మామ అన్న మాట మనసులోతుల్లో నిలుస్తుంది
అక్కా అంటే చాలు మనకు ఆదరణే లభిస్తుంది
ఆంటీ అంకుల్లోన ఆ ఆప్యాయత ఎక్కడుంది
పరభాషా జ్ఞానాన్ని సంపాదించు　॥2॥
కాని నీ భాషలోనే నువ్వు సంభాషించు
తల్లితండ్రి నేర్పినట్టి మాతృభాషరా
తెలుగు మాట్లాడి నువ్వు వాళ్ల ఋణం తీర్చరా కొంత ఋణం తీర్చరా
మా తెలుగుతల్లికి మల్లెపూదండ　మా కన్న తల్లికి మంగళారతులు
కొమ్మల్లోన పక్షులన్ని తమ కూతలు మార్చుకోవు
భూమి పైన ప్రాణులన్ని తమ భాషను మరువలేదు
మనుషులమై మన భాషకు ముసుగును తగిలిస్తున్నాము
ప్రపంచాన మేథావులు మన పలుకులు మెచ్చినారు
పొరుగురాష్ట్ర కవులు కూడా తెలుగును తెగ పొగిడినారు
ఆంధ్రులమై మన భాషకు అన్యాయం చేస్తున్నాము
అభివృద్ధికి ఉండాలి నింగే హద్దు　॥2॥
అది భాషాచారాలను మింగేయొద్దు
తల్లితండ్రి నేర్పినట్టి మాతృభాషరా
ఉగ్గుపాల భాష పలికేందుకు సిగ్గుపడకురా ......వెనక్కి తగ్గమాకురా
తెలుగు భాష తియ్యదనం తెలుగుజాతి గొప్పదనం
తెలుసుకున్న వాళ్లకి తెలుగే ఒక మూలధనం
మమ్మీడాడీ అన్నమాట మరుద్దామురా
అమ్మానాన్నా అంటూ నేటి నుండి పిలుద్దామురా
ప్రతిజ్ఞ పూనుదామురా...

## చిత్రం : నాని

సంగీతం: ఏ.ఆర్.రెహమాన్　　గానం : ఉన్నికృష్ణన్, సాధనాసర్గమ్

అ: పెదవే పలికిన మాటల్లోనే తియ్యని మాటే అమ్మా
కదిలే దేవత అమ్మా కంటికి వెలుగమ్మా　॥పెదవే॥
తనలో మమతే కలిపి పెడుతుంది ముద్దగా
తన లాలిపాటలోని సరిగమ
పంచుతుంది ప్రేమ మధురిమ　॥పెదవే॥
మనలోని ప్రాణం అమ్మా మనదైన రూపం అమ్మా
ఎనలేని జాలిగుణమే అమ్మా నడిపించే దీపం అమ్మా
కరుణించే కోపం అమ్మా వరమిచ్చే తీపి శాపం అమ్మా
నా ఆలి అమ్మగా అవుతుండగా
జో లాలి పాడనా కమ్మగా కమ్మగా　॥పెదవే॥
ఆ: ఆ..ఆ....ఆ.....ఆ.....ఆ.....ఆ.....ఆ.....ఆ.....
పొత్తిళ్లో ఎదిగే బాబు　నా ఒళ్లో ఒదిగే బాబు
ఇరువురికి నేను అమ్మవనా
నా కొంగు పట్టేవాడు నా కడుపున పుట్టేవాడు
ఇద్దరికీ ప్రేమ అందించనా
నా చిన్ని నాన్నని వాడి నాన్నని
నూరేళ్లు సాకనా చల్లగా చల్లగా
ఎదిగే ఎదగని ఓ పసికూన ముద్దుల కన్నా జో జో
బంగరు తండ్రీ జో జో బజ్జో లాలి జో
పలికే పదమే వెనుక కనులారా నిదురపో
కలలోకి నేను చేరి తదుపరి పంచుతాను మరి ప్రేమ మాధురి
ఎదిగే ఎదగని ఓ పసికూనా ముద్దుల కన్నా జో జో
బంగరు తండ్రీ జో జో బజ్జో లాలి జో బజ్జో లాలి జో

## చిత్రం : ఠాగూర్

సంగీతం: మణిశర్మ　　గానం : శంకర్‌మహదేవన్

కొడితే కొట్టాలిరా సిక్స్ కొట్టాలి ఆడితే ఆడాలిరా రఫ్ ఆడాలి　॥2॥
బాటేదైనా గాని మునుముందుకెళ్లాలి
పోటీ ఉన్నాగాని గెలుపొంది తీరాలి
ఈ చరిత్రలో నీకో కొన్ని పేజీలుండాలి
చిందే వెయ్యాలి నటరాజులాగా　నవ్వే చిందాలి నెలరాజులా
మనసే ఉండాలి మహరాజులాగా
ముగిసే పోవాలి రాజూపేద తేడాలన్నీ　॥కొడితే॥
చెయ్యి ఉంది నీకు చెయ్ కలిపేటందుకే
చూపున్నది ఇంకొకరికి దారిచూపేటందుకే
మాట ఉంది నీకు మాటిచ్చేటందుకే
మనసున్నది ఆ మాటకు నెరవేర్చేటందుకే
ఆరాటం నీకుంది ఏ పనైనా చేయ్యటానికే
అభిమానం తోడుంది ఎందాకైనా నడపటానికే
ఈ ప్రాణం దేహం జీవం ఉంది పరుల సేవకే
చేసే కష్టాన్ని నువ్వే చెయ్యాలి పొందే ఫలాన్ని పంచివ్వాలి
అందరి సుఖాన్ని నువ్వే చూడాలి
ఆ విధి రాతని చెమటతోనే చెరిపెయ్యాలి
పెద్ద వాళ్లకెపుడూ నువు శిరసువంచరా
అరె చిన్నవాళ్లనెపుడూ ఆశీర్వదించరా
లేనివాళ్లనెపుడూ నువు ఆదరించరా
ప్రతిభ ఉన్న వాళ్లనెపుడూ నువు ప్రోత్సహించరా
శరణంటూ వచ్చేసే శత్రువునైనా ప్రేమించరా
సంఘాన్నే పీడించే చీడని మాత్రం తుంచెయ్యరా
ఈ ఆశాజీవి చిరంజీవి సూత్రమిదేరా
దేవుడు పంపిన తమ్ముళ్లే మీరు　రక్తం పంచిన బంధం మీరు
చుట్టూ నిలిచిన చుట్టాలే మీరు
నన్నే చూపిన అద్దాలంటే మీరే మీరే　॥కొడితే॥

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తమిళం | తెలుగు |
|---|---|---|
| చిత్రం | : కాదలిక్క నేరమిల్లై | ప్రేమించిచూడు |
| రచన | : కణ్ణదాసన్ | శ్రీశ్రీ |
| సంగీతం | : విశ్వనాథన్ - రామ్మూర్తి | మాస్టర్ వేణు |
| గానం | : కె.జె.ఏసుదాసు, సుశీల | ఘంటసాల, సుశీల |
| అభినయం | : ముత్తురామన్, కాంచన | జగ్గయ్య, కాంచన |

'కాదలిక్క నేరమిల్లై' తమిళ చిత్రంలో రెండవ కథానాయకుడి పాత్రకూ అతడిని ప్రేమిస్తున్న రెండో కథానాయిక పాత్రకూ మధ్య ప్రేమ ముదిరి పాకాన పడిన సందర్భానికి తగ్గట్టు ఒక యుగళగీతం రాయించారు. 'ఎన్నపార్వై' అంటూ మొదలయ్యే ఆ గీతం రాసిన వారు కణ్ణదాసన్. పాట వింటుంటే ముందే సిద్ధం చేసిన బాణీకి సాహిత్యం సమకూర్చినట్టు అనిపిస్తుంది.

కణ్ణదాసన్‌ను 'కంప్యూటర్ కవి' అని పిలిచేవారు. ఏ బాణీ అయినా వినిపించగానే - వెంటనే దానికి తగ్గ మాటలు గడగడా చెప్పేవారట ఆయన. సంగీతదర్శకులో, దర్శకులో 'ఈ రకంగా కాదు మరొక రకంగా కావాలి' అంటే వెంటనే మళ్లీ కొత్త మాటలు ఆశువుగా చెప్పేవారట.

ఈ పాటలో విశేషం - ఒకే మాటను రెండేసి సార్లు వాడడం. పల్లవిలో 'మెళ్ళ మెళ్ళ', 'వణ్ణ వణ్ణ' ఉండగా చరణాలలో 'చిన్నచ్చిన్న' 'ఎణ్ణ ఎణ్ణ' 'కొంజక్కొంజ' ఉన్నాయి.

### కణ్ణదాసన్ రాసిన ఆ పాటను ఒకసారి చూద్దామా!

ఆమె : ఎన్న పార్వై ఉందన్ పార్వై
ఇడై మెలిందాళ్ ఇంద ప్పావై
మెళ్ళ మెళ్ళ ప్పక్కం వందు
తొట్ట సుగం అమ్మమ్మా

అతను : ఎన్న పార్వై ఉందన్ పార్వై
ఎన్నై మఱందేన్ ఇందవేళై
వణ్ణవణ్ణ చ్చేలై తొట్టు
కండసుగం అమ్మమ్మా

ఆమె : తేన్ కొండువంద ముల్లై మొట్టు
పూంచిట్టు ఉన్ సొందమల్లవా
చిన్నచ్చిన్న నెంజిల్ ఉన్నై
ఎణ్ణఎణ్ణ అమ్మమ్మా.....

అతను : కన్నంగళ్ ఎన్నుం తంగత్తట్టు
కై పట్టు చ్చిన్నంగళ్ కొండదో
చొల్లచ్చొల్ల ఉళ్ళం తుళ్ళుం
ఇన్బం ఎన్న శొల్లమ్మా.

ఆమె : మై కొండ కణ్‌గళ్ మెల్ల మూడుం
పణ్‌పాడుం ఎణ్ణంగళ్ కొంజమో
పింజుతైండ్రల్ నెంజై త్తొట్టు
క్కొంజక్కొంజ అమ్మమ్మా.

అతను : ఆగట్టుం ఎన్ల పిన్నుం అచ్చం
ఏన్‌మిచ్చం కణ్ణిల్ ఓడివా
అక్కం పక్కం యారుమిల్లై
వెట్కం ఎన్న శొల్లమ్మా





### తమిళ గీతానికి భావానువాదం :

ఆమె : ఏమి చూపో నీ చూపు
నడుము సన్నబడింది ఈ మగువకు
మెల్లమెల్లగా చెంతకు వచ్చి
తాకిన సుఖం అమ్మమ్మా..

అతను : ఏమి చూపో నీ చూపు
నన్నే మరచాను ఈ వేళ
రంగురంగుల చీరతాకి
పొందిన సుఖం అమ్మమ్మా...

ఆమె : తేనె తెచ్చిన జాజిమొగ్గ
పూలమాల నీ సొంతమే కదా
చిన్న చిన్న మనసులో నిన్ను
అనుకోగా అనుకోగా అమ్మమ్మా

అతను : చెంపలనే బంగరు పళ్లానికి
చేయిసోకి చిన్నెలే తగిలాయేమో
చెప్పగా చెప్పగా మనసు తుళ్లిపడే
ఆనందం ఏమిటో చెప్పమ్మా

ఆమె : కాటుక కన్నులు మెల్లగా మూతలు పడేను
రాగాలాపన చేసే భావాలు కొంచెమా
లేత తెమ్మెర గుండెను తాకి
మురిపాలాడగా అమ్మమ్మా

అతను : కానిమ్మని అన్న తర్వాత భయం
ఎందుకింకా కళ్లల్లో - వడిగా రా
చుట్టుపక్కల ఎవరూ లేరు
సిగ్గెందుకు చెప్పమ్మా

'కాదలిక్క నేరమిల్లై' చిత్రంలోని ఈ పాట సన్నివేశం తెలుగు చిత్రం 'ప్రేమించి చూడు'లోనూ ఉంది. సన్నివేశం అదే. పాట బాణీ కూడా తమిళగీతంలో వినిపించిందే. అయితే తెలుగు పాటకు తమిళగీతం నుంచి వరసతో బాటు కలిసి వచ్చింది ఒక్క 'అమ్మమ్మా' అనే మాట ఒక్కటే. అయితే ఈ అమ్మమ్మ - తల్లికి తల్లి కాదు. భావోద్వేగాన్ని వర్ణించడానికి కణ్ణదాసన్ ఈ 'అమ్మమ్మ'ను ఎన్నో పాటలలో వాడారు. ఈ పాట సన్నివేశంలో జగ్గయ్య, కాంచనలతో బాటు ఒక కారు కూడా నటించింది!

తెలుగు చిత్రంలోని 'దొరికేరు దొరగారు' పాటను స్వతంత్ర గీతంగా మలచిన వారు శ్రీశ్రీ. 'దొరికారు' అని కాకుండా 'దొరికేరు' అనడం విజయనగరం పద్ధతి.

శ్రీశ్రీ ప్రత్యేకమైన ముద్రలతో బాటు ఆయన కవిత్వంలోని గడుసుదనం కూడా ఈ పాటలో కనిపిస్తుంది. పాట అంతా పరుచుకున్న ప్రాస విన్యాసాలు ఎంతో సొగసుగా ఉన్నాయి.

పాట మొదటి నుంచి చివరిదాకా సంభాషణల రూపంలో - ప్రశ్నలకు జవాబులిస్తున్నట్టు రాయడం ఒక ప్రత్యేకత.

'ఏ మాయ చేసినారో మీరు నిలిచారు నా కంటి చూపులో' అని అమ్మాయి అంటే 'మాయనీదే మర్మం నీదే హాయినాదే' అని గడుసుగా జవాబిస్తాడు అబ్బాయి. ఆ మాటవిని అమ్మాయి సిగ్గుపడింది. దాంతో అబ్బాయి 'అనురాగ మధువులు చల్లే ఓ మల్లె ఈ సిగ్గు నీకేల' అన్నాడు. వారి ప్రేమ పెళ్లి దాకా రాలేదు. కాని తమ ప్రేమ ఫలించగలదని ఆ అమ్మాయి నమ్మకం. ఆ నమ్మకంతోనే 'అందం అంతా తమదే కాదా తొందరేల?' అన్నది. అబ్బాయి నిష్ఠురంగా 'నీవాడనని చేరినంత నన్నింత ఊరించనేలనే?' అన్నాడు. దానికి అమ్మాయి సూక్తి వల్లించింది. 'అందీ అందని అందంలో ఆనందం ఉంది' అన్నది. ఆ అబ్బాయి కావడానికి దొరగారే - కాని ఆ అమ్మాయి వలపులు దోచుకున్నాడు. ఆ దోచుకున్న వలపులు దాచలేదని పాట పల్లవిలోనే అమ్మాయి అబ్బాయిని హెచ్చరించింది. ఆ హెచ్చరిక అబ్బాయికి గుర్తు వచ్చింది. 'దొరగారిని దొంగంటేనే చాలా ప్రియురాలా బంధించ రావేల' అని ప్రశ్నించాడు. అబ్బాయి అడిగిన బంధనం వేరు. కాని అమ్మాయి చాలా గడుసుది. పైగా శ్రీశ్రీ రాసిన పాట పాడుతున్నది. అందుకే ఆమె 'పారిపోయే దొంగైతేనే బంధించాలి' అన్నది. వలపులు దోచిన ఆ దొరగారు తన ప్రేమను వద్దని పారిపోడు. హద్దులు మీరని ఆ అమ్మాయి అబ్బాయిని ఎంత ముద్దుగా హద్దులు మీర వద్దన్నదో!



వలపులు దోచిన ఆ దొరగారి గురించి శ్రీశ్రీ రాసిన ఆ పాట ఇది :

**ఆమె :** దొరికేరు దొరగారు ఇక నన్ను విడలేరు<br>
దోచుకున్న వలపులు దాచలేరు అమ్మమ్మా

**అతను :** దొరికేరు దొరగారు ఇక నిన్ను విడబోరు<br>
ఆశలన్నీ తీరేదాకా ఆగలేరు అమ్మమ్మా ॥దొరి॥

**ఆమె :** ఏ మాయ చేసినారో మీరు నిలిచారు<br>
నా కంటి చూపులో...

**అతను :** మాయ నీదే మర్మం నీదే హాయినాదే అమ్మమ్మా హోయ్<br>
అనురాగ మధువులు చల్లే ఓ మల్లె ఈ సిగ్గు నీకేలా

**ఆమె :** అందం అంతా తమదే కాదా తొందరేల అమ్మమ్మా హోయ్ ॥దొరి॥

**అతను :** నీవాడనని చేరినంత నన్నింత ఊరించనేలనే

**ఆమె :** అందీ అందని అందంలో ఆనందం ఉంది అమ్మమ్మా హోయ్

**అతను :** దొరగారిని దొంగంటేనే చాలా ప్రియురాలా బంధించరావేల

**ఆమె :** పారిపోయె దొంగైతేనే బంధించాలి అమ్మమ్మా హోయ్ ॥దొరి॥

**-పి.ఎస్.గోపాలకృష్ణ**

మే 7 ఆత్రేయ జయంతి సందర్భంగా...

# బాణీ ముత్యాలు

**సేకరణ : పి.గిరి, హైదరాబాద్**

మంచివాడికి చెడ్డవాడికీ<br>
తేడా ఒకటే బాబూ!<br>
మంచివాడు మనసున అనుకుంటాడు<br>
చెడ్డవాడు చేసే చూస్తాడు

**చిత్రం : పాపకోసం**<br>
**పాట పల్లవి : బాబూ ! మనిషి మనిషికీ తేడా ఉంది**



ఆత్రేయ

మనిషిలాగ జీవించేది చేతుల్లోనే వుంది<br>
మంచి చెడు ఏదైనా నీ చేతలలోనే వుంది<br>
కావాలని నిప్పుతాకితే చేయి కాలక మానదు<br>
కాలినందుకు కర్మే అంటే గాయమేమో మానదు

**చిత్రం : తాసిల్దారుగారి అమ్మాయి**<br>
**పాట పల్లవి : కనబడని చెయ్యేదో**

మహాత్ములైనా దురాత్ములైనా<br>
మనుజుల పేరనే మసలేరయ్యా<br>
అందరికీ నీ అభయం కలదని<br>
అనుకోమందువ దేవా

**చిత్రం : వాగ్దానం**<br>
**పాట పల్లవి : వెలుగు చూపవయ్యా**

# తాంతాం థిత్తై తథిగిణతోం

## సీరియల్ 12

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
| --- | --- |
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

- జీడిగుంట రామచంద్రమూర్తి



### జరిగిన కథ

రాజుపాలెం గ్రామంలోని రావుబహద్దర్ వీరభద్రం అంటే ఇంట్లోవాళ్లకు, బయటవాళ్లకు అందరికీ హడల్. పట్నంలో చదువుతున్న అతని కొడుకు శ్రీరామ్‌కి కూడా. అందుకే అశ్విని అనే డబ్బున్న అందమైన అమ్మాయి తనను ప్రేమిస్తున్నా ముందువెనకలాడుతూంటాడు. శ్రీరామ్ అంటే అభిమానం పెంచుకున్న అశ్విని తండ్రి విష్ణుమూర్తి వీరభద్రం ఇంటికి వచ్చి పెళ్లి ప్రతిపాదన తెస్తాడు. వీరభద్రం అతన్ని అవమానించి పంపుతాడు. తండ్రితో ధైర్యంగా పెళ్లి గురించి మాట్లాడడానికి శ్రీరామ్‌కు తావీజు కట్టిస్తుంది అశ్విని.

- ఇక చదవండి

తండ్రి వైపు విచిత్రంగా చూసింది అశ్విని అటూ ఇటూ నడుస్తూ ఆవేశం నిండిన స్వరంతో చెప్పాడు విష్ణుమూర్తి మళ్లీ -

"శ్రీరామ్ తండ్రితో మీ పెళ్ళిసంగతి మాట్లాడదామని..పొద్దున్నే వాళ్ల వూరెళ్లాను. ఆరు నూరైనా, నూరు ఆరైనా మీ పెళ్ళి జరగదన్నాడు. అయినా నచ్చచెప్పేను ... నువ్వు మోజుపడ్డ ఆ శ్రీరామ్ పేరుకి తగినట్టుగానే వున్నాడు కనుక.... .వాళ్ళనాన్న 'దశరథుడంత సౌమ్యంగా వుండకపోతాడా' అనుకున్నాను..కానీ నువ్వన్నట్టు గొప్ప చండశాసనుడు!... అంతేకాదు..వేపకాయంత వెర్రీ ..ముంజికాయంత మూర్ఖత్వం కూడా వున్న ముదనష్టపు మనిషిలా వున్నాడు. మనిద్దర్నీ విడివిడిగానూ కలగలిపీ..ఎన్ని మాటలన్నాడో తెలుసా?..కొన్ని శాపాలు కూడా పెట్టాడు....తల్చుకుంటే నాకు బీపీ రైజయ్ పోతోంది ఇందాకట్నించీ !..ఆఁ !"

"సారీ డాడీ! నా కారణంగా మీకింత అవమానం జరుగుతుందని ఊహించలేక పోయాను...మీరా ఇంటికి వెళ్ళకుండా వుండాల్సింది!" బాధగా అందామె.

"ఫరవాలేదులే బేబీ!.. అన్నీ మన మంచికే!.. నువ్వసలు ఆ 'మాడుపెనం' ముఖానికి కోడలు కాకపోవటమే మంచిది. .వాడి 'ఫేసు' చూస్తే వాంతులవుతాయి. వాడి భాష వింటే పిచ్చెక్కుతుంది!"

"కానీ ..నేను ప్రేమించింది శ్రీరామ్‌ని డాడీ!.. అతని ఫేసు నాకు నచ్చింది...అతని మాటలు వినకుండా నేనుండలేను...అందుకే నా మనసేనాడో అతనికి ఇచ్చేశాను."

"బేబీ!" కోపంగా అరిచాడు విష్ణుమూర్తి.

తండ్రిలో అంతటి ఆగ్రహావేశాల్ని చూసిన అశ్విని వెంటనే బదులు చెప్పలేక పోయింది.

విష్ణుమూర్తి ఈ లోగా తనను తాను కొంత 'కంట్రోల్' చేసుకుని..నచ్చచెప్పే ధోరణిలో అన్నాడు మళ్లీ.




"చూడు బేబీ! ఇన్నాళ్ళూ నువ్వడిగిందల్లా ఇచ్చాను..చెప్పిందల్లా చేశాను. కానీ ఈ ఒక్క విషయంలో మాత్రం నా మాట విను బేబీ!.. ఇది ఆజ్ఞకాదు.... అర్థింపనుకో!.. నువ్వు మెచ్చిన ఆ శ్రీరామ్ కాకపోయినా నీకు అన్నివిధాలా నచ్చే నవ మన్మథుణ్ణి చూసి నెలరోజులు తిరిగేలోగా పెళ్ళిచేస్తాను. పెళ్ళయ్యాక నీ భర్తని ప్రేమించి జీవితాన్ని సుఖమయం చేసుకో..."

సోఫాలోంచి ఛివాల్న లేచింది అశ్విని

"ఆడది ఒక్కసారే - ఒక్కర్నే ప్రేమిస్తుంది డాడీ!"

"షటప్ !...నాకు జ్ఞానం వచ్చాక ఆ డైలాగ్‌ని చాలా సినీమాల్లో విన్నాను. ఒక్కసారే ప్రేమించి.. ఆ తర్వాత మనసు మార్చుకోవటానికి వీల్లేనంత 'అట్లాంటిక్ ఓషనూ'-'ఎవరెస్టు మౌంటెనూ' కాదు ప్రేమంటే!.. అది 'అయిస్‌క్రీం' లాంటిది ..కాదంటే కర్పూరంలాంటిది! ..పెళ్ళయిన పదిరోజులకో, ముప్ఫయ్‌రోజులకో కరిగి చక్కా పోతుంది... కానీ 'పెళ్ళి' అలాంటిది కాదు...అది శాశ్వతం!.. దేవుడు ముడివేసే బంధం!.. అర్థమైందా?" తీవ్రంగా చూస్తూ అడిగేడు.

అశ్విని తలవంచుకుని బొటనవేలితో నేలమీద రాస్తూండిపోయింది..

"ఇక అట్టే విసిగించక.. నీ గదిలో కెళ్లి రెస్ట్ తీసుకో..!పరీక్షలైపోయాయి కనుక. ..కావాలంటే ఓ పదిరోజుల పాటు 'కొడైకెనాల్'కి వెళ్ళి మన గెస్ట్‌హౌస్‌లో రెస్టు తీసుకురా! కాస్తంత రిలాక్సింగ్‌గా వుంటుంది.. ఈ లోగా 'వెబ్‌సైట్'లో ఏ అమెరికా సంబంధమో-చూసుంచుతాను"- అదే తన ఆఖరి మాటగా చెప్పి బయటకు వెళ్లిపోయాడు విష్ణుమూర్తి. పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.. .తన గదిలోకి వెళ్లిపోయింది అశ్విని.

* * * *

శ్రీరామ్ చాలా అసహనంగా వున్నాడు..

ఇంటికొచ్చి మూడు రోజులైనా..తాను అశ్వినిని ప్రేమించిన విషయాన్ని తండ్రి దగ్గర ప్రస్తావించే అవకాశం దొరకలేదు..

మాటిమాటికీ 'రసూల్ బాబా' ఇచ్చిన తావీజును కళ్ళకద్దుకుంటున్నాడు.... బాబా ఇంటిదగ్గర్నించి కారులో - తనను హాస్టల్ దగ్గర డ్రాప్ చేసేముందు అశ్విని ఇచ్చిన 'సెల్‌ఫోన్' తీసి మాటిమాటికీ చూసు కుంటున్నాడు..దాని 'స్క్రీన్' మీద అశ్విని రూపమే ప్రత్యక్షమవుతోంది.. మనసును అదుపులో పెట్టుకుంటూ 'విజయానికి అయిదు మెట్లు' పుస్తకంలో అశ్విని మడతపెట్టిన ఛాప్టర్‌ని పదేపదే చదువుకుంటున్నాడు.. ఆరోజు, తన పొలంలోకి ఎరువుతోలించే పనిమీద, విజయవాడనుంచి మిత్రుడు చిదంబరం వస్తే - అతనితో కలిసి వీరభద్రం కూడా బయటకు వెళ్లాడు..భోజనాల సమయం మించి పోతోంది...

సాధారణంగా ఆ ఇంట్లో వీరభద్రం తిన్న తర్వాతనే , పిల్లలతో కలిసి భోజనం చేస్తుంది పార్వతమ్మ.

"నాన్నగారు వచ్చేసరికి ఇంకా ఆలస్యం అవుతోందో ఏమిటో! నువ్వూ తమ్ముడూ తినేయండి" అంది పార్వతమ్మ శ్రీరామ్ గదిలోకివచ్చి.

"ఫరవాలేదులే! ఇవాళ నాన్నగారితో కలిసి తింటాను !" అన్నాడు శ్రీరామ్ ఆ పుస్తకం చదువుతూనే.

కొంచెం విడ్డూరంగా చూసింది పార్వతమ్మ ..అది జరిగేపని కాదని ఆమెకు తెలుసు! ఆయన కంటపడటానికే భయపడే శ్రీరామ్,ఆయన పక్కన కూర్చుని ఎలా తింటాడూ...?

కానీ, పుస్తకం చదవటంలో పూర్తిగా నిమగ్నమైపోయిన 'శ్రీరామ్' ని మరి ఒత్తిడి



చేయటం ఇష్టంలేక వంటింట్లోకి వెళ్లిపోయింది.

అప్పుడు శ్రీరామ్ 'విజయానికి అయిదు మెట్లు పుస్తకంలో 'భయం' గురించిన ఛాప్టర్ చదువుతున్నాడు.

"......భయం అనేది 'బూమెరాంగ్' లాంటిది...! ఇది అవకాశానికి బద్ధ శత్రువు. దీనికి మనం ప్రాధాన్యత ఇస్తే..మరింత రెట్టింపు పరిమాణంలో అది వెనక్కి వచ్చి మనల్ని మరింత భయపెడుతుంది. జీవితంలో ముందుకు సాగిపోవాలంటే...భయాన్ని అధిగమించక తప్పదు.."

నిజమే! తాను నిర్భయంగా తండ్రితో, తన ప్రేమ గురించీ,పెళ్ళిగురించీ మాట్లాడకపోతే బంగారం లాంటి అవకాశం చేజారి పోతుంది!

"....భయం అనేది క్షణకాలం మాత్రమే బ్రతుకుతుంది..ఒక్కసారి దాన్ని అధిగమిస్తే ..అది మన చెప్పుచేతుల్లో వుంటుంది..!"

అందుకే తన తండ్రి దగ్గర ధైర్యంగా నిలబడాలనీ, మాట్లాడాలనీ తీర్మానించుకున్నాడు శ్రీరామ్. ఆ పుస్తకంలో రాసినట్టు -టంగుటూరి ప్రకాశం పంతులుగారి లాగా దేశంకోసం ఇంగ్లీషువాడి తుపాకీకి ఎదురునిలిచి.." కాల్చు కోరా..కాల్చుకో", అని గుండె చూపేటంత ధైర్యం తనకు లేకపోవచ్చు!... కానీ తన 'జీవిత సమస్య' కళ్ళముందుకు దూసుకుని వస్తుంటే ..'రా. .చూస్తాను!' అనగలిగే ధైర్యం తనదగ్గరుంటే చాలు..

ఆ ధైర్యం తెచ్చుకుని అవసరమైతే తండ్రిని ఎదిరించాలి... ఆ సాహసాన్ని తనలో నింపుకుని .తనను ప్రేమించిన అశ్వినిని స్వంతం చేసుకోవాలి. అసలు ప్రేమించటం కంటే, ప్రేమించబడటమే గొప్ప విషయమని ఎంతో మంది నిర్ధారణగా చెప్పారు. అలాంటప్పుడు అన్నివిధాలా తనకంటే పదిమెట్లు పైన వున్న



అశ్విని ప్రేమను పొందగలటం ఎంత అదృష్టం?..

ఇప్పుడిప్పుడే ..రసూల్ బాబా ఇచ్చిన తావీజు కట్టుకున్నాక అశ్విని బహూకరించిన ఆ పుస్తకం చదివేక ..ప్రేమ ఎంత గొప్పదో, ఎంత బలమైనదో తాను అవగాహన చేసుకోగలుగుతున్నాడు. ఆ పుస్తకంలోని ఆఖరిపేజీలు తీసి వాటిలో 'ప్రేమ'ను గురించి రాసిన వాక్యాల్ని తాను ప్రత్యేకంగా ఎర్రసిరాతో 'అండర్‌లైన్' చేసుకున్న ఆ వాక్యాన్ని మననులో మరోసారి చదువుకున్నాడు శ్రీరామ్...."ప్రేమంటే సౌందర్యం! .. సౌందర్యమంటే ఆనందం... సంపూర్ణ విజయానికి తొలిస్తంభం ప్రేమ!.. ప్రేమంటే అవతలివారి బాధను అర్థంచేసుకోవటం. ప్రేమంటే సూర్యోదయంలో సూర్యాస్తమయాన్ని కూడా చూడగలగటం. నిశ్శబ్దాన్ని వినగలగటం. ఒక నమ్మకాన్ని మిగుల్చుకోవటం! రుషుల పెదవుల మీది చిరునవ్వును అర్థంచేసుకోగలగటం... ! కొండ అంచుల మీద ఆగిపోయిన సాయంత్రాలను పలకరించటం. సముద్ర కెరటాలను చూస్తూ వాటి చప్పుడులో సంగీతాన్ని వినగలగటం..! అన్నీ ...అంతా ప్రేమే!"

ఓహ్!..ఎంత గొప్పపరిశీలన?....!

ఆ వాక్యాలను చదివిన శ్రీరామ్ కళ్ళు తనకు తెలియకుండానే చెమ్మగిల్లేయి. మనసెదో అర్థంకాని ఆర్ద్రతతో నిండి పోయింది... వాటిని రాసిన రచయితను అభినందించకుండా వుండలేకపోయాడు.

అంత గొప్ప ప్రేమని ..అంతటి విశాలమైన ప్రేమని .. అలాంటి ప్రకృతి సిద్ధమైన ప్రేమని తాను ఇంతకాలం చూడలేకపోయాడు... అనుభవించలేకపోయాడు. ఆస్వాదించలేక పోయాడు..

ప్రేమ తత్వాన్ని ..మహత్యాన్నీ అశ్విని అవగాహన చేసుకున్నది కనుకనే...తాను పొమ్మన్నా తనను నీడలా వెంబడించింది.

ఏమైనసరే, అశ్వినిని వదులుకోకూడదు.. .అందుకు తండ్రిని, 'ఎదిరించటమే' కాదు అవసరమైతే తన వాళ్ళను వదులు కోవడానికైనా సిద్ధపడాలి..

అలా సాగిపోతున్న శ్రీరామ్ ఆలోచనలకు ..తండ్రి గొంతు అంతరాయం కలిగించింది.

"త్వరగా భోజనం వడ్డింపుడు!.. ఇప్పటికే కాలాతీతమైనది!" వంటింట్లో వున్న భార్యను ఆదేశిస్తున్నాడు.

పార్వతమ్మ వడ్డన పూర్తిచేసేసరికి - వీరభద్రం, చిదంబరం బట్టలు మార్చుకుని డైనింగ్ టేబులు దగ్గర వచ్చారు.

"నాక్కూడా వడ్డించు !" అంటూనే, కంచం తెచ్చుకుని తండ్రికి ఎదురుగా కూర్చున్నాడు శ్రీరామ్.




పార్వతమ్మ తృటికాలం నివ్వెరపోయింది.

అంతకముందు ..'ఇవాళ నాన్నగారితో కలిసి తింటాన్లే' అని శ్రీరామ్ అన్నప్పుడు ఏదో యదాలాపంగా అని వుంటాడులే అనుకుంది.. కానీ. ఇప్పుడు అన్నంతపని చేసేసరికి ..ఆవిడకు మతిపోయినంత పనైంది.

పిల్లలు - తండ్రితో కలిసి భోజనం చేయటం - ఆ ఇంట్లో విడ్డూరమే మరి!

అంతేకాదు....!

ఆ తండ్రికి 'ఎదురుగా' కూర్చోవటం అంటే 'పాతాళభైరవి'లో తోటరాముడు చేసినంత సాహసం కూడానూ!..

అయితే వీరభద్రం అదేవీ అంతగా పట్టించుకున్నట్టు కనిపించలేదు.

మిత్రునితో ఏవో వ్యవహారాలు మాట్లాడుతున్నాడు.

**(ఇంకావుంది)**



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

# లలిత సంగీతం

## నీ వంటి తల్లిని వేరెక్కడైన కందుమా

ప॥ నీవంటి తల్లిని వేరెక్కడైన కందుమా
నీవంటి దైవము వేరెవ్వరైన ఉందురా
లేరు లేరు లేరు నీసాటి ఎవరు లేరు
తల్లీ...తల్లీ మా పాలి కల్పవల్లి ॥నీవంటి॥

చ॥ ఉన్నత వంశాన వెలసి మన్నవలో నెలకొని
మహితోన్నత స్థితిచేత మహినె పవిత్రము చేసిన
జగజ్జనని మాయమ్మా రాజరాజేశ్వరీ
భగవతి నీపద యుగళమె సదా నమ్మియున్న మేము ॥నీవంటి॥

చ॥ కరుణయె మూర్తీభవించి కన్నతల్లి నీవైతివి
కలియుగవాసులకు మాకు కమలాక్షీ నీ పదములు
సేవించు భాగ్యమొసగి సద్గతి కల్గించేవు ॥నీవంటి॥

| | | |
|---|---|---|
| **రచన, సంగీతం** | } | చిత్తరంజన్ |
| **గానం** | : | శ్రీమతి పి. సుశీల |
| **రాగం** | : | బేహాగ్ |
| **తాళం** | : | త్రిశ్రగతి (కర్ణాటక సం॥) దాద్రా(హిందుస్తాని సం॥) |
| **ఆరోహణ** | : | సగమ[1] పని[2] దని[2]స |
| **అవరోహణ** | : | సని[2] దపమ[2] గమ[1] గరిస |

- షడ్జము, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం,కాకలినిషాదం, చతుశృతిధైవతం, కాకలినిషాదం ఆరోహణలోను, కాకలినిషాదం, చతుశృతి ధైవతం, పంచమం, ప్రతిమధ్యమం, అంతరగాంధారం,శుద్ధ మధ్యమం, అంతర గాంధారం, చతుశృతి రిషభం, అవరోహణలోను వుంటాయి ఈ రాగంలో.

కైశిక నిషాదం కూడా యీరాగంలో ఉపయోగించ బడుతుంది.

మ[1] - శుద్ధమధ్యమం. ని[1] - కైశికి నిషాదం
మ[2] - ప్రతిమధ్యమం ని[2] - కాకలినిషాదం

**బే**హాగ్ రాగం బాగా ప్రసిద్ధి చెందిన రాగమే. లలిత శాస్త్రీయ, లలిత సంగీతాలకు అనువుగా వుండే రాగం. హిందుస్తాని సంగీతంలో దీనిని బేహాగ్ అని, బిహాగ్ అని పిలుస్తారు. ఈ రాగం యొక్క ఆరోహణ,అవరోహణ క్రమంలో స్వల్ప మార్పులతో. మారూ బిహాగ్, నట్ బిహాగ్ మొదలగు రాగాలు ఏర్పడినవి.

ఆదిపరాశక్తియైన రాజరాజేశ్వరి అవతార మూర్తిగా పరిగణించబడే మాతృమూర్తి శ్రీమన్నవ రాజరాజేశ్వరి అమ్మవారిపై నాకు కలిగిన నిదర్శనాలు, అనుభూతులతో నేను రచించి స్వరపరిచిన **"నీ వంటి తల్లిని వేరెక్కడైన కందుమా"** అనే స్తుతిగీతాన్ని తెలుగు చలన చిత్ర సుప్రసిద్ధ గాయనీమణి శ్రీమతి పి. సుశీలగారు అద్భుతంగా గానం చేశారు. 1986లో శ్రీమన్నవ రాజరాజేశ్వరీ అమ్మవారి 'దివ్యస్థితి రజతోత్సవాల సందర్భంగా మద్రాసులోని "సంగీతా క్యాసెట్ రికార్డింగ్ కంపెని" ద్వారా సుశీలగారు పాడగా "శ్రీమన్నవమ్మ భక్తిగాన సుధ" అనుపేర క్యాసెట్‌గా రూపొందించడం జరిగింది. ఆ క్యాసెట్ వెలువడడానికి మూలకారణం సుశీలగారే! ఆ విధంగా ఆమె అమిత భక్తితో అమ్మవారికి స్వరార్చన గావించిన ఆ క్యాసెట్ మే 10, 1986నాడు స్థానిక రవీంద్రభారతిలో అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ చేత ఆవిష్కరించబడినది. ఇప్పుడు ప్రస్తావించబడుతున్న ఈ పాట ఆ క్యాసెట్ లోనిదే.

## శ్రీమన్నవ రాజరాజేశ్వరి అమ్మ

గుంటూరు సమీపంలో వున్న వల్లూరు గ్రామంలో 1934వ సంవత్సరంలో మాఘశుద్ధ రథసప్తమి శుక్రవారం నాడు వల్లూరి బాల కోటేశ్వర రావు, వెంకటసుబ్బమ్మ పుణ్య దంపతులకు అమ్మ జన్మించింది. ఆమెకు తల్లిదండ్రులు పెట్టిన పేరు అలవేలు మంగమ్మ. పూవు పుట్టగానే పరిమళించు చందాన ఆమెలోని ఆధ్యాత్మిక శక్తి బహిర్గతమవుతూ పలువురి దృష్టినాకర్షించింది. చిన్ననాటినుండి ఆమెకు శివుని పై భక్తి మెండుగా వుండేది. ఎక్కువగా ధ్యానంలో గడిపేది. ఎనిమిదవ ఏట ఆమెకు మన్నవలోని వెంకటేశ్వర్లుతో వివాహమైనది. పదిహేనవ ఏట ఆమెకు ఆడశిశువు కలిగినది. ఆమెకు లక్ష్మి అనిపేరు పెట్టారు. సంసారం యందు నిర్లిప్తతతో ఆమె కాలం గడిపేది. కొంతకాలానికి జిల్లెళ్ళమూడిలో వున్న అమ్మ అవతారమూర్తి అని విని మంగమ్మ ఆమె దర్శనార్థమై వెళ్ళింది. ఆమెలో తన యిష్టదైవాన్ని చూచుకున్నది. ఇలావుండగా 1961మే 10వ తేదీన తన బంధువుల వివాహానికై గుంటూరు వెళ్ళి నపుడు ఆమెకు ఒళ్ళుతెలియని ధ్యానావస్థలో శ్రీరాజ రాజేశ్వరి, శ్రీ సుబ్రహ్మణ్య స్వామి దివ్యదర్శనాన్ని ప్రసాదించి, ఆమె హృదయమే నిలయంగా చేసుకుని ఆమెలోనే వుండిపోయారు. ఆ క్షణం నుండి ఆమె జగజ్జనని రాజరాజేశ్వరిగా భక్తులను అనుగ్రహిస్తుండడం జరుగుతున్నది. ఆ క్షణం నుండే ఆమెకు ఆకలి దప్పులు లేకుండా పోయాయి. మన్నవ గ్రామానికి చెందివుండడంచేత అమ్మ మన్నవరాజరాజేశ్వరి దేవిగా ప్రసిద్ధిగాంచింది. ఆకలిదప్పులు లేకుండా సుమారు 40 సంవత్సరాలకు పైగా జీవించగల్గడం మన





ఊహకందని విషయం. ఆ విధంగా అమ్మ తన దివ్యశక్తితో భక్తుల బాధలను పోగొట్టి సుఖశాంతులను ప్రసాదినస్తూ సన్మార్గాన యీనాటికీ నడిపిస్తున్నది. మనదేశం నలుమూలలా, విదేశాలలోను కూడా అమ్మ దివ్యానుగ్రహానికి పాత్రులైన వారు చాలామంది వున్నారు. ఆమ్మకు 1961మే 10న కలిగిన ఆ దివ్యస్థితిని పురస్కరించుకుని అప్పటినుంచి ప్రతి ఏడు మే 10,11 తేదీలలో శ్రీఅమ్మ దివ్యస్థితి మహోత్సవాలను భక్తులు వైభవంగా జరుపుకుంటున్నారు. అమ్మ మద్రాసు వెళ్ళినప్పుడల్లా తరచుగా శ్రీమతులు పి. సుశీల, యస్. జానకి, అంజలీదేవి, చిత్తూరు నాగయ్య, చలం మొదలగు వారంతా అమ్మను దర్శించుకుని సేవించేవారు. "రాజరాజేశ్వరీ! ...సుబ్బమ్మ కన్నది దేవుడమ్మని' అంటూ చిత్తూరు నాగయ్య ఎన్నో పాటలు వ్రాయగా యస్. జానకి వాటిని పాడేవారు అమ్మ సమక్షంలో'. అదేవిధంగా పి.సుశీల, వి.రామకృష్ణ మున్నగు వారు అమ్మమీద ఎన్నోపాటలు పాడేవారు.

1975లో శ్రీమన్నవమ్మ హైదరాబాదుకు వచ్చినప్పుడు మొట్టమొదటిసారి ఆమె దర్శన భాగ్యం నాకు కలిగింది. అప్పటినుంచి నేను, మా కుటుంబ సభ్యులమంతా అమ్మకు అంకితమై అమ్మసేవలోనే గడుపుతున్నాము. అమ్మ హైదరాబాదులో స్థిరనివాసమేర్పరచుకోగా, బేగంపేటలో భక్తులు 1981లో ఆమెకు "శ్రీమన్నవమ్మ నిలయం" పేరిట ఆశ్రమాన్ని నిర్మించారు. నేను, మా శ్రీమతి డా॥ పద్మినీదేవి అమ్మ అనుగ్రహంతో ఆమెపై ఎన్నోకీర్తనలు, పాటలు రచించడం జరుగుతున్నది. ఆ విధంగా మేము రచించిన గేయాలను నా సంగీత నిర్వహణలో శ్రీమతి సుశీలగారు సుమధురంగా గానం చేయగా సంగీతా క్యాసెట్ కంపెని ద్వారా 1986లో శ్రీఅమ్మదివ్యస్థితి రజతోత్సవాల సందర్భంగా క్యాసెట్‌గా రూపొందించడం జరిగింది. ఆ మహాగాయని అమ్మపట్ల చూపిన భక్తి శ్రద్ధలు, రికార్డింగ్‌కు వెళ్ళిన నాపై ఆమె చూపిన ఆత్మీయత, ఆదరణ జీవితాంతం నేను మరవలేనివి. 'శ్రీమన్నవమ్మ నిలయం' లో నిరంతరం అమ్మపూజలు,సేవలు వైభవంగా జరుగుతున్నవి. క్రితం సంవత్సరం, అనగా 2003 మే 19న శ్రీమన్నవమ్మ మహానిర్యాణం చెందారు. ఆశ్రమ నిర్వహణ, తదితర కార్యక్రమాలను అమ్మగారి తనయ శ్రీమతి లక్ష్మి, ఆమె భర్త శ్రీ సుబ్బారావుగారు (అమ్మగారి సోదరుడు), అమ్మభక్తులు కలిసి భక్తి శ్రద్ధలతో జరుపుకుంటున్నారు



## శ్రీమతి పి.సుశీల

దక్షిణభారత చలన చిత్రరంగంలో భాసించిన ఉత్తమ గాయనీమణులలో శ్రీమతి పి.సుశీల ప్రముఖులు. సుమధురమైన గాత్రంతో ఏ భావాన్నైనా అలవోకగా పలికించి, ఏ రసాన్నైనా అవలీలగా పండించగల మేటి గాయని ఆమె.

"బాలనురా మదనా - విరి తూపులు వేయకురా మదనా" (ఖరహరప్రియరాగం)", అందాల బొమ్మతో ఆటాడవా" (కాపి రాగం) మొదలైన జావళీలు పాడటంలో శాస్త్రీయ సంగీత నైపుణ్యం, "ఏమని పాడెదనో ఈ వేళ", "పాడమని నన్నడగ తగునా" వంటి సుమధుర లలిత గీతాలలోని మాడ్యులేషన్, భావప్రకటన ప్రదర్శించిన



విధము, "రాయినైనాకాకపోతిని రామపాదము సోకగా", "ఊరికే కొలనునీరు ఉబికి ఉబికి పడుతుంది", "జయపాండురంగ ప్రభో విఠలా", మొదలైన అసంఖ్యాకమైన భక్తి గేయాలలో చూపిన ఆర్తి, కరుణరసం...యిలా ఆమె పాడిన వేలాది పాటలలో ఆమె అసాధారణ ప్రజ్ఞ మనకు అవగతమవుతుంది. సాలూరు రాజేశ్వరరావు, పెండ్యాల, ఘంటసాల, మాస్టర్‌వేణు, కె.వి. మహదేవన్, టి. చలపతిరావు, రమేష్ నాయుడు, సుసర్ల దక్షిణామూర్తి, యం.యస్. విశ్వనాధన్, చక్రవర్తి, సత్యం, జి.కె. వెంకటేష్, ఇళయరాజా మొదలుగా ఎంతో మంది స్వరకర్తలు కూర్చిన ఆణిముత్యాల వంటి గేయాలు శ్రీమతి సుశీల గాత్రంలో రక్తి కట్టాయి. 1960లో సారథీవారి "కులదైవం" చిత్రంలో మాష్టర్ వేణు గారు స్వరపరచిన "రావే రావే వయ్యారి ఓ చెలీ" అనే యుగళ గీతాన్ని సుశీలగారితో నేను పాడడం జరిగింది.

"కృష్ణం వందే జగద్గురుం" అనే యల్.పి. మరియు క్యాసెట్‌కు రాజేశ్వరరావుగారు రూపొందించిన సంగీతంలో దక్షిణాది వాగ్గేయకారుల రచనలకు కర్ణాటక రాగాలు, ఉత్తరాది వాగ్గేయకారుడైన జయదేవుని అష్టపదులకు హిందుస్తాని రాగాలను ఉపయోగించి ప్రాణం పోస్తే వాటిని అద్భుతంగా గానం చేయడంలో శ్రీమతి సుశీల తనకు తనే సాటి అని నిరూపించుకున్నారు. ముఖ్యంగా "లలిత లవంగ లతాపరిశీలన" అనే అష్టపదిని హిందుస్తాని లలిత్ రాగంలో స్వరపరచగా సుశీలగారు గానం చేసిన తీరు నన్ను అమితంగా పరవశింపజేసింది. ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో శ్రీ యల్. కృష్ణన్ స్వరపరచిన కొన్ని పాటలు సుశీల పాడారు. అదేవిధంగా లలితగీతాలతో అవధానం గావించే శ్రీసాయికృష్ణ యాచేంద్ర గారి పాటలు ఎన్నో సుశీల పాడారు.

ఆంధ్రుల అభిమాన గాయని సుశీలగారిని, ఆలస్యంగానైనా 2002 సంవత్సరానికి ప్రతిష్ఠాత్మకమైన రఘుపతి వెంకయ్యఅవార్డుతో రాష్ట్రప్రభుత్వం సత్కరించడం ముదావహం. ఆంధ్రులకు గర్వకారణం. ■

**బేహాగ్ రాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలను 16-31 జూలై, 2002 'హాసం' సంచికలో పేర్కొనడం జరిగింది**

## హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

### 1963

లతా-మహేంద్రకపూర్ కాంబినేషన్‌లో వచ్చిన 'ఆజ్ కి ములాకత్ బస్ ఇతనీ, కర్ లేనా బాతేఁ', రఫీ సోలో 'యే ఝుకే -ఝుకే నైనా', 'ఇస్ భరీ దునియా మేఁ కోయీ భీ హమారా న హువా', లతా సోలో 'వో దిల్ కహాఁ సే లావూఁ' పాటలు 'భరోసా' చిత్రంలో హిట్స్‌గా నిలిచాయి. లతా పాడిన 'వో దిల్ కహాఁ సే లావూఁ' పాట ట్యూన్‌తోనే 12 సంవత్సరాల తర్వాత 'ఏక్ మహల్ హో సప్నోం కా' చిత్రం కోసం రవి 'దిల్ మేఁ కిస్ కీ ప్యార్ కా జల్తా హువా దియా' పాటను రూపొందించారు. ఈ పాటను కూడా లతాయే పాడటం ఒక విశేషమైతే ఇది లతా హిట్స్‌లో ఒకటి నిలిచి పోవటం మరీ విశేషం.

'తుమ్హే పాకే హమ్ నే'(గెహరా దాగ్), 'ఖిలే హైఁ సాఖి ఆజ్ ఫుల్వా మన్ కే'(గృహస్తి), 'జాన్-ఏ-బహార్ హుస్న్ తేరా బేమిసాల్ హై', 'జిందగి క్యా హై గమ్ కా దరియా హై' (ప్యార్ కియా తో డర్నా క్యా), 'సౌ బార్ జనమ్ లేంగే (ఉస్తాదోం కా ఉస్తాద్), 'యే రాస్తే హైఁ ప్యార్ కే', 'యే ఖామోషియాఁ యే తన్హాయియాఁ(యే రాస్తే హైఁ ప్యార్ కే ('మనుషులు-మమతలు' సినిమాలోని 'నిన్నుచూడనీ, నన్ను పాడనీ' పాట ఈ పాట ట్యూన్‌పైనే ఆధారపడింది.) పాటలు రవి కి మంచి పేరు తీసుకువచ్చాయి.

అయితే ఈ సంవత్సరంలో రవికి చెప్పుకోదగ్గ గొప్ప హిట్ మాత్రం నిస్సందేహంగా గుమ్‌రాహ్. ఈ చిత్రంతో ప్రారంభమైన బి.ఆర్.చోప్డా, రవిల బంధం 80ల వరకూ నిరాటంకంగా వెండితెరలపై సాగి బుల్లితెర పై కూడా కొనసాగింది. ఈ చిత్రం మ్యూజికల్‌గా హిట్ కావటమే కాదు 'చలో ఎక్ బార్ ఫిర్ సే అజనబీ బన్ జాయే హమ్ దోనో', 'ఇన్ హవావోఁమేఁ ఇన్ ఫిజావోఁ మేఁ', 'ఆప్ ఆయే తో ఖయాల్-ఎ-దిల్-ఎ-నషాద్ ఆయా' పాటలు మహేంద్రకపూర్ గాయకునిగా ఉన్నత స్థాయికి చేరుకోవటానికి ఎంతగానో తోడ్పడ్డాయి.

సునీల్ దత్ స్వంత సినిమా 'ముఝే జీనే దో' మ్యూజికల్‌గా మంచి పేరు తెచ్చుకుంది. జయదేవ్ స్వరకల్పనలో వెలువడిన 'అబ్ కోయీ గుల్షన్ న ఉజడే', 'రాత్ భీ హై కుఛ్ భీగి భీగి', 'నదీ కినారే నా జావో షామ్' పాటలు హిట్ అయ్యాయి. సునీల్ దత్ ఈ చిత్రాన్ని నిర్మించారు.


యే రాస్తే హైఁ ప్యార్ కే చిత్రంలో లీలానాయుడు, సునీల్‌దత్

పండిట్ రవిశంకర్ 'గోదాన్' చిత్రానికి సంగీతాన్నిచ్చారు. మొదటి సారిగా ఆ చిత్రంలోని అన్ని పాటలనూ అంజాన్(గీత రచయిత సమీర్ తండ్రి) వ్రాశారు.

హిందుస్తానీ, పాశ్చాత్య సంగీతాలలో విశేష ప్రతిభ కనబరిచిన వనరాజ్ భాటియా తొలిసారిగా నిర్మితమైన ఇండో-అమెరికన్ చిత్రం 'ద హౌస్ హోల్డర్'నికి నేపథ్య సంగీతాన్నందించి సంగీత దర్శకునిగా మారారు. శశికపూర్ ఈ చిత్రానికి హీరో. తర్వాత 70 నుండి 90 ప్రాంతాల వరకూ నిర్మితమైన మర్చంట్ ఐవరీ చిత్రాలన్నింటిలోనూ హీరో శశికపూరే!

కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీలు తొలిసారిగా ముఖేష్‌తో 'ఫూల్ బనే అంగారే' చిత్రం కోసం 'చాంద్ ఆహేఁ భరేగా ఫూల్ దిల్ థామ్ లేంగే' అంటూ పాడించారు. ఇదే చిత్రంలో రఫీ పాడిన 'హిమాలా కి బులందీ సే సునో ఆవాజ్ హై ఆయీ.... వతన్‌పే జో ఫిదా హోగా' పాట దేశభక్తిని రగిల్చి మంచి హిట్ అయింది. అలాగే ముఖేష్ 'కహీఁ ప్యార్ న హో జాయే' చిత్రం కోసం పాడిన 'ఠుముక్ ఠుముక్ మత్ చలో, కిసీ కా దిల్ తడ్‌పేగా' పాట కూడా సూపర్ హిట్ అయింది.

'బ్లఫ్ మాస్టర్' చిత్రంతో కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీలు మన్‌మోహన్ దేశాయ్‌కి వరుసగా రెండో మ్యూజికల్ హిట్ నిచ్చారు. మరాఠీ జానపద బాణీని అనుసరించి వీరు రూపొందించిన 'గోవిందా ఆలా రే ఆలా జరా మటీకీ సంభాల్' (రఫీ) పాట సూపర్ హిట్ అయింది. ఈ చిత్రంకోసం లతా-రఫీ పాడిన 'హుస్న్ చలా కుఛ్ ఐసీ చాల్, దివానే కా పూఛ్ న హాల్', ముఖేష్ పాడిన 'సోచా థా ప్యార్ హమ్ న కరేంగే' పాటలు కూడా హిట్ అయ్యాయి.

-(వచ్చే సంచికలో మరికొంత)

# కారులో షికారు

- కె.వి.ఆర్.విజయకుమార్

(రెండు పోర్షన్లు ఉన్న యిల్లు: వసారా ఒకటే. ఒక పోర్షన్లో రిటైర్డు హెడ్‌మాస్టరు గౌరీపతి ఉంటాడు. భార్యలేదు. ఒక్కగానొక్క కొడుకు శ్రీనివాస్ - డిగ్రీ పూర్తిచేసి, ఉద్యోగంలేక రాక స్వయం ఉపాధి పథకాలంటూ ఏవో పిచ్చి వ్యాపారాలు చేస్తుంటాడు .

ఇక రెండో పోర్షన్లో - రెవిన్యూ డిపార్టుమెంట్‌లో పనిచేసే యు.డి.సి. పాపారావు. ఆయన కూతురు కావేరి ఉంటారు.

| ఇందులో పాత్రలు : |
| --- |
| పాపారావు |
| గౌరీపతి |
| శ్రీనివాస్ |
| ఎ.సి.బి. ఇన్‌స్పెక్టర్ |
| భిక్షం |
| కావేరి |



(గౌరీపతి,పాపారావు మంచి స్నేహితులు. తెరలేచేసరికి పాపారావు టేబుల్ దగ్గర పుస్తకాలు,కాగితాలు సర్దుతుంటాడు)

**పాపారావు** : అమ్మాయ్! కావేరి టీ పట్రామ్మ....ఆ! ఆ షర్ట్ కూడా తీసుకురా! (తిరిగి సర్దుతున్నాడు)

**కావేరి** : (ప్రవేశిస్తూ) త్రీరోజెస్ టీ. రంగు, రుచి,వాసన... నాన్న టీ (అంటూ షర్ట్ కుర్చీకి తగిలించి వెళ్ళిపోతుంది)

**పాపారావు** : అక్కడ పెట్టు (అంటూ పుస్తకాలు సర్దుతుంటాడు) (గౌరీపతి సడన్‌గా ప్రవేశించి టీ కప్పు తీసుకుని పాపారావు వెనుక నుంచుంటాడు. పాపారావు చూడడు. వెనకనే తిరుగుతుంటాడు) అమ్మాయ్ టీ ఏదమ్మా?

**కావేరి** : (లోపలనుంచి) అక్కడ టీపాయ్ మీద పెట్టాను నాన్నా!

**పాపారావు** : ఎక్కడమ్మా కనిపించదే (అంటూ విసుక్కుంటూ లోపల కు వెళతాడు)

(గౌరీపతి ఖాళీకప్పు అక్క డపెట్టి, కుర్చీకి తగిలించిన 'షర్ట్' తీసుకుని వాళ్ళ పోర్షన్లోకి వెళతాడు.



**పాపారావు:** (బయటకి వస్తూ ) ఏది కావేరీ, చూపించు టీ ఎక్కడ పెట్టావ్?

**కావేరి** : అయ్యో అదేంటి నాన్నా, యిదిగో టీ కూడా తాగావ్.

**పాపారావు:** ఆ! నేనా?

**కావేరి:** నువ్వు కాక నేనా? నాన్నా నీకు ం ం ం ం మతిమరుపు ఎక్కువై పోతోంది. అమ్మో నా టి.వి. యాడ్స్ పోతాయి (అంటూ పోబోతుంది)

**పాపారావు:** యింకో టీ పట్రా.

కావేరి: పాలు లేవు (అంటూ వెళుతుంది)

**పాపారావు:** (అటు ఇటు చూసి) కావేరి నా షర్ట్ ఏదమ్మా? (సమాధానం రాదు) నీ టి.వి. పిచ్చితో ఛస్తున్నా.... టి.వి. బద్దలు కొడతా (అంటూ లోపలికి వెళతాడు)

(వెంటనే గౌరిపతి, పాపారావు షర్ట్ తెచ్చి కుర్చీకి తగిలించి వెళ్ళిపోతాడు.




**పాపారావు** : (ప్రవేశిస్తూ)ఏదమ్మా - చూపించు - నాకు మతిమరుపంటావ్ ఎక్కడ - షర్ట్ - చూపించు.

**కావేరి** : అయ్యో నాన్నా! యిదుగో నాన్న షర్టు (అంటూ యిస్తుంది) నాన్నా ఒక పనిచేయి. నీకు మతిమరుపు పూర్తిగా రాకముందే నాకూ వాసుకూ పెండ్లిచేయి.

**పాపారావు** : ఆ!ఆ! చేస్తా (కోపంగా అంటాడు) నువ్వు లోపలికి ఫో!(కావేరి లోపలికి వెళుతుంది) ఆశ్చర్యంగా వుందే! నేను చూసినప్పుడు లేదు. కావేరి రాగానే ఖాళీ కప్పు ప్రత్యక్షం. షర్ట్ విషయమూ అంతే! యిది ఎవరి పని అయ్యుంటుంది? (అంటూ గౌరిపతి పోర్షనువైపు చూస్తాడు) ఇది వాడి పనే! తప్పకుండా వాడే చేసి ఉంటాడు. ఇవాళ వీడి సంగతి తేలుస్తా. ఇవాళ అటో, ఇటో తేలిపోవాలి (అంటూ - బిగ్గరగా ) ఒరేయ్ గౌరీపతీ రారా బయటకు. నీ ముంగిట్లో కొచ్చా! నీ వసారాలోకొచ్చా! నీ గడప దగ్గరకొచ్చా! నీ కుర్చీలో కాలు పెట్టా! రారా బయటకు!

**గౌరీపతి** : (ప్రవేశిస్తూ) ఒరేయ్- ఒరేయ్ - ఏమిట్రా ఆ కేకలు పిండం మీద కాకిలాగ.

**పాపారావు** : నోరు ముయ్యరా పిచ్చికా! పీక పిసికితే కీసుమంటావ్! ఏరా నీకసలు బుద్ధుందా?

**గౌరీపతి** : (తాపీగా) ఏం! ఎందుకొచ్చిందా డవుటు?

**పాపారావు** : బుద్ధున్నవాడెవడు యిలాంటి పన్లు చెయడు.

**గౌరీపతి** : చెయ్యడని తెలునుగా మరెందుకురా అలాంటి పన్లు చేస్తావు..

**పాపారావు** : కొడితే మొహం పచ్చడవుతుంది. అరె! ఇంత వయసు వచ్చి ఏమిట్రా ఈ కోతి చేష్టలు.

**గౌరీపతి** : నేనేం చేశాను!?

**పాపారావు** : మళ్ళీ..మళ్ళీ అదే కూత ..టీ తాగటం... షర్టు తీయటం.

**గౌరీపతి** : ఆ! తీయక. ఇవాళ ఆదివారం రంచనుగా బయలుదేరినట్లు బయలుదేరుతున్నావు. నీ వెక్కడికి పోతున్నావో నాకు తెలుసురా.

**పాపారావు** : ఏమిట్రా నీకు తెలిసింది. మగవాళ్ళన్న తర్వాత సవాలక్ష పనులుంటాయి. నీకేం తెలుసురా!

**గౌరీపతి** : ఒరేయ్ - ఒరేయ్! నీవు పోయేది క్లబ్బుకేగా!

**పాపారావు** : ఆ! క్లబ్బుకే ! నీకేమిటీ నష్టం!

**గౌరీపతి** : నష్టం కాదురా! ఒరేయ్ పాపీ, నువ్వు క్లబ్బుకు వెళ్ళేది డబ్బు కోసమా!

**పాపారావు** : కాదు ఏదో కాలక్షేపం కోసం.

**గౌరీపతి** : ఆ! ఆ కాలక్షేపమేదో ఇంట్లో వుండి నాతో చెయ్యొచ్చుగా.

**పాపారావు** : నీతోనా ! ఎంత సేపు నీ ఎదురుగా కూర్చోను. బోరు కొట్టదూ!

**గౌరీపతి** : ఎందుకూ! పేపరు చదువుతాగా! దా! యిట్లా వచ్చి కూర్చో!

**పాపారావు** : అందుకనే యింట్లో ఉండనూ అంటున్నాను. ఏరా! నెల కొకసారి సరుకులతో పాటు కిలోల్లెక్కన పాతపేపర్లుకొని రోజుకో పేపరు చొప్పున చదివి నా ప్రాణం తీస్తావు. నువ్వేమో నన్నిట్లా చంపు. మీ వాడేమో మా అమ్మాయి వెంట పడి దాన్నట్లా చంపుతున్నాడు. ఎందుకురా మమ్మల్నిట్లా చంపుతారు? అరె.... అసలు మమ్మల్ని ఈ కొంపలో ఉండమంటారా, ఖాళీ చేయమంటారా!

**గౌరీపతి** : నిక్షేపంలా వుండమంటాను. రోజూ పేపరు చదువుతాను. నీకు రేడియో ఖర్చుండదు. టి.వి. ఖర్చుండదు.

ప్రపంచం మొత్తం నీ కళ్ళ ముందుంచుతాను. విషయాలు విశ్లేషించుకోవచ్చు.




**పాపారావు** : ఆ!! అక్కడికేదో నువ్వు పెద్ద లోక్‌సత్తా జయప్రకాష్‌వి, నేనేమో టి.వి.9 రవిప్రకాష్‌ని. విషయాలు విశ్లేషించుకోవడానికి (పేపరు ముక్కలు చేస్తాడు) ఆం! అన్నట్లు ఆ గాడిదేడి?

**గౌరీపతి** : ఏ గాడిదా !...గాడిదలు గుర్రాలు యిక్కడ ఉండవ్.

**పాపారావు** : నేనడిగేది ఆ గాడిదల గురించి కాదురా అడ్డ గాడిద. నీ పుత్రరత్నం... ఆ పిల్లగాడిద గురించి.

**గౌరీపతి** : అరేయ్ నువ్వు నన్నేమన్నా అను ఒప్పుకుంటాగాని.. నా కొడుకును మాత్రం అంటే నే నొప్పుకోను. వాడు వజ్రంరా..వజ్రం.

**పాపారావు** : ఆఁ! వజ్రమైతే వగలకొట్టుకొని చెరొక ముక్క మింగి చావండి... అంతేగాని మా ప్రాణాలు తియ్య కండి.... ఇంతకీ వాడేడి?

**గౌరీపతి** : వాడు కష్టజీవిరా.... కష్టజీవి ...ప్రొద్దుననగా వెళ్ళాడు ఏం అవస్థలు పడుతున్నాడో ఏమో బిడ్డ...బిడ్డ...

**పాపారావు** : ఆహాఁ! వారిపుడు ఏ అవతార మెత్తారో తెలుసుకోవచ్చా!

**గౌరీపతి** : అదేరా! 'దో' 'లాటం' ఏజెన్సీ అని తిరుగుతున్నాడు. వాళ్ళేదో కంపెనీ ప్రొడక్ట్ కిట్ పంపిస్తే ఇంటింటికి తిరిగి ప్రచారం చేస్తున్నాడు. పిచ్చి సన్నాసి ఎన్ని తిప్పలో. అడుగో మాటల్లోనే వస్తున్నాడు.

**పాపారావు** : పాపీ చిరాయుః చూడరా వాడి వేషం చూడు. మెళ్ళో నంచి, వాడూ.. బస్టాండులో గుబిలి తీసే వాడి మొహం వాడూనూ!

(వాసు ప్రవేశం)

**వాసు** : మామయ్య! బంతిని నేలకేసి ఎంత కొట్టినా అది పైకి లేన్నూనే వుంటుంది.

**పాపారావు** : అబ్బా! ఏం కనిపెట్టావురా!

**గౌరీపతి** : ఆ..నాయనా! వాసూ... ఆదివారం కూడా రెస్ట్ తీసుకోకుండా ఎందుకు నాన్నా అలా కష్టపడతావ్? లోపలికి వెళ్ళి భోజనం చేసి రెస్ట్ తీసుకో నాన్నా...వెళ్ళు.... (అంటూ పాపారావు వైపు తిరిగి చూస్తూ) నీ ప్రయోజకత్వాన్ని ఈ అంధులు ఎప్పటికి గుర్తిస్తారో ఏమిటో?

**పాపారావు** : ఏంటంటా మీ వాడి ప్రయోజకత్వం...చూస్తున్నాంగా సవరాలు కట్టేవాడిలా ఆ బ్యాగ్ ఒకటి తగిలించుకొని ఎక్కే గడప, దిగే గడప ఎప్పటికి బుద్ధొస్తుందో మీ ఇద్దరికీ!

(వాసు అహం దెబ్బతిన్నవాడిలా పాపారావు వైపు చూసాడు)

**వాసు** : మామయ్యా!?.. నేనంటే ఏమను కున్నావ్...నేనంటే నేనే.

**పాపారావు** : ఆఁ! నేనంటే నేనే,అవేకళ్ళు, మోనగాడు, గూఢచారి 116, అప్పుడెవ్వడో చూశాం రా! (వెటకారంగా)

**వాసు** : అయితే ఏమంటావ్?

**పాపారావు** : ఏముంది.... నువ్విప్పుడు బిజినెస్‌లో ఎంత కాలం వుంటావ్... మళ్ళీ దేంట్లోకి దూకుతావో (విసుగ్గా అన్నాడు)

**గౌరీపతి** : చెప్పరా వాసూ... చెప్పు..చెప్పి., వాడి పిల్లని నీ కాళ్ళు కడిగి ఎప్పుడిస్తాడో కనుక్కో (అంతకన్నా విసుగ్గా చెప్పాడు)

**పాపారావు** : ఒరేయ్ వీడిలాగే ఉంటే కాళ్ళు కాదురా ! మూతి కూడా కడగను.

**గౌరీపతి** : ఒరేయ్! 'కో' అంటే కోటి మంది మా యింటి ముందు ఉంటార్రా.

**పాపారావు** : 'కో' కాదురా! 'కొక్కొరొకో' అని ఒక్కసారి చావండి మీ పీడా వదులుతుంది.

**వాసు** : నన్ను మాట్లాడనిస్తారా?

**పాపారావు** : చెప్పు....

**వాసు** : 'లాటం' అని ఇంటర్నేషనల్ కంపెనీ.

**పాపారావు** : 'లా ట ం' అం టే ? (సాగదీస్తూ అడిగాడు)

**వాసు** : అంటే 'లాభం టక్కున మాకు' (చెప్పి నాలుక కరుచుకుంటాడు)

**గౌరీపతి** : ఎవడి పెట్టుబడితోరా? (అర్థం కానట్లు అడిగాడు)

**వాసు** : ఎదుటివాడి రూపాయి తోనే మన వ్యాపారం స్టార్ట్ అవుతుంది. అసలు మా కంపెనీ చాలా ఏళ్ళుగా వరిశోధించి...వరిశీలించి...ప్రపంచంలోని అందరి మానవుల అవసరాలు తీర్చే పరికరాలు కనిపెట్టింది. ఈ పరికరాలతో ఐ మీన్ ఇన్‌స్ట్రుమెంట్స్‌తో ప్రతివారు తమ జీవన గమ్యంలో ఎదురయ్యే సమస్యల్ని ఇట్లే ఎదుర్కొనవచ్చు. ఈ బాటిల్‌లో ఉన్న మందు గురించి చెప్పాలంటే ఎంత చెప్పినా తక్కువే కాని చెప్పక తప్పదు. కనుక చెపుతున్నా శ్రద్ధగా విను మామయ్య (అంటూ ఫోజు పెట్టాడు)

**పాపారావు** : విషయం చెప్పి చావక ఈ నసుగుడు ఏమిటి? (విసుగ్గా అన్నాను)

**వాసు** : అందరూ జాగ్రత్తగా వినండి... ప్రతిరోజు రాత్రి మనం ఎక్కువగా ఫేస్ చేసే ప్రాబ్లం ఏమిటి?

**పాపారావు** : యూరినల్ ప్రాబ్లం..(టక్కున చెప్పాడు)

**గౌరీపతి** : షుగర్ వ్యాధేమో చూపించుకు చావు..రాత్రిళ్ళు ఫేస్ చేసే ప్రాబ్లం దోమలురా.(అంటూ జబ్బలు చరుచుకుంటూ చెప్పాడు)

**వాసు** : కదా!....అందువల్ల మా కంపెనీ పరిశోధకులు అహోరాత్రులు శ్రమించి దోమలు కుడుతున్నా లెక్క చెయ్యక ఈ మందును కనిపెట్టారు...... దోమను పట్టి... తొక్కిపెట్టి.... ఒక్క చుక్క ఈ మందు దోమ నోట్లో వేసామనుకో... అంతే ఫటక్ ....నిమిషాల్లో నురగలు కక్కుకొని ఛస్తుంది.

**పాపారావు** : చావక పోతే? (అనుమానంగా అడిగాడు)

**గౌరీపతి** : బాటా చెప్పుకింద వేసి తొక్కు

-(**తరువాయి వచ్చే సంచికలో**)



**భారతరత్న**
**డా.బి.ఆర్.అంబేద్కర్**
(14.4.1891 - 6.12.1956)

"స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాలపై ఆధారపడిన సమాజం నాకు ఆదర్శం. ఆదర్శ సమాజం చురుకుదనాన్ని కలిగి, ఒక భాగంలో జరిగే మార్పులను ఇతర భాగాలకు చేర్చే మార్గాలతో నిండి ఉండాలి"

**- డా.బి.ఆర్.అంబేద్కర్**

davp 2004/11

భారత రాజ్యాంగ నిర్మాత, సాంఘిక సమానత్వం కోసం పోరాడిన బాబాసాహెబ్ డా.భీంరావ్ అంబేద్కర్ 113వ జయంతి సందర్భంగా దేశం కృతజ్ఞతతో శ్రద్ధాంజలి ఘటిస్తోంది.

సమాచార, ప్రసార మంత్రిత్వ శాఖ, భారత ప్రభుత్వం



# 'కర్ చలే హమ్ ఫిదా'



చిత్రం
**హకీకత్**

రచన
**కైఫీ ఆజ్మీ**

సంగీతం
**మదన్‌మోహన్**

గానం
**మహమ్మద్ రఫీ**

అభినయం
**ధర్మేంద్ర**
**బల్‌రాజ్‌సాహ్ని**
**జయంత్**
**తదితరులు**

కర్ చలే హమ్ ఫిదా జాన్-ఒ-తన్ సాథియోం
అబ్ తుమ్హారే హవాలే వతన్ సాథియోం ॥కర్ చలే॥
సాంస్ థమ్‌తీ గయీ, నబ్జ్ జమ్‌తీ గయీ
ఫిర్ భీ బఢ్‌తే కదమ్ కో న రుక్‌నే దియా
కట్ గయే సర్ హమారే తో కుఛ్ గమ్ నహీం
సర్ హిమాలయ్ కా హమ్‌నే న ఝుక్‌నే దియా
మర్‌తే మర్‌తే రహా బాంక్‌పన్ సాథియోం ॥అబ్ తుమ్హారే॥
జిందా రెహనే కే మౌసమ్ బహుత్ హైం మగర్
జాన్ దేనే కీ ఋత్ రోజ్ ఆతీ నహీం
హుస్న్ ఔర్ ఇష్క్ దోనోం కో రుస్వా కరే
వో జవానీ జో ఖూన్ మేం నహాతీ నహీం
బాంధ్‌లో అప్‌నే సర్ పర్ కఫన్ సాథియోం ॥అబ్ తుమ్హారే॥
రాహ్ కుర్బానియోం కీ న వీరాన్ హో
తుమ్ సజాతే హీ రెహనా నయే కాఫిలే
ఫతెహ్ కా జష్న్ ఇస్ జష్న్ కే బాద్ హై
జిందగీ మౌత్ సే మిల్ రహీ హై గలే
ఆజ్ ధర్‌తీ బనీ హై దుల్హన్ సాథియోం ॥అబ్ తుమ్హారే॥
ఖీంచ్‌దో అప్‌నే ఖూన్ సే జమీంపర్ లకీర్
ఇస్ తరఫ్ ఆనే పాయే న రావణ్ కోయీ
తోడ్‌దో హాథ్ అగర్ హాథ్ ఉఠ్‌నే లగే
ఛూనే పాయే న సీతా కా దామన్ కోయీ
రామ్ భీ తుమ్ తుమ్హీ లక్ష్మణ్ సాథియోం ॥అబ్ తుమ్హారే॥

నేను బానిస భారతంలో పుట్టాను. స్వతంత్ర భారతంలో జీవిస్తున్నాను. సోషలిస్టు భారతంలో మరణిస్తాను' అన్న ఆదర్శవాది కైఫీ ఆజ్మీ. ప్రభుత్వం దేశాన్ని అభివృద్ధి చేయటంలో విఫలమైందని భావించిన ఆయన ప్రభుత్వం తనకిచ్చిన పద్మశ్రీ అవార్డును తిరస్కరించారు. ఆయన కవిత్వం ఎప్పుడూ ప్రగతిశీలక దృక్పథంతోనే ఉండేది. అందమైన కవిత్వం కన్నా అర్థవంతమైన కవిత్వం వ్రాయటానికి ప్రాధాన్యత ఇచ్చారు.

జీవనభృతి కోసం సినీగీతాలు వ్రాసినా ఆయన కవిత్వం తన ఆదర్శాలకు కట్టుబడే వ్రాసేవారు. ఆయన వ్రాసిన సినీ గీతాలలో కూడా అద్భుతమైన కవిత్వం ఉంది. స్వాతంత్ర్య







పోరాట సమయంలో ఆయన రాజకీయ కార్యకలాపాల వల్ల ఆయన అజ్ఞాతంలో ఉండవలసి వచ్చింది. రోజు గడవటం కష్టంగా ఉండేది. ఆ సమయంలో షహీద్ లతీఫ్ తన 'బుజ్‌దిల్' చిత్రంలో పాటలు రాయమని కోరారు. ఆ విధంగా కైఫీ ఆజ్మీ తన తొలి సినీ గీతం 'రోతే రోతే గుజర్ గయీ రాత్‌రే' రాశారు.

ఆయన 'లాలారుఖ్' చిత్రానికి తన తొలి స్క్రిప్ట్ రాశారు. 200 చిత్రాలకు పైగా ఆయన రచన చేశారు. 'హీర్ -రాంఝా' చిత్రానికి ఆయన పద్య రూపంలో మాటలు రాశారు. హిందీ చిత్రాలలో అలాంటి చిత్రం అదొక్కటే. ఎమ్.ఎస్.సత్యూ తీసిన 'గరమ్ హవా' చిత్రానికి స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు ఆయనే రాశారు. దర్శకుడు సావన్‌కుమార్ ఆయనను మీనాకుమారి సరసన నటించమని అడిగినా ఆయన తిరస్కరించారు. కవిగానే కొనసాగాలని ఆయన అభిమతం. 75ఏళ్ళ వయసులో ఆయన సయీద్ మీర్జా చిత్రం 'నసీమ్'లో తాతయ్య పాత్ర పోషించారు. ఆ చిత్రం విమర్శకుల ప్రశంసలందుకుంది.

ఆయన ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్‌లో సభ్యులుగా ఉండేవారు. ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ (ఇప్టా)కు అధ్యక్షులుగా పనిచేశారు. ఆయనకు ఎన్నో అవార్డులు వచ్చాయి.విశ్వభారతి యూనివర్సిటీ నుంచి డాక్టరేట్, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం నుంచి యువభారతి, లోటస్ అవార్డ్, మహారాష్ట్ర గౌరవ్ పురస్కార్, కాయ్‌నాత్ అవార్డ్, సంత్ జ్ఞానేశ్వర్ అవార్డ్ ఆయనకు లభించాయి. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం సుల్తాన్‌పుర్ నుంచి ఫూల్‌పుర్ వెళ్ళేరహదారికి కైఫీ ఆజ్మీ హైవే అని పేరుపెట్టింది.

భారత్ -చైనా యుద్ధం పై చేతన్ ఆనంద్ తీసిన 'హకీకత్' చిత్రంలో కైఫీ ఆజ్మీ వ్రాసిన 'కర్‌చలే హమ్ ఫిదా' పాట హిందీ దేశభక్తి గీతాలలో నేటికీ గుర్తు చేసుకునే పాట. యుద్ధం చేసే సైనికులు తమ సహచర సైనికులకు వారి బాధ్యత, వారి కర్తవ్యం గుర్తుచేసే పాట. దేశం కోసమే తమ సర్వస్వం ధారపోసే ఆ సైనికుల త్యాగానికి సార్ధకత కలిగేలా మనం దేశాన్ని పరిరక్షించుకుంటున్నామా లేదా అని ఆలోచింపజేసే పాట ఇది. 2002 లో వచ్చిన 'మా(తుఝే సలామ్' చిత్రంలో ఈ పాటను ఉపయోగించుకున్నారు. ఆ చిత్రానికి ఈ పాట హైలైట్‌గా నిలిచింది. ఈ పాటలోని రెండోలైన్ 'అబ్‌తుమ్హారే హవాలే వతన్ సాథియో(' ఇపుడు ఒక చిత్రానికి పేరు అయింది. ఈ చిత్రంలో అమితాబ్‌బచ్చన్ నటిస్తున్నారు.

మదన్ మోహన్ సహజశైలికి భిన్నంగా ఉండే ఈ పాట ఆయన కెరియర్‌లో ఒక ప్రత్యేకస్థానాన్ని పొందింది. మహమ్మద్ రఫీ రేంజికి ఈ పాట మరో ఉదాహరణ.

'ఫిదాకర్ చలే' అంటే అర్పించి వెళుతున్నాం అని. జాన్ -ఒ-తన్ అంటే ప్రాణమూ తనువూ. సాథీ అంటే సహచరులు. హవాలే అంటే అధీనం. వతన్ అంటే దేశం.

**'తనువూ ప్రాణం అర్పిస్తున్నాం సహచరులారా**
**దేశమిక మీ అధీనం సహచరులారా'**

ఆ సైనికులు ఎంతో మామూలుగా 'ప్రాణాలు అర్పించి వెళుతున్నాం. ఇక దేశం బాధ్యత మీదే' అని అనటంలో ఆ భావంలోని శక్తి అంతా విశదమవుతుంది. వారు తమ జీవితాలను త్యాగం చేసి దేశరక్షణ చేసి తమ సహచర సైనికులకు దేశరక్షణ బాధ్యతను అప్పగిస్తున్నారు. చనిపోతూ కూడా వారు దేశం గురించే ఆలోచిస్తున్నారు. నిస్వార్థంగా వారు చేస్తున్న ఈ త్యాగం మహోన్నతమైనది. అంతటి



మహోన్నతమైన విషయాన్ని అలవోకగా చెప్పిన కైఫీ ఆజ్మీ తన కవిత్వం ద్వారా చిరకాలం జీవించి ఉంటారు.

సాన్ అంటే శ్వాస. థమ్‌నా అంటే ఆగటం. నబ్జ్ అంటే నాడి, జమ్‌నా అన్నా ఆగటం అనుకోవచ్చు. 'బఢ్‌తే కదమ్' అంటే సాగే అడుగులు. 'కట్ జానా' అంటే తెగిపోవటం. గమ్ అంటే బాధ. సర్ అంటే శిరసు, తల. ఝుక్‌నా అంటే వంచటం. బాంక్ పన్ అంటే చురుకుదనం, తెలివి. 'ఠారే రహియో ఓ బాంకే యార్ రే'(పాకీజా)పాటలో 'బాంకే యార్' అంటే 'గడుసు ప్రియుడా' అని అర్థం.

**'శ్వాస ఆగుతున్నా, నాడి ఆగుతున్నా**
**సాగే అడుగులను ఆగనివ్వలేదు**
**మా తలలు తెగినా బాధలేదు**
**హిమాలయం శిరసును దించనివ్వలేదు**
**చనిపోతున్నా చురుకుదనముంది సహచరులారా'**

మంచులో శ్వాస, నాడి ఆగిపోతున్నా వారు ముందుకు సాగారు. శత్రువులను ఎదుర్కొన్నారు. చివరి శ్వాస దాకా పోరాడారు. హిమాలయం మన దేశ గౌరవానికి ప్రతీక. మన దేశానికి కిరీటం వంటిది. శత్రువు హిమాలయం దాటి మన సీమలో అడుగు పెట్టడంటే దేశ గౌరవానికి భంగం కలిగినట్లే. హిమాలయం తలదించుకున్నట్టే. మన సైనికులు తమ ప్రాణాలు పణంగా పెట్టారే గానీ శత్రువును మన సీమలో అడుగు పెట్టనివ్వలేదు. చనిపోయే సమయం వచ్చినా చురుగ్గా కదిలి బుద్ధిబలంతో శత్రువును దెబ్బతీశారు.

'జిందారెహనా' అంటే జీవించి ఉండటం. మౌసమ్ అంటే ఋతువు. ఋత్ అంటే ఋతువు, కాలం. హుస్న్ అంటే అందం. 'రుస్‌వా కర్‌నా' అంటే అవమానించటం. జవానీ అంటే యౌవనం. ఖూన్ అంటే రక్తం. 'సర్ పర్ కఫన్ బాంధ్‌నా ' అంటే దుస్సాహసం చేయటం, మృత్యువుతో ఆటలాడటం. (కఫన్ అంటే చనిపోయిన వారిపై కప్పే దుస్తులు)

**'జీవించే ఋతువులెన్నో ఉన్నా**
**మరణించే కాలం రోజూ రాదు**
**రక్తంలో తడవని పడుచుదనం**
**అందానికి, ప్రేమకు అవమానమే-**
**మృత్యువుతో ఆటాడుదాం సహచరులారా'**

జీవించటం అందరూ చేసేపని. ఒక లక్ష్యం కోసం మరణించే అవకాశం కొందరికే లభిస్తుంది. సైనికుల స్వభావం ఎలాంటిదంటే తమ యౌవనం దేశరక్షణ కోసమే అనుకుంటారు. తమ దారుఢ్యం అంతా దేశం కోసం ధారపోస్తారు. అలా చేయకపోతే తమ పడుచుదనానికి, తమను ప్రేమించిన వారికి అవమానంగా భావిస్తారు. మృత్యువుతో పోరాడటమే తమ కర్తవ్యమని అనుకుంటారు.

కుర్బానీ అంటే త్యాగం. వీరాన్ అంటే నిర్మానుష్యం. కాఫిలే అంటే తండాలు. ఫతెహ్ అంటే విజయం. జష్న్ అంటే ఉత్సవం. ధర్‌తీ అంటే భూమి. దుల్హన్ అంటే వధువు.

**'త్యాగాల బాట నిర్మానుష్యం కారాదు**
**తండోపతండాలుగా వస్తూనే ఉండాలి మీరు**
**విజయోత్సవానికి ముందు సాగాలీ ఉత్సవం**
**జీవితం మృత్యువుతో చేసే ఆలింగనం**
**ధరణి నేడు వధువుగా మారింది సహచరులారా'**

దేశరక్షణ కోసం త్యాగాల బాటలో ఎల్లప్పుడు సైనికులు నడుస్తూనే ఉండాలి. ఆ బాటలో ఎవరూ లేకుంటే దేశం పరాధీనమైపోతుంది. అందుకే తండోపతండాలుగా సైనికులు వస్తూనే ఉండాలని వారు కోరుకుంటున్నారు. ఇంతకంటే త్యాగం ఏముంటుంది? ఇలా గుంపులు గుంపులుగా చేరితే అదే వారికి ఉత్సవం. జీవితం మృత్యువును ఆనందంగా కౌగిలించుకున్నట్టే. ఆ ఉత్సవంలో భూమి పెళ్ళి కూతురులా ముస్తాబయింది.

జమీన్ అంటే భూమి. లకీర్ అంటే రేఖ. హాథ్ అంటే చేయి. ఛూనా అంటే తాకటం. దామన్ అంటే పైట.

**'మీ రక్తంతో భూమిపై ఓ లక్ష్మణ రేఖ గీయండి**
**రావణుడెవరూ ఇటూ వైపు రాకుండా**
**ఎవరైనా చేయి ఎత్తితే విరిచేయండి**
**సీతమ్మ పైటనెవరూ తాకకుండా**
**మీరే రాముడు, మీరే లక్ష్మణుడు సహచరులారా'**

సైనికులు తమ రక్తంతోనే లక్ష్మణరేఖ గీస్తారు. అంటే తమ ప్రాణాలు అర్పించి శత్రువులను అడ్డుకుంటారు. ఇక్కడ శత్రువును రావణుడితో పోల్చారు. అపుడు దేశమాత సీతమ్మే కదా. సీతమ్మపై చేయి వేయాలని ప్రయత్నించేవారిని ఎదుర్కొనే రామలక్ష్మణులే సైనికులు. చక్కని ఉపమానాలతో భారతదేశం ఆత్మను ఆవిష్కరించారు కైఫీ ఆజ్మీ.

నిరుపమానమైన దేశభక్తితో సరిహద్దులలో తమ జీవితాలను దేశరక్షణ కోసం అర్పించే సైనికులుండటం వలనే దేశ ప్రజలమైన మనం నిశ్చింతగా ఉండగలుగుతున్నాం. వారి త్యాగాలకు సార్థకత చేకూరాలంటే మనం దేశాన్ని కాపాడుకోవటంలో మన వంతు కృషి చేయాలి. మంచి ప్రజాప్రతినిధులను ఎన్నుకోవటం ద్వారా దేశానికి వెన్నుముక వంటి ప్రజాస్వామ్యాన్ని కాపాడుకోవాలి. ఎన్నికలలో మనం మంచి ప్రతినిధులనే ఎన్నుకున్నామని సగర్వంగా చెప్పుకోగలగాలి. అప్పుడే దేశపౌరులుగా మన బాధ్యత నెరవేర్చినట్టువుతుంది. సైనికుల త్యాగనిరతిని గౌరవించినట్టవుతుంది.

**-పి.వి.సత్యనారాయణ రాజు**



జంతువులు మనసురించి మాట్లాడేది తెలిసిపోతే ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

పిల్లల కోసం ప్రత్యేకం...



బాల్యపు లేతదనం మళ్లీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బీయస్ ప్రసాద్

చిత్ర పరిచయం 4

సమన్వయం
మంజీర

### జరిగిన కథ

జాన్ డూలిటిల్ చిన్నప్పుడు జంతువులభాష అర్థం చేసుకునేవాడు. క్రమేపీ ఆ శక్తి పోయింది. పెరిగి డాక్టరయ్యాడు. భార్య, కూతుళ్లు ఫామ్‌హౌస్‌కు వెళ్లిన ఓ రోజు హఠాత్తుగా ఆ శక్తి తిరిగివచ్చింది. దానితో ఖంగారుపడ్డాడు. ఎవరికీ చెప్పలేదు. ఫామ్‌హౌస్‌కి చేరి రాత్రి నిద్రకు ఉపక్రమిస్తూంటే ఓ గుడ్లగూబ వచ్చి రెక్కలో గుచ్చుకున్న పుల్లముక్క తీసిపారేయమని కోరింది. తీసేశాడు. భార్యతో సరదాగా గడపవలసినవేళ జంతువుల మాటలన్నీ వినడడంతో ఖంగారుపడి సిటీకి వచ్చేసి బ్రెయిన్ స్కాన్ చేయించుకున్నాడు. డాక్టరు ప్రాబ్లెమ్ ఏదీ లేదు పొమ్మన్నాడు. బయటకు వస్తూంటే తను యాక్సిడెంటు చేసిన ఊరకుక్కను అధికారులు తీసుకుపోతూంటే చూసి రక్షిస్తాడు. అది విడవకుండా వెంటబడుతుంది. - ఇక చదవండి

రోడ్డుమీద కారు పోతోంది. జాన్ సీరియస్‌గా డ్రైవ్ చేస్తున్నాడు. అతని పక్క సీటులో కూచున్న కుక్క పశువుల ఆస్పత్రిలో థర్మామీటరు డాక్టరును తలచుకుని జాలిపడింది - "చదువుకున్నవాళ్లు ఇలాటి వృత్తిలోకి ఎందుకు దిగుతారో పాపం!" అని.

జాన్ కారు ఆపాడు - "ఇంటికెళ్లి తీరిగ్గా జాలిపడుదువుగాని. ఇక దయచేయి. కారుదిగి నీ పనిచూసుకో." అన్నాడు.

కుక్కకు చచ్చేటంత ఆశ్చర్యం వేసింది. **"భలేగా వుందే నీ వ్యవహారం! నన్ను పెంచుకుంటానని బయటకు తీసుకొచ్చావ్! ఇప్పుడేమో..."**

జాన్ అడ్డు తగిలేడు, "వెధవకబుర్లు కట్టిపెట్టు. నాకు పెంపుడుకుక్కా వద్దు, పెంపుడునక్కా వద్దు. ఒకవేళ దారితప్పి, మనసు భ్రమించి పెంచుకున్నా నీలాటి వాగుడుకాయ కుక్కను మాత్రం ఛస్తే పెంచుకోను." అన్నాడు.

అతని మూడ్ చూస్తే ఏ మాత్రం కరిగేట్లా లేడు. వాదించినా ఇక లాభంలేదని గ్రహించిన కుక్క అతను కారుడోరు తీయగానే కిందకు దిగింది. వెళుతూ, వెళుతూ గ్రాండ్‌గా నిష్క్రమిద్దామనుకుంది. 'రానిక నీకోసం' స్టయిల్లో డైలాగులు మొదలెట్టింది. **నే వెళతా. ఈ వీధిమలుపు తిరగ్గానే కనుమరుగయి పోతాను. ఇక నన్ను తలచుకోకు. నాకోసం బాధపడకు. ఏదో ఆ కుక్కల గోడౌనులోంచి బయటకు తీసుకొచ్చావ్, ఒంట్లో బాగాలేదంటే డాక్టరుకు చూపించావ్, నా అభిమానాన్ని చూరగొన్నావ్. అంతమాత్రాన ఎల్లకాలం.."**



జాన్‌కు మహా చికాగ్గా ఉంది. "ఇక డైలాగులు కట్టిపెట్టి నీ దారి నువ్వు చూసుకో, టాటా" అని కారు స్టార్టు చేయబోయాడు.

ఇంతలో అతని సెల్ మోగింది. అతని చిన్నకూతురు మాయా. ఆ అమ్మాయి ఫామ్‌హౌస్‌నుండి సమ్మర్‌కాంప్‌కి వెళడానికి తయారవుతోంది. తన సామాన్లన్నీ తల్లి కార్లో సర్దుతూండగా తండ్రికి ఫోను కొట్టింది. "నాన్నా, నేను క్యాంప్‌కి వెళ్లేలోపున వస్తావా?'' అని అడగడానికి.



జాన్ సమాధానం చెబుతూండగానే కుక్క మొరుగు వినబడింది. ఇటుచూస్తే హొరైజన్‌లోకి ఫేడౌట్ అయిపోయినట్టు నటించిన కుక్క! ఇది తిరిగి ఎలా వచ్చిందాని ఆశ్చర్యపడుతూండగానే కుక్క తెగ మొరిగేసింది. జాన్ భయపడ్డంతా అయింది. మాయా అది వినడం, అత్యుత్సాహంతో "నాన్నా, అది కుక్కే కదూ" అనడం జరిగింది.

"అబ్బే" అని జాన్ అనబోతున్నాడని పసిగట్టిన కుక్క మొరుగుడు మరింత పెంచింది. ఇక మాయా ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా

పోయాయి. తల్లి కేసి తిరిగి "అమ్మా, నాన్న నా కోసం ఓ పెంపుడు కుక్కను తీసుకున్నాడు తెలుసా!" అంది ఎక్సయిట్‌మెంట్ దాచుకోలేక.



జాన్ భార్య లీజా వెంటనే కూతురునుండి సెల్‌ఫోన్ లాక్కుని "అమ్మదొంగా, మాయా కుక్కపిల్లకోసమా రాత్రి అంత హడావుడిగా పారిపోయారు!?" అంది చిరునవ్వు నవ్వుతూ.

పరిస్థితి చేదాటిపోయిందని గ్రహించాడు జాన్. తను పారిపోయి రావడానికి ఓ సాకు దొరికినందుకు సంతోషిస్తూనే ఆముదం తాగిన మొహం పెట్టి "పట్టేశావే! కుక్కను పెంచుకుందామని..." అన్నాడు నవ్వు నటిస్తూ. ఫోన్‌లో కనబడదు కదాన్న ధైర్యంతో 'నువ్వూ... నీ దగ్గూ..కిల్లాడి వేషాలూ...'అని కుక్కవైపు నిరసనగా చూశాడు. కోటలో పాగా వేసిన సంతోషాన్ని దాచుకుంటూ కుక్క సంజాయిషీ చెప్పింది. **"నాకు కాస్త అలర్జీ. అందుకే దగ్గు"** అని. ఓ తుమ్ము కూడా తుమ్మి చూపించింది.

జాన్ ఏమనగలడు? "నీ క్యాంప్‌కొస్తానులే" అని మాయాకు చెప్పి ఫోన్ పెట్టేశాడు.

* * *



క్యాంపు దగ్గర పడుతూండగా జాన్‌కు అనుమానం వచ్చింది. "అవునూ, నీ పేరేమిటి? వాళ్లంతా అడుగుతారు.." అని అడిగాడు.

**"పేరా? ఇప్పటిదాకా పేరు లేకుండా అనామకంగానే బతికేస్తున్నాను."** అంది కుక్క వినయంగా.

"సరే, ఇప్పటికైనా ఏదో ఆలోచించు."

**"నన్ను చూసి చాలామంది మొహం అదోలాపెట్టి 'యాక్' అనేవారు. పోనీ 'యాక్' అని పెట్టుకుంటే..?"**

కుక్క నిజం చెబుతోందో, వెటకరిస్తోందో తెలియక జాన్ ఊరుకున్నాడు. కారు దిగాక మాత్రం ఊరుకోలేకపోయాడు. ఏదో ఒకటి ఇప్పుడే నామకరణం జరిగిపోవాలనిపించింది. "పోనీ లూసీ అని పేరుపెట్టనా?" అని అడిగిచూశాడు.

**"లూసీ...లూ...సీ....బాగానే ఉంది కానీ అది అమ్మాయి పేరు. నేను మగాడ్ని"**

"ఓహ్,..మర్చేపోయా..పోనీ లక్కీ...ఎలా వుంది?"

**"బానేవుంది. నేను నీకు లక్కీ, నువ్వు నాకు లక్కీ. ఇలా కానిచ్చేయ్"** అని కుక్క కరుణించింది.

సమ్మర్‌కాంప్ గ్రౌండ్‌లో మాయా ఓ టేబుల్ వద్ద నిలబడివుంది. పక్కన ఇటీవలే పేరు మార్చుకున్న వాళ్లక్క జయింట్ సైజు గాగుల్స్ తొడిగేసి చెవులు బద్దలయ్యే సౌండుతో పాప్‌మ్యూజిక్ వినేస్తోంది. తండ్రి ని చూడగానే మాయా "డాడీ" అంటూ పరిగెట్టుకువచ్చింది.

'డాడీ' అంది కానీ తను పరిగెట్టింది కుక్క దగ్గరికే! "భలేగా వుంది. వెరీ క్యూట్" అని కితాబు ఇచ్చింది కూడా. కూతురు హడావుడి చూసి చిరునవ్వు నవ్వుతూ లిజాకూడా వచ్చి వారిని చేరింది.

"దీని పేరేమిటి నాన్నా?" మాయా అడిగింది.

"లక్కీ"

"ట్రిక్స్ ఏమైనా తెలుసా?"

"టక్కరివేషాలు చాలా తెలుసు..."అని అంటూండగానే భార్య కాస్త ఎత్తిపొడుపుగా "కూతురి కోసం కుక్కను తెచ్చారన్నమాట" అంది.

"..మనకోసం.." అని సవరించాడు జాన్.

భర్తను పరిశీలనగా చూసి "ఆర్ యూ ఓకే, డియర్?" అడిగింది లిజా. ఈ కుక్కకోసమేనా ఇంత హంగామా అన్న ఆశ్చర్యం, అనుమానం ఆమెది.

సమ్మర్ కాంప్‌లో మాయాకు ఓ గది కేటాయించడం జరిగింది. ఇష్టం లేకుండా కాంప్‌కు వచ్చింది కాబట్టి కూతుర్ని కాస్త హుషారు చేస్తే మంచిదనుకున్నాడు జాన్. కనబడిన ప్రతీ ఆకునూ, పువ్వునూ, పురుగునూ మెచ్చుకోవడం మొదలు పెట్టాడు. అనలిలాటి చోటుకు రావడం ఎంతో అదృష్టమని కూతురు భావించేట్లు చేయాలన్న తాపత్రయం అతనిది.



"అదిగదిగో, ఆ కుందేలు పిల్ల చూడు, ఎంత ముద్దొస్తోందో"

"అబ్బ, ఇక్కడ గాలి ఎంత ఫ్రెష్‌గా ఉందో!"

"ఈ రూము భలేగా ఉందే!"

అదే వరసలో జాన్ అక్కడ తలుపులను, కిటికీలను కూడా మెచ్చుకునేవాడే కానీ తలకాయ తిప్పి చూసి అక్కడ మాయా కనబడకపోవడంతో ఆగిపోయాడు. ఆ పిల్ల బయట బెంచీమీద మొహం వేలాడేసుకుని కూచుంది.

తన అభినయం ఎందుకూ కొరగాకుండా పోయిందని గ్రహించిన జాన్ కూతురి వద్దకు వచ్చి తలమీద చెయ్యివేసి నిమిరాడు.

"నాన్నా, ఈ కాంప్ వద్దు నాన్నా. నీతో ఇంటికి వచ్చేసి ఈ లక్కీతో ఆడుకుంటా నాన్నా" అంది మాయా ఏడుపుమొహం పెట్టి.

మళ్లీ హితబోధ చేయవలసిన సమయం ఆసన్నమయిందని గ్రహించాడు జాన్. "చూడు మాయా, మనిద్దరం ఒక ఒప్పందానికి వద్దాం. నువ్విక్కడ కాంప్‌లో కొంతకాలం ఉండి రా. అప్పుడు లక్కీని నీకిచ్చేస్తాను. అక్కకు అస్సలు వాటా లేదు. లక్కీతో ఆడతానంటే కుదరదని చెప్పేద్దాం."



"కనీసం వారమైనా ఉండాలంటున్నారు. కాంప్‌కి వెళ్లకపోతే ఏం?" అంది మాయా దీనంగా.

"అలా కుదరదు." అని గట్టిగా అన్నాడే కానీ కూతురు బిక్కమొహం పెట్టి 'సరే, నీ యిష్టం' అనగానే కరిగిపోయాడు. అనునయంగా "కాదు పాపా, నీకిప్పుడు తెలియదు కానీ, పెద్దయ్యాక అనిపిస్తుంది కాంప్‌కు పంపించి మా నాన్న నాకెంతో ఉపకారం చేసాడ్రా అనుకుంటావు చూడు. నీకు బోల్డుమంది ఫ్రెండ్స్ ఏర్పడతారు చూడు." అని చెప్పిచూశాడు.

మాయా ఏమీ మాట్లాడలేదు. తల్లిదండ్రులకేసి ఓ సారి చూసి తలదించుకుంది.

* * *

జాన్‌కు తెలియదు కానీ అతని గురించి పబ్లిసిటీ బాగానే జరిగిపోతోంది. అతని ప్రచార కమిటీ ఛైర్మన్ గుడ్లగూబే! జాన్ వాళ్ల ఊరు న్యూయార్క్‌కు కూడా వచ్చి పార్కుల్లో మీటింగులు పెట్టి కాస్త నిజం, కాస్త డ్రామా కలిపి కథలు, కథలుగా చెపుతోంది. "...**నేను చెప్పినది అర్థమవ్వడమే కాదు, అతను స్వయానా డాక్టరు కూడా. పాపం నేను అడగ్గానే పుల్లముక్క తీసి అవతల పారేశాడు. చూడండి, ఇదిగో ..ఇక్కడే గుచ్చుకుంది. అతనికి అర్థమవ్వకపోయినా, కాదు పొమ్మన్నా నేనేమయ్యే దాన్నో నాకే తెలియదు. బాధతో చచ్చిపోయేదాన్నంటే నమ్మండి..**"



గొఱ్ఱెలు, మేకలు, కోతులు, బాతులు నిండిన ఆ సభాస్థలిలో శ్రోతలు ఆశ్చర్యంతో చెవులు రిక్కించుకుని ఆ కబుర్లు విన్నారు. ఓ నిర్ణయానికి వచ్చారు.

* * *

అవాళ జాన్‌కు హాస్పటల్లో చచ్చేపని. ఇంటికి వచ్చి పడుక్కునే వేళ భార్య చేత వీపు పట్టించుకుంటున్నాడు. ఇంతలో కుక్క బెడ్‌రూమ్ తలుపుతోసుకుని లోపలికి వచ్చింది. "**అబ్బో, మంచి రసవద్ఘట్టంలో ఉన్నట్టున్నారే**" అంది. కుక్కభాష అర్థంకాని లిజాకు అది మొరుగుడే అనిపించింది కానీ జాన్‌కు సిగ్గు, చికాకు వేసుకొచ్చాయి.



'ఇప్పుడే వస్తా' అని భార్యకు చెప్పి బయటకు వచ్చి తలుపు దగ్గరకు వేసి లక్కీని కోప్పడ్డాడు - 'నా ఇంట్లో కూడా ప్రైవసీకి నేను నోచుకోలేదా? ఎప్పుడు పడితే అప్పుడు తలుపు తోసుకుని లోపలకు వచ్చేయడమేనా?'' అని తిట్టి తలుపు ధడాలున మూసేసి వచ్చాడు.

దరి చేరుతున్న భర్తను లిజా కాస్త ఆశ్చర్యంగా చూస్తూ " కుక్కలా మొరుగుతున్నారేమిటి?" అని అడిగింది.

తను కుక్కతో మాట్లాడుతున్నది భార్యకు మొరుగుడులా వినబడుతోందని గ్రహించిన జాన్‌కు ఏం చెప్పాలో తెలియలేదు. బయట కుక్క '**నీకు టిప్స్ కావాలంటే చెప్పు, నేర్పుతా**' అని అరుస్తోంది.

ఈ గందరగోళంలో ఏమనాలో తెలియక 'నేను ఎక్సయిట్‌మెంట్‌లో ఉన్నాను కదా, అందుకని మొరిగేనన్నమాట' అన్నాడు. అని, ఓ సారి మొరిగి చూపించాడు.

"ఇంతకుముందు ఎప్పుడూ ఇలా లేదే!" అంది లిజా తమాషాగా నవ్వుతూ.

"సరే అవన్నీ వదిలిపెట్టు, హాయిగా పడుకుందాం" అని జాన్ ఉపక్రమిస్తూండగానే ఎవరో కాలింగ్ బెల్ కొట్టిన చప్పుడయింది.

ఇంతరాత్రివేళ ఎవరా అనుకుంటూ వెళ్లి తలుపుతీసిన జాన్‌కు అక్కడ మనుషులెవరూ కనబడలేదు. ఓ నాలుగు గొఱ్ఱెలు 'హలో డాక్టర్' అని పలకరించాయి. దెబ్బకి దడుసుకుని తలుపు మూసేశాడు. మూసేసి ఇటు చూసేసరికి అరడజను బాతులు, ఓ మేక కనబడ్డాయి. రాజమార్గం కంటె పక్కదారులే ఎక్కువ అలవాటేమో కిటికీలోంచి వచ్చేసివుంటాయి. ఈ దురాక్రమణదారులను చూసి తెల్లబోతూ లక్కీ అక్కడే తచ్చాడుతోంది.



అనుకోని అతిథులు ఇలా గబగబా ఇల్లు చుట్టబెట్టుస్తూంటే జాన్‌కి మతి పోయింది. 'బాతుల సంగతి చూసుకో' అని లక్కీకి చెప్పి బాత్‌రూమ్‌వైపుకి సైగచేశాడు. 'నేను చూసుకుంటాలే' అని లక్కీ హామీ ఇచ్చి వాటిని బాత్‌రూమ్ వైపుకు మళ్లించడం చూసి ఊరడిల్లబోతూండగానే మేక తన బెడ్‌రూమ్‌వైపుకు వెళ్లడం కనబడింది.

పక్క సర్దుతున్న లీజా తలుపుచప్పుడు విని తలెత్తి చూసింది. ఆమె కంటికి మేక కనబడితే కెవ్వుమనేదే కానీ సరైన సమయంలో జాన్ చొరబడి మేక మెడకు కట్టిన తాడు పట్టుకుని 'పీపింగ్ గోట్'ను వెనక్కి లాగేశాడు. తలుపు సందులోంచి తలకాయమాత్రం లోపలికి పెట్టి "మా కొలీగ్ మార్క్ వచ్చాడు. ఆ టేకోవర్ ఎగ్రిమెంటు గురించి మాట్లాడదామంటున్నాడు. వెధవకి వేళా, పాళా లేదు. మాట్లాడి పంపించేస్తా.'' అన్నాడు.



లీజాకు ఒళ్లు మండిపోయింది. "మహ గొప్పగా ఉంది. గుడ్‌నైట్! నేనింక పడుక్కుంటా. తెల్లారే లేచి బ్రేక్‌ఫాస్ట్ తయారు చేయవలసినదాన్ని నేనేగా!" అంటూ దుప్పటి ముసుగెట్టేసింది.

ఈ సంభాషణ జరుగు తూండగా తన చొక్కాను పళ్లతో గుంజుతున్న మేకను మెడ పట్టుకుని వరండాలోకి లాక్కు వస్తూండగానే జాన్ పెద్దకూతురు పెప్సీకా కనబడింది. పడుక్కోబోయే ముందు బాత్‌రూమ్‌కి వెళదామని ఆ పిల్ల వస్తోంది.

జాన్ చటుక్కున మేకను పక్కగదిలోకి తోసేసి తను తలుపు పక్కన నిలబడ్డాడు. "ఏమిటీ అర్థరాత్రి తిరుగుళ్లు?'' అని కూతుర్ని గద్దించాడు.

"బాత్‌రూమ్ కెళదామని..అయినా నువ్వేం చేస్తున్నట్లు?'' అంది ఆ గడుసు పిల్ల!



''నేను ఇంటికి యజమానిని. మీరంతా హాయిగా పడుక్కుంటారు. కానీ నేను మాత్రం అంతా జాగర్తగా ఉందో లేదో చూసుకోవాలి. పోలీసు వాడిలా ఇల్లు కావలా కాయాలి. నువ్వు అక్కడే ఉండు, కదలక.'' అన్నాడు.

**(సశేషం)**

## కౌంటెకౌశ్చెన్లు - తుంటరి జవాబులు



ప్ర. లేడీ స్టెనో ఆశ్చర్యపోయేదెపుడు?
జ. తనకు లవ్ లెటర్ 'షార్ట్‌హ్యాండ్'లో వచ్చినపుడు!
ప్ర. డబ్బు విషయంలో గట్టిగా ఉండే లాయర్ ?
జ. ఎవరైనా దూరపుబంధువు ఫోన్ చేసి సాయంత్రం వస్తే 'ఫ్రీ'గా మాట్లాడుకోవచ్చా అంటే, ఫ్రీ గా అయితే కుదరదు అనేవాడు!
ప్ర. మొహమాటం లేని ఆటో డ్రైవర్?
జ. 'ఏమండీ! పొద్దున్నే ట్రయినుకి అమ్మా, నాన్నా వస్తున్నారు! తీసుకురండి' అంటే '20 రూ॥లు ఎగస్ట్రా అవుతుంది' అనేవాడు.
ప్ర. హైటెక్ గృహిణి?
జ. పేరంటం అయ్యాక 'వాయనాలు' తన పర్సనల్ రోబోట్ ద్వారా ఇప్పించేది.

**- బి. శ్రీనివాసాచారి, హైదరాబాద్.**

## పేరు - రిపేరు



అతను - మాయలోడు - ఆమె -మిస్సమ్మ - ఇద్దరూ ఇద్దరే.
మా బాపూ బొమ్మకు పెళ్ళి - సకుటుంబ సపరివార సమేతంగా - క్షేమంగా వెళ్ళి లాభంగా రండి

**-బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం.**

వాళ్ళిద్దరూ - ఒకరికొకరు - జోడి - ఐతే- ఆనందం

**-ఎమ్. కృష్ణ, హైదరాబాద్.**



## చిలిపి కవిత



మా దంపతులకున్నది
వన్ అండ్ ఓన్లీ వన్‌డే!
అదే వీక్లీ ఎండ్- సండే!
ఆ రోజు మావాడ్ని
వాళ్ళ అమ్మమ్మగారింటికి పొమ్మంటే విన్డే!
దాంతో ప్రతి సండే
మా ఇరువురి గుండెలూ మన్డే!

**-ఎన్. కె. నాగేశ్వరరావు, పెనుగొండ, ప.గో.జిల్లా.**

## ఈ రూటే వేరు



సీరియల్ - చూడు నిజం
ఐక్యూ - నా యొక్కవరుస
ఏమిటీ? - ఏ కంపెనీ 'టీ'?
రిలీజ్ - మళ్ళీ లీజుకివ్వటం

**-బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం.**

## డబుల్ రోల్




నా జేబు **రుమాళ్లు** ఎలా పోయాయో ఆ పె**రుమాళ్లు** కెరుక
ఈ **గోరింట టాగోరింట** లేదు
నా రివాల్వర్‌లోని గుళ్ళు **గురి** తప్పి నలు**గురి**ని గాయ పరిచాయి

-టి. చందన్, పుణె

**కరి** ఎక్కడైనా **కరి**వేపాకు తింటుందా
**రుతికా!** మన పెళ్లిరోజున నీకో మా**రుతి**కారును ప్రజెంట్ చేయాలనుకుంటున్నాను.

-గంగిశెట్టి భారతి, నవాబుపేట, నెల్లూరు.

## చిలిపి లిపి




| | | |
|---|---|---|
| Begger Husband | = | భిక్షపతి |
| Wife Tumor | = | ఆలుగడ్డ |
| Slow Eye | = | మెల్లకన్ను |
| Medicine Hit | = | మందుకొట్టు |
| Month, Month When Month | = | నెల నెలా వెన్నెల |

-బి. శ్రీనివాసాచారి, హైదరాబాద్

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| గంగరావి పట్టాభిరామయ్య | - | గంప |
| పాకాల రమాకాంతరావు | - | పార |
| సూరిసెట్టి దినకరరావు | - | సూది |
| దాలిగుంట రంగనాధరావు | - | దారం |

- పక్కి చక్రవర్తి, గరివిడి.

## పేరడీ పెరేడ్



కురులు కురులతో మెలిపెడితే
ఆ కలయిక పేరేమి..
జ డ లె ...
కురులు కురులతో మెలిపెడితే
ఆ కలయిక పేరేమి..
జడలే...ఏ...ఏ....ఏ....
ఆ జడకో సవరం జతపడితే
ఆ జత యొక్క ఫలమేమి
బరువే....
బరువు అధికమై తల చెడితే
ఆ పై జరిగేదేమి
సలుపూ..ఊ.....ఊ...ఊ
సలుపై నరములు తెగిపోతే
ఆ ఘటనకు పేరేమి
ఉ....న్మా...దం ॥కురులు॥
చిలిపిగ ముడినే వేసితినీ
బలముగ పిన్నులు గుచ్చితినీ ॥చిలిపిగ॥
వీసెడు పూవులు పెట్టితినీ
వీధిలో లీవిగ నడిచితిని
గేదె ఒక్కటి నను చూసి...నా
మీదకు గుర్రున వచ్చినదీ ॥గేదె॥
పరుగులు తీస్తిని కడుదూరం
నే మరువగ లేనా విడ్డూరమ్ ॥కురులు॥

**('సుమంగళి' చిత్రంలోని 'కనులు కనులతో కలబడితే' అనే పాటకు పేరడిగా)**

**-మేడా మస్తాన్‌రెడ్డి, విశాఖపట్నం**

**ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన మేడా మస్తాన్‌రెడ్డి, విశాఖపట్నం గారికి సోహన్ మ్యూజిక్ వారు 'వన్స్‌మోర్ ఎన్.టి.ఆర్.' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**









నలభై ఏళ్ళుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



## బియ్యం సమస్య

1948లో, చదువు మాట దేవుడెరుగునని, అలా అలా మద్రాసు విహారం చేశాను. చిన్న 'సినిమాపిచ్చి' కూడా లోలోపల వుందేమోమరి! రోజూ స్టూడియోలవేపు వెళ్లడం, పాండీ బజార్లో తిరగడం-ఇదేపని. స్టూడియోలంటే ఏమున్నాయి? వాహిని నిర్మాణంలో వుంది, ఆ ప్రాంతంలో వున్న స్టార్‌కంబైన్స్‌లో పనేమీలేదు. ఉన్నదల్లా శోభనాచల స్టూడియో. అక్కడ



'కీలుగుఱ్ఱం', 'మనదేశం' షూటింగులు చూస్తూ వుండేవాణ్ణి. ఓ ఉదయం పాండీబజార్లో వున్న గీతాకేఫ్ ముందు నించుని వుండగా, నీలం రంగు ర్యాలీ సైకిలు మీద సర్రున వచ్చి బర్రున బ్రేక్ కొట్టి, ఛట్టున దిగారు- అక్కినేని నాగేశ్వరరావుగారు.

అప్పటికే ఆయన స్టారు. తెల్లనిపంచె, జుబ్బా, రిమ్‌లెస్ కళ్లజోడు, అంతజుట్టూ. గీతాకేఫ్ హోటల్లోకి వెళ్లారు. "ఈయనకూడా ఇక్కడికే వస్తారా టిఫిన్‌కి?" అనుకుంది నా మనసు, అయితే ఆయన ఫోన్‌లో మాట్లాడానికి వచ్చారు-ఇంట్లో లేదుకాబోలు! నా బుద్ధి ఎక్కడికి పోతుంది! ఏం మాట్లాడతారో విందాం అని, గుమ్మం దగ్గర చేరాను. ఆయన ఎవరో బియ్యం కొట్టువాడికి ఫోన్ చేసి, వాళ్లు పంపించిన బియ్యం బాగులేవని, వేరే బస్తా పంపమనీ- పాతబియ్యం పంపమనీ చెప్పి ఫోన్ పెట్టేశారు.

"సినిమా హీరోలకి కూడా బియ్యం సమస్యలుంటాయన్నమాట" అనుకుంది వెర్రిమనసు. నాగేశ్వరరావుగారు, హోటల్ అతనికి చిల్లర (ఫోన్ కాల్‌కి) ఇచ్చేసి, మళ్లీ సైకిలెక్కి - పాండీబజార్ వేపు స్పీడుగా వెళ్లిపోయారు. ఏదో కాల్‌షీట్లు, షూటింగులూ విషయం మాట్లాడితే విందామని ఆశపడిన మనసు- బియ్యం సమస్య వినగానే,"మనలాగే వీళ్లకీ తప్పవు" అనుకుంది. "స్టార్ అయినా ఎంత సింప్లిసిటీ" అనికూడా అనుకుంది-ఆనందంతో మునిగిన సినిమా మనసు.

* * *

## తొలి అనుభవం

జైహింద్ సత్యంగా పేరుపొందిన స్టిల్‌ఫొటోగ్రాఫర్ సత్యం - అందరికీ తల్లో నాలుకలా వుండేవాడు. జోకులు ఆనందించేవాడు,జోకులు చెప్పేవాడు. ఎప్పటివాడు? 'మాలపిల్ల' (1938) సినిమాటైమ్‌లో రామబ్రహ్మంగారి దగ్గరచేరి ఆ పనీ ఈ పనీ చేస్తూ డార్క్‌రూమ్ అసిస్టెంటుగా వుండేవాట్ట. కొన్నాళ్లకి కెమెరా పట్టుకోడం, బొమ్మతియ్యడం తెలిశాయిట. కాని ఎవరూ అవకాశం ఇచ్చేవారు కాదుట.

ఒక సందర్భంలో ఆ మాట ఈ మాట మాట్లాడుతూ ఇలా చెప్పాడు.

"నాకు మొట్టమొదట ఫొటోతీసే అవకాశం ఇచ్చింది ఒక శవం. మావూరి దగ్గర ఒక ఊరు. అతనెవరో పోయాడు. బతికుండగా ఏనాడు ఫొటో తీయించుకోలేదు. చచ్చిన బొమ్మయినా వుంటుందని బంధువులు ఫొటోగ్రాఫర్ కోసం వెతగ్గా నేను దొరికాను.

మరికేం -ఏదోవిధంగా ఛాన్సు దొరికిందిగదా. కెమెరా తీసుకుని వెళ్లాను. శవాన్ని కుర్చీలో కూచోపెట్టారు. ఫోటో తియ్యమన్నారు. నేను ఎదురుగా నిలబడి,అందరూ ఫొటోతీసేటప్పుడు అంటారుగా- "స్టడీ ప్లీజ్" అన్నాను. ఆ ఏడుపుల గోలలోనే ఎవడో నవ్వాడు. నేను చేసిన పొరబాటుకి నాలిక్కరుచుకున్నాను. బొమ్మతీశాను.

'ఎప్పుడిస్తావు?' అని అడిగారు-బంధువులు. కర్మలు చేసేనాటికి ఇస్తానన్నాను. తప్పకుండా ఇమ్మన్నారు. దానికి ఫ్రేమ్ చేయించి, పదోరోజున పెడతారుట. అప్పట్లో ఎప్పటికప్పుడు డెవలెప్ చేసుకోవచ్చు. రీళ్ళు కావు. గాజు అద్దంగా నెగిటివ్. నేను ఆ నెగిటివ్‌ని కడిగి, శుభ్రం చేస్తూ వుండగా, చచ్చినవాడికి బొమ్మ ఎందుకనో ఏమిటో, ఆ అద్దం చెయ్యిజారి కిందపడి


జైహింద్ సత్యం

ముక్కలైంది! అంతే నా, గుండె చెక్కలైంది. ఏం చెప్పాలి వాళ్ళకి?.... మళ్ళీ 'వన్‌మోర్' చేదామంటే, శవం భస్మీపటలమై పోయిందే.

మూడు రోజుల తర్వాత కాబోలు, శవబంధువులే వచ్చారు - పెద్దఫొటో చేసిఇమ్మని. ఎక్కడిదీ!...విచారంగా మొహం పెట్టి జరిగినది చెప్పాను. అంతే!...అసలే పల్లెటూరివాళ్ళుకదా, ఒళ్ళు పై చూడకుండా నన్ను చావబాదారు! ఆ లోవల ఎవరో వచ్చి రక్షించారు గనక సరిపోయిందిగాని, లేకపోతే నాకూ అలాంటి 'ఫొటో' తియ్యవలసివచ్చేది! అది నాయనా నా తొలి అనుభవం!"

* * *

## దండతో దండింపు

మద్రాసులో ఒక సాంస్కృతిక సభ జరిగింది, ఓ సాయంకాలం. వేదికమీద వున్న పెద్దల్లో నాగయ్యగారు, లింగమూర్తిగారూ వున్నారు. కార్యకర్తలు, సభారంభంలో అందరికీ పూలమాలలు వేస్తూ వుంటే, వెయ్యగానే వాళ్లు తీసేస్తున్నారు. లింగమూర్తిగారు మాత్రం - దండ వెయ్యగానే మైక్ దగ్గరకొచ్చి "నేను దండ తియ్యను, అభిమానించి, పెద్దలు పూలమాల వేస్తే "నేను తగను నేను తగను" అన్నట్టు తీసిపారెయ్యడం ఏమిటి? అవమానం! సభ



లింగమూర్తి

అయ్యేవరకు నేను ఈ పూలమాలని ఇలాగే భరిస్తాను" అని ఆవేశంగా అన్నారు నాగయ్యగారి వేపు చూస్తూ.

ఆ తర్వాత మాల నాగయ్యగారి మెడలో పడింది. ఆయన మైకు దగ్గరకొచ్చి-"మా బావ లింగమూర్తి దండ తియ్యనన్నాడు. పూలమాల నిరంతరం మెడలో వుండవలసింది దేవుడి విగ్రహానికి. మనం పెద్దలం అనీ, కళాకారులం అనీ మర్యాదకి పూలమాలాలంకృతుల్ని చేస్తారు. అయితే అలా దండ వేసుకుని కూచోడం సభామర్యాదకాదు. పైగా కళాకారుడికి అంతర్లీనంగా ఎప్పుడూ పూలమాల వుంటూనే వుంటుంది. అంచేత నేను తీసేస్తున్నాను" అని, మాలతీసి బల్లమీదపెట్టి లింగమూర్తి వేపు చూశారు. అసలే లింగమూర్తి గనక, కళ్లలో రౌద్రం కురిపిస్తూ - నాగయ్యగారివేపు చూశారు- 'నన్ను అవమానిస్తావా' అన్నట్టు.

సభ అయిపోయిన తర్వాత, "అయితే బావా! అందరిముందు నన్ను అవమాన పరిచి, చెప్పుతో కొడతావా! " అన్నారు లింగమూర్తి - 'శివుడు' తీక్షణంగా 'పాము' వేపు చూసినట్టు చూసి.

"నిన్ను చెప్పుతో కొడతానా బావా ఎన్నడయినా? మెత్తగా మన్మథుడు కొట్టినట్టు పూమాలతో కొట్టాను" అని నవ్వుతూ నాగయ్యగారు జవాబిచ్చేసరికి పక్కన వున్నవాళ్లు, లింగమూర్తి గారూ అందరూ నవ్వేశారు.

* * *

## పాపం అసహాయుడు

"భోగభాగ్యాలు" అనే సినిమాలో నేను శ్రీదేవికి(హీరోయిన్)తండ్రిని. ఆ సినిమాకి పనిచేసిన సహాయదర్శకుల్లో ఒకడు, శ్రీదేవికి వీరాభిమాని. ఆ అమ్మాయి సెట్టుకి వచ్చిన దగ్గర్నుంచి, ఆ అబ్బాయికి వెయ్యికళ్ళు! అంతే! అలా చూస్తూవుండిపోయేవాడు.ఏదో మిషపెట్టుకుని శ్రీదేవి దగ్గరకి వెళ్లాలనీ, మాట్లాడాలనీ తపించిపోయేవాడు. వెంకటేశ్వరస్వామికి ఎడమపక్కన శ్రీదేవి వున్నట్టు ఎప్పుడూ అతనిజేబులో శ్రీదేవి ఫొటో వుండేది. అది చూసుకుంటూ వుండడం, మురిసిపోతూ వుండడం!

ఆ సినిమాలో నేను మరణిస్తాను-గుండెపోటుతో, తండ్రిమరణానికి దుఃఖిస్తూ "నాన్నా" అని శ్రీదేవి నామీద పడి భోరున ఏడుస్తుంది. టేక్‌లో, శ్రీదేవి ఎంతో సహజంగా, ఏడుస్తూ "నాన్నా"అంటూ నా గుండెల మీద పడిపడి, కుదుపుతూ కదుపుతూ ఏడ్చింది. షాట్ కట్ అయిన తర్వాత, ఇద్దరమూ లేచిపోయాం. నిస్సహాయదర్శకుడు ఏడుపు మొహంతో నాదగ్గరకొచ్చి- "సార్! ఎంత అదృష్టవంతులు సార్ మీరు! ఎంత సేపు శ్రీదేవి మీ మీదపడి ఏడ్చింది!... ఆహా! ఆ తండ్రివేషమే నాకిచ్చివుంటే ఎంత అదృష్టవంతుడినయ్యేవాణ్ణి...! మీరు గొప్ప లక్కీసార్"అన్నాడు ఆనంద పడిపోతూ.

"ఈ తండ్రివేషం నీకెందుకు బాబూ - ఏకంగా హీరోవేషమే (కృష్ణ) కోరుకోవచ్చు గదా-గుండెలకి అదుముకోవచ్చు"! అన్నాన్నేను. "ఆ



వేషం నాకెందుకిస్తారు సార్...ఇలా చనిపోయే వేషం ఇచ్చినా చాలుకదా నా జన్మకి!" అంటూ శ్రీదేవి మేకప్ రూమ్‌కి వెళ్తుంటే, నెమ్మదిగా వెంటబడ్డాడు. నిస్సహాయ, అనహాయ దర్శకుడు- మళ్లీ ఏడుపు మొహం పెట్టి.

* * *

## గొంతుమార్పిడి

"ఆలీబాబా నలభైదొంగలు" (గౌతమీ పిక్చర్స్ : 1970)లో నేనొక పిసిని గొట్టు వేషంవేశాను- ఫకీరయ్య అని. గెటప్ అదీ బాగుందని, పిసినారితనం గల పాత్ర గనక, నా గొంతుమార్చి బొంగురుగా (ఎమ్.ఆర్. రాధలాగా) మాట్లాడితే ఎలా వుంటుందని దర్శకుడు విఠలాచార్యగారిని అడిగాను. సరే అన్నారాయన. ఆ రోజుల్లో అక్కడికి అక్కడే రికార్డింగ్ కదా- మూడురోజులు పనిచేశాం. నిర్మాత రామబ్రహ్మంగారు సెట్టుకి వచ్చేవారుగాని, పెద్దగా గమనించలేదు. రష్ వేసుకుని చూసుకున్నాక నేను గొంతుమార్చడం ఆయనకి నచ్చలేదు. నాకు కబురు చేస్తే వెళ్లాను. "ఎందుకు మీ గొంతును మార్చారు? మీది కాదనుకోరా? ఎవరిచేతో డబ్బింగ్ చెప్పించారు అనుకోరా ప్రేక్షకులు? ఐనా మీ అసలు గొంతు మాకు కావాలిగాని, కృత్రిమమైన కంఠం ఎందుకు? ఏమీ అనుకోక దయచేసి మీ పాత గొంతుతో తిరిగి మాట్లాడండి" అన్నారు రామబ్రహ్మంగారు.

"ఓరిదేవుడా! ఏదో అనుకుంటే ఏదో అయిందే" అని, విఠలాచార్య గారితో చెప్పి, నా గొంతుతో నేనే డబ్బింగ్ చెప్పుకున్నాను-తీసినంతవరకూ. తర్వాత షూటింగ్‌లో



"ఆలీబాబా నలభైదొంగలు" లో...

రామబ్రహ్మంగారు వచ్చి, ఎదురుగా కుర్చీ వేసుకుని కూచున్నారు.

"మళ్లీ ఆ పొరపాటు చెయ్యనండి" అన్నాన్నేను నవ్వుతూ. ఆయన కూడా మెత్తగా నవ్వి అక్కడనుంచి లేచి వెళ్లిపోయారు.

* * *

## సం'గీతా' రహస్యాలు

### గాత్ర నటుడు ఘంటసాల

సాధారణంగా పాట మధ్యలో డైలాగుల్లాంటివి వస్తే, ఆ నటులే ఆ మాటలు చెప్పేవారు-పాట ఘంటసాల గారు పాడినా! 'పాండురంగమహాత్యం'లో 'అమ్మా అని పిలిచినా' అన్నపాటను ఘంటసాలే పాడారని వేరే రాయాలా! యన్.టి. ఆర్ దేకుతూ పాడుతూ వెళ్లే ఆ దృశ్యం, ఆర్ద్రతని వొలికించే ఘట్టం!



ఆ పాట చివర "అమ్మా- నాన్నా" అని ఆవేశంగా, ఆవేదనతో పై స్థాయిలో పిలవడం వుంది. రికార్డింగ్ లో ఘంటసాలే గాత్రాభినయం చేశారు. "ఆయన్ని అననీయండి- తర్వాత నా గొంతులో కూర్చుకోవచ్చు"అనుకున్నారు రామారావు. కాని, గీతాంతంలో ఘంటసాల గారి గొంతే వినిపిస్తుంది మనకి! కారణం? "అది చాలా ఎఫెక్టివ్‌గా వుంది. ఆ స్థాయిలో, అంతటి, హృదయ వేదన పలకాలి! ఎందుకూ - ఆ కంఠమే వుంచేదాం" అని ఘంటసాల గారి ఆవేదనా కంఠాన్నే వుంచేశారు రామారావు. అదీ ఆయన జడ్జిమెంట్!

- ఆర్కే




'దొంగరాముడు','తోడికోడళ్ళు','మాంగల్యబలం' చిత్రాల ద్వారా ప్రతిష్ఠాత్మక సంస్థగా పేరును ఇనుమడింప జేసుకున్న అన్నపూర్ణ పిక్చర్స్ తమ తదుపరియత్నంగా తీసిన

# వెలుగునీడలు

చిత్రం 1961లో విడుదలయింది. అక్కినేని,సావిత్రి,గిరిజ,జగ్గయ్య,రంగారావు, సూర్యకాంతం,రేలంగి ముఖ్యతారాగణం. ఆదుర్తి సుబ్బారావు దర్శకుడు. 'దొంగరాముడు' చిత్రం తర్వాత పెండ్యాల నాగేశ్వరరావు సంగీత దర్శకుడిగా బిజీగా ఉండడం చేత 'తోడికోడళ్ళు' 'మాంగల్యబలం' చిత్రాలకు స్వర రచన చేయలేకపోయారు. ఈ చిత్రానికి తిరిగి ఆయనకు సంగీత దర్శకత్వం వహించే అవకాశం వచ్చింది. నిజానికి పెండ్యాల నాగేశ్వరరావుకి, అన్నపూర్ణ అధినేత దుక్కిపాటి మధుసూదనరావు గారికి ఉన్న అనుబంధం సినిమాలతో ప్రారంభం కాలేదు. పెండ్యాల నాగేశ్వరరావుగారి తండ్రి దుక్కిపాటి వారి సతీమణి సుశీలాదేవి గారికి సంగీతం చెప్పేవారు. అలా ప్రారంభం అయింది వారి పరిచయం. అసలు పెండ్యాల వారే అక్కినేని నాగేశ్వరరావు, దుక్కిపాటి మధుసూధనరావు గారికి పరిచయం అవటానికి కారణం కూడా. పెండ్యాల సంగీత దర్శకత్వంలో వచ్చిన 'వెలుగునీడలు' చిత్రంలోని పాటలన్నీ ప్రజాదరణ పొందాయి. కొన్ని శ్వాశత కీర్తిని కూడా సంపాదించుకున్నాయి. ఓ మూడింటి గురించి ఈ సంచికలో...

శివ గోవింద గోవింద హరి గోవింద గోవింద ॥2॥

1. సంతానమే లేక స్వర్గమేలేదని
చిట్టిపాపను తెచ్చి పెంచుకుంటారు ॥సంతా॥
సంతు కలిగిందంటే చిట్టి పాపాయీ గతి
శ్రీమతే రామానుజాయనమ: ॥శివ॥

2. తమ బాగు కొసమై తంటాలు పడలేరు
ఎదుటి కొంపకు ఎసరు పెడతారయా
పొరుగుపచ్చను ఓర్వలేని వారీగతి
శ్రీమతే రామానుజాయనమః ॥శివ॥

3. ఒరుల కోసం త్యాగమొనరించు వారొకరు
పరుల మోసం చేసి బ్రతుకువారింకొకరు ॥ఒరు॥
ఉపకారికే కీడు తలపెట్టువారి గతి
శ్రీమద్రమారమణ గోవిందో హరి గోవింద గోవింద ॥శివ॥

4. కలిమి లేనన్నాళ్లు కలిసిమెలిసుంటారు
కలిమి చేరిన నాడు కాట్లాడుకుంటారు
కలిమి పెంచే కాయకష్ట జీవుల గతి
శ్రీమతే రామానుజాయనమః

5. ఆనాడు శ్రీయోగి వీరబ్రహ్మంగారు
కాలజ్ఞానము బోధ చేసేరయా ॥ఆనాడు॥
ఈనాడు కొసవెర్రి వెంగళప్ప మాట
అక్షరాలా జరిగి తీరేనయా ॥శివ॥






ఈ పాటను కొసరాజు రాఘవయ్య చౌదరి రాయగా మాధవపెద్ది సత్యం, సరోజిని ఆలపించారు. రేలంగి, బేబి శశికళ, టి.జి. కమలాదేవి అభినయించారు. హరికాంభోజి రాగాన్ని ఆధారంగా చేసుకుని స్వరపరిచిన ఈ పాట అందరి ఆదరాభిమానాలనూ చూరగొన్నదంటే కారణం-కథలో, కథతో ఇమిడిపోయే సాహిత్యం, విన్నవెంటనే నోటికి పట్టుకునే ట్యూన్, వ్యంగ్య ధోరణి లోకరీతిని సున్నితంగా తెలియజేసిన విధానాలే!. నిర్మాత దుక్కిపాటి మధుసూధనరావు గారికి బాగా పరిచయం ఉన్న ఒక కుటుంబంలో సంతానం లేకపోతే ఒకరిని తెచ్చి పెంచుకుంటూ తమ కంటూ పిల్లలు పుట్టాక వారిని నిర్లక్ష్యం చేయటం జరిగింది. ఆ అనుభవాన్ని 'వెలుగు నీడలు' కథకు మూలంగా వాడుకోవడమే కాకుండా ఈ పాట మొదటి చరణానికి కూడా ఉపయోగించుకున్నారు. గుడివాడ దగ్గర్లో ఆరుగొలను అనే గ్రామం ఉండేది. ఆ చుట్టు ప్రక్కల ప్రాంతంలోనే ఓ కాంగ్రెస్ నాయకుడు ఉండేవారు. ఆయనకు 'శ్రీమతే రామనుజాయనమః అని మాటి మాటికీ అనే అలవాటువుండేది. ఆ మాటనే ఈ పాటలో పెడితే బావుంటుందని కొసరాజుకి సూచించారు దుక్కిపాటి. అలా వాడేసరికి పాట చాలా బాగా వచ్చిందనిపించి మొత్తం సినిమాలో రేలంగికి ఆ మాటను ఊతపదంగా చేశారు. ఇదిలా ఉండగా తన పాత్రకి పంచకట్టు, పిలక, బుర్రమీసాలు ఇవన్నీ ఉండడం చేత గ్లామర్ లేదని రేలంగికి అనిపించింది. దుక్కిపాటి వారితో ఎదురుగా అనే ధైర్యం లేక తమిళ నటుడు తంగవేలుతో చెప్పించారాయన. 'వెలుగు నీడలు' తమిళవెర్షన్ 'తూయ ఉళ్ళుం'' షూటింగ్ కూడా ఏకకాలంలో జరిగేది. అందులో రేలంగి పాత్రను తంగవేలు చేశారు. ఇద్దరి వాదన విన్న దుక్కిపాటి వారు 'మీ పాత్రను జనం ఖచ్చితంగా బాగా రీసివ్ చేసుకుంటారు. ఈ పాట కూడా హిట్ అవుతుంది' అని పందెం కాశారు. అలాగే జరిగింది కూడా!




మిత్రుడు1: కర్నూలు ఎక్కడ ? కాకినాడెక్కడ?
ఏలూరు సాలూరు ఆలూరు ఎక్కడ?
వరంగల్లు ఎక్కడ?
మిత్రుడు2: స్టాప్! రైల్వేగైడ్ చూడరా గురూ!
మిత్రుడు1: శిష్యా! శాంతి! శాంతి!
వాడవాడలనుండి వాలాము యిక్కడ
లక్కా బంగారంలా అతుక్కుపోయాముర మైడియర్
ఆహాఁ...కరెక్ట్
బలే బలే మంచి రోజులులే
మళ్ళీ మళ్ళీ యిక రావులే ॥బలే బలే॥
స్టూడెంట్ లైఫే సౌఖ్యములే
చీకు చింతకు దూరములే ॥బలే బలే॥




చంద్రం : పంపునీళ్లు బందైతే స్నానానికి నోచుకోము
మిత్రుడు : "గుఁయ్యి" మని దోమలు దాడిచేస్తే శివరాత్రి జాగరణ చేస్తాము
చంద్రం : ఉప్పూకారంలేని హోటల్ సాపాటుతో చప్పబడి పోయాము రా బ్రదర్
మిత్రుడు : హా...ఎన్ని కష్టాలురా నా తండ్రి!
చంద్రం : భయపడకురా పుత్రా కష్టాలను దిగమింగేస్తాం
కలకల నవ్వుతూ గడిపేస్తాం ॥ కష్టా॥ ॥బలే బలే॥
చంద్రం : ఇంటికి పోతే 'పెళ్ళి పెళ్ళ'ని వెంటబడతారు పెద్దలు
మిత్రులు : పెళ్లి చేసుకుంటే 'మేము మేమ'ని పుట్టుకొస్తారు పిన్నలు
చంద్రం : ఈ జంఝూటంతో విద్యనాశాయ
సర్వం నాశాయ నమో నమో రా బ్రదర్
మిత్రుడు : హా! హతవిధీ!



చంద్రం : సహనం ! సహనం! ఉపాయంవుంది నాయనా!
పెళ్ళికి బకాయి పెట్టేస్తాం బాధ్యతలన్నీ నెట్టేస్తాం ॥పెళ్ళికి॥ ॥బలే బలే॥
చంద్రం : బాధ్యతలనెన్నడూ మరచిపోరాదు
ప్రగతి మార్గమునెపుడూ వదిలిపోరాదు
క్రమశిక్ష పాటించి కదిలిపోవాలిరా బ్రదర్
మిత్రులు : హియర్ ! హియర్!
చంద్రం : ఆదర్శంగా నడవాలి
అందరూ 'భేష'ని పొగడాలి ॥ఆదర్శం॥ ॥బలే బలే॥



ఈ పాటను కొసరాజు రాయగా ఘంటసాల, మాధవపెద్ది సత్యం, బృందం పాడగా అక్కినేని, పద్మనాభం, పేకేటి మరికొందరు జూనియర్ ఆర్టిస్టులు నటించారు. ఈ ఆర్టిస్టులలో కొంత ప్రముఖంగా చెప్పుకోవలసింది కొమ్మినేని శేషగిరిరావు గురించి. ఈ పాటలో ఆయన ఎక్కువగా పేకేటి పక్కనే కనబడుతూ ఉంటారు. ఈయన సంగీతదర్శకుడు చక్రవర్తికి సోదరుడు. నటుడిగా కొంచెం స్థిరపడ్డాక దర్శకుడిగా మారి" దేవతలారా దీవించండి" అనే చిత్రానికి దర్శకత్వం వహించారు. సన్నివేశపరంగా సావిత్రి కూడా కొన్ని ఇంటర్ కట్స్‌లో కనిపిస్తుంది. ఇది కేవలం సరదాకోసం స్టూడెంట్లు పాడుకునే పాట. అంచేత వారి సమస్యల్ని ప్రతిబింబించేలా సాహిత్యం రూపుదిద్దుకుంది. కొన్ని కొన్ని సమస్యలని పాటలో ప్రతిఫలింపచేయటంలో కవి, నిర్మాత, దర్శకుడు, సంగీత దర్శకుడు వీరి యొక్క వ్యక్తిగత సంస్కారం ప్రతిబింబిస్తూ వుంటుంది. ఇక్కడ మనం గమనించవలసింది అదే! ఇదే పాటని ఇప్పుడు రాయించవలసివస్తే ఎన్ని కుసంస్కార భావాలు అక్షర గౌరవాన్ని పొందుతాయో వేరేగా వర్ణించనవసరం లేదు. ట్యూన్ పరంగా ఈ పాట ఎక్కువగా ఫోక్ మ్యూజిక్ పై ఆధారపడిందని చెప్పుకోవాలి. జానపదసంగీతానికి ఎక్కువగా ఉపయోగించే 'హరి కాంభోజి' రాగాన్ని కేవలం ఆధారంగా మాత్రమే తీసుకుని జనరంజకత్వం కోసం ఎక్కువగా మిశ్రమం చేశారు పెండ్యాల. అంచేత 'మిశ్రహరికాంభోజి' అని వ్యవహరించటం మంచిది. రచనాపరంగా మరి కొంచెం ఎక్కువగా ఆలోచిస్తే - రెండో చరణం చివర్న బాధ్యతలన్నీ నెట్టేస్తాం- అంటూనే వెంటనే వచ్చే మూడో చరణంలో - బాధ్యతలనెన్నడు మరచిపోరాదు- అంటూ ఉపదేశం చెయ్యడం అంత సబబుగా అనిపించదు.

పాడవోయి భారతీయుడా
ఆడిపాడవోయి విజయగీతికా ॥పాడవోయి॥
నేడే స్వాతంత్ర్యదినం వీరుల త్యాగఫలం
నేడే స్వాతంత్ర్యదినం వీరుల త్యాగఫలం
నేడే నవోదయం నీదే ఆనందం ఓ ఓ ఓ ॥పాడవోయి॥
స్వాతంత్ర్యం వచ్చెననీ సభలేచేసి
సంబరపడగానే సరిపోదోయి
స్వాతంత్ర్యం వచ్చెననీ సభలేచేసి
సంబరపడగానే సరిపోదోయి
సాధించిన దానికి సంతృప్తిని పొంది
అదే విజయమనుకుంటే పొరపాటోయి
ఆగకోయి భారతీయుడా
కదలి సాగవోయి ప్రగతి దారులా ॥ఆగ॥ ॥పాడవోయి॥
ఆకాశం అందుకునే ధరలొకవైపు
అదుపులేని నిరుద్యోగమింకొక వైపు
ఆకాశం అందుకునే ధరలొకవైపు
అదుపులేని నిరుద్యోగమింకొక వైపు
అవినీతి,బంధుప్రీతి, చీకటిబజారు...
అవినీతి, బంధుప్రీతి, చీకటిబజారు
అలముకున్న నీ దేశం ఎటు దిగజారు
కాంచవోయి నేటి దుస్థితి
ఎదిరించవోయి ఈ పరిస్థితి
కాంచవోయి నేటి దుస్థితి
ఎదిరించవోయి ఈ పరిస్థితి
పదవి వ్యామోహాలు కులమత భేదాలు
భాషా ద్వేషాలు చెలరేగే నేడు
పదవి వ్యామోహాలు కులమత భేదాలు
భాషా ద్వేషాలు చెలరేగే నేడు
ప్రతి మనిషి మరియొకని దోచుకునే వాడే...
ప్రతి మనిషి మరియొకని దోచుకునే వాడే
తన సౌఖ్యం తన భాగ్యం చూసుకునే వాడే
స్వార్థమీ అనర్థ కారణం
అది చంపుకొనుటె క్షేమదాయకం
స్వార్థమీ అనర్థ కారణం
అది చంపుకొనుటె క్షేమదాయకం
స్వార్థమీ అనర్థ కారణం



సమసమాజ నిర్మాణమే నీ ధ్యేయం... నీ ధ్యేయం..
సకల జనుల సౌభాగ్యమే నీ లక్ష్యం.. నీ లక్ష్యం
సమసమాజ నిర్మాణమే నీ ధ్యేయం...
సకల జనుల సౌభాగ్యమే నీ లక్ష్యం..
ఏకదీక్షతో గమ్యం చేరిననాడే
లోకానికి మన భారతదేశం
అందించునులే శుభసందేశం
లోకానికి మన భారతదేశం
అందించునులే శుభసందేశం
ఆ... హా... హా... హా... హా...

ఈ పాటను శ్రీశ్రీ రాయగా సుశీల, ఘంటసాల, బృందం ఆలపించారు. తెరపై రాజసులోచన, అక్కినేని ప్రధాన పాత్రధారులుగా అభినయించారు. ప్రేక్షకులుగా రేలంగి, సావిత్రి తదితరులు కనిపిస్తారు. తరువాత కాలంలో నృత్యదర్శకుడిగా, దర్శకుడిగా పేరు తెచ్చుకున్న కె.యస్. రెడ్డి ఈ పాటలో ఓ గ్రూప్ డాన్సర్‌గా కనిపిస్తారు. అప్పట్లో శ్రీ శ్రీ రోజుకి రెండు ,మూడు పాటలు రాసేవారు. ఈ పాటను రాయడానికి పదిహేను రోజులు పట్టిందాయనకి, ఆయనకు అఖండ కీర్తి ప్రతిష్టలను సంపాదించి పెట్టిన పాటలలో ఇదొకటి. అందుకే తన సినీ గీతాల సంకలనానికి 'పాడవోయి భారతీయుడా'అనే పేరును పెట్టుకున్నారాయన. అంతేకాదు పాట చివరిలో తాళ గతిని మారిస్తే బావుంటుందన్న ఆలోచన కూడా ఆయనదే. అందుకే అంతవరకూ తిశ్రంలో సాగిన తాళగతిని 'సమసమాజ నిర్మాణమె నీ ధ్యేయం' దగ్గర నుంచి చతురస్రం లోకి మార్చడం జరిగింది. 'పదవీవ్యామోహాలు', చరణానికి శివరంజని రాగాన్ని, మిగిలిన చరణాలకి మోహనరాగాన్ని, పల్లవికి శంకరాభరణం లోని కార్డ్స్‌ని మాత్రమే వాడుకుని సాహిత్యరీత్యా శాశ్వతత్వాన్ని, సంతరించుకున్న ఈ గీతానికి వెన్నుదన్నుగా నిలిచారు పెండ్యాల. **ఇక సాహిత్యరీత్యా ఈ పాట గొప్పదనాన్ని విశ్లేషించాల్సి వస్తే ప్రతి వాక్యాన్ని పదే పదే పేర్కొనాలి.** "మా సాహిత్యాన్ని బాగా చదివి సినిమాల్లోకి వెళ్ళిపోయావనే బాధ ఉండేది. కానీ ఈ పాట విన్నాక ఆ బాధ పోయింది" అని దుక్కిపాటి వారితో ప్రముఖ కమ్యూనిస్ట్ నాయకులు చంద్ర రాజేశ్వరరావు అన్నారట. అప్పటి ఆర్థికమంత్రిగా ఉన్న కాసు బ్రహ్మానంద రెడ్డి, అర్జంటుగా రమ్మనమని ఓ రోజు కబురు పెట్టి తీరా వెళ్ళాక- 'నేను సినిమాలు ఎక్కువగా చూస్తానని మీకు తెలుసుకదా... నిన్ననే తాడేపల్లిగూడెంలోని రేలంగి స్వంత థియేటర్‌లో మీ 'వెలుగునీడలు' సినిమాని చూశాను. ఏం పాటండీ అది..!? మరో యాభైయేళ్లయినా సరే సజీవంగా ఉంటుంది' అంటూ తెగ పొగిడారీ పాట గురించి . నిజానికి అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ పాడుకున్నా సరే- ఇవేళే స్పందించి రాసారా అన్నంత నిత్యనూతనంగా ఉంటుందీ గీతం. ప్రభుత్వ నిబంధనల రీత్యా ఇబ్బందిగా ఉంటుందేమోనని ఆలిండియా రేడియో వాళ్ళు కొన్నాళ్ళు పాటు మొహమాట పడ్డా ఆ తరువాత పాటలోని బలం ఆ మొహమాటాన్ని తప్పించేసింది. ప్రతీ ఆగస్ట్ 15న ఆంధ్రదేశంలో ఇన్నేళ్ళయినా ఈ నాటికీ ఈ పాట వినిపించని ఊరు ఉండదనే చెప్పాలి. నిజానికి పాట యొక్క ప్రయోజనం అంతటి సార్థకత్వాన్ని సంపాదించుకోవడమే కదా...

మరికొన్ని పాటల గురించి వచ్చే సంచికలో...

శ్లోకం గానం : మాధవపెద్ది సత్యం, జానకి

వక్రతుండ మహాకాయ కోటి సూర్య సమప్రభా
అవిఘ్నం కురుమే దేవా - సర్వ కార్యేషు సర్వదా
సరస్వతీ నమస్తుభ్యం- వరదే కామరూపిణి
విద్యారంభం కరిష్యామి-సిద్ధిర్భవతుమే సదా

శ్లోకం గానం : పి.బి. శ్రీనివాస్

గురుర్ బ్రహ్మ- గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ - పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః
శ్రీవిద్యాం శివవామ భాగ నిలయాం
హ్రీంకార మంత్రోజ్వలాం
శ్రీ చక్రాంకిత బిందు మధ్యవసతీం
శ్రీమత్సభా నాయకీం - శ్రీ మత్షణ్ముఖ విఘ్నరాజ జననీం
శ్రీమజ్జగన్మోహినీం - మీనాక్షీం
ప్రణతోస్మి సంతత మహం
కారుణ్యవారాం నిధీం

రచన : జి. కృష్ణమూర్తి బి.ఎ. గానం : సుశీల & పార్టీ

తుమ్మెదలూ కొమ్మల ఝుమ్మని మూగే
కమ్మని చిరుతెమ్మెర తెరలై సాగే
మదిలోన మధురాల కలవరమూ చెలరేగే ॥తుమ్మెదలూ॥
కలువా వీడునే నెలరాజు రాగా...నెలరాజు రాగా
కమలము వీడునే దినరాజు రాగా.... దినరాజు రాగా
నీమనసు వీడెనే నీ రాజు ఏడే... నీ రాజు ఏడే
కలలా చెలికాడు వలచీ వస్తాడు
కలలా చెలికాడు వలచీ వస్తాడు
కనులు కనులు కలుపునులే హాయిగా... ॥తుమ్మెదలూ॥
అందము నిండెనే జీవనము లోనా...జీవనము లోనా
అందెలు చిందెనే లే డెందము లోనా...లే డెందము లోనా
తొలికే యవ్వనమూ కులికే యీ దినమూ... కులికే యీ దినమూ
కిలకిల నవ్వవే కోకిలతో కూయవే
కిలకిల నవ్వవే కోకిలతో కూయవే
చిలుకలతో పలుకవే తీయగా
తుమ్మెదలూ కొమ్మల ఝుమ్మని మూగే
కమ్మని చిరుతెమ్మెర తెరలై సాగే
మదిలోన మధురాల కలవరమూ చెలరేగే
తుమ్మెదలూ కొమ్మల ఝుమ్మని మూగే
కమ్మని చిరుతెమ్మెర తెరలై సాగే

రచన : జి. కృష్ణమూర్తి బి.ఎ. గానం : పి.బి. శ్రీనివాస్

ఏ దివ్యలోకాల ఏలేటి దేవతో
అవనిపై ఈ లీల అవతరించె
రూపొందు అందాల రాశి యీ ఎలనాగ
పదునారు వన్నెల పసిడి తీగ
మచ్చలేని చందమామ.....మచ్చలేని చందమామ ఈ నెమ్మోము
మోవి కాదిది తేనెల బావి కాని
తిలకించ నిలువెల్ల పులకింపులే పూచె
తొలివలపు నాలోన తొంగి చూచె...
శిల్పి మదిలోన కల్పనా శిల్పమీమె
చిత్రకారుని భావనా చిత్ర మీమె
కవి కలల కదిలేటి కావ్య మీమె
రాగ రంజిత ప్రణయ స్వరూప మీమె
ఏ దివ్యలోకాల ఏలేటి దేవతో
అవనిపై ఈ లీల అవతరించె

రచన : జి. కృష్ణమూర్తి బి.ఎ. గానం: పి.బి.శ్రీనివాస్

కంటికి నిద్రలేదు - కలకంఠిని గాంచిన నాటినుండి
వెనుకంటకు డాచు - తుంట విలుకాడు బలంబుల కూడదీసి
పూవింట శరాల దూసి - వెనువెంటనె నన్ తరుమాడ బూనె
వాల్గంటిరో ఒంటివాడ - ననుగావవె జంటగ - చెల్మిపంటగా

రచన : జి. కృష్ణమూర్తి బి.ఎ. గానం: పి.బి.శ్రీనివాస్, పి.సుశీల

ఆ: ఏడేడు జన్మలనుండీ- పడివుందీ బ్రహ్మముడీ
ఏడేడు జన్మలనుండీ- పడివుందీ బ్రహ్మముడీ
మళ్ళీ పడబోతుందీ
మళ్ళీ పడబోతుందీ - మనలనొకటిగా చేస్తుందీ ॥ఏడేడు॥
అ: ఎగిరే నను బంధించావూ - పగడాల పంజర మందూ
ఆ: నా గుండెల గుడిలో నిలిపీ- దేవునిగా పూజిస్తున్నా
అ: నోరారా పిలిచే వేళా- దూరానా నిలిచేవేలా
ఆ: గారానా చేరువకాగా - మారాము చేయుటమేలా
అ: మాటలతోనే మరిపిస్తావే -
ఆ: మాటలు కావు మనసే యిచ్చా
అ: మాటలతోనే మరిపిస్తావే -
ఆ: మాటలు కావు మనసే యిచ్చా అ: ॥ఏడేడు॥
అ: ఏ దేవుని దీవన బలమో- యీడేరెను మన లే వలపూ
ఆ: మీ అడుగూ జాడలలోనే - నా ఆశల దివ్వెల వెలుగూ
అ: నీ సిగలో మల్లెగ మారీ - ఊసులతో ఊరిస్తాను
ఆ: మీ కన్నుల కాంతిని చేరి - మనసార అలరిస్తాను
అ:తీయని మన కల నిజమౌతుంది
ఆ:తప్పదు వలపే ఫలియిస్తుందీ
అ:తీయని మన కల నిజమౌతుంది
ఆ:తప్పదు వలపే ఫలియిస్తుందీ
ఇ: ఏడేడు జన్మలనుండీ- పడివుందీ బ్రహ్మముడీ
ఏడేడు జన్మలనుండీ- పడివుందీ బ్రహ్మముడీ
మళ్ళీ పడబోతుందీ
మళ్ళీ పడబోతుందీ - మనల నొకటిగా చేస్తుందీ

రచన : జి. కృష్ణమూర్తి బి.ఎ. గానం: ఎస్.జానకి

వెన్నెల్లో కనుగీటే తారకా వినవే కన్నెమనసు కరిగించే కోరిక
ఎదలో బాధా ప్రేమే చేదా
ఎదలో బాధా ప్రేమే చేదా
యిది తీరే దారే లేదా ॥వెన్నెల్లో॥
మొగ్గవంటి చిన్నదాన్ని మనసిచ్చానే
మొగ్గవంటి చిన్నదాన్ని మనసిచ్చానే
సిగ్గుతో నా నోరు విప్పి చెప్పగ లేనే
సాగసరి మొనగాడే గడుసరివాడే
సాగసరి మొనగాడే గడుసరివాడే
గుబులు గుండెలో నింపాడే ॥వెన్నెల్లో॥
ఒక్కసారి ఓరకంట నను జూచాడే
ఒక్కసారి ఓరకంట నను జూచాడే
చక్కలిగింతలు లేపి మది దోచాడే
చుక్కల రేడేనే చక్కనివాడే
చుక్కల రేడేనే చక్కనివాడే
మక్కువతో చూడ రాడే
వెన్నెల్లో కనుగీటే తారకా వినవే కన్నెమనసు కరిగించే కోరిక
ఎదలో బాధా ప్రేమే చేదా
ఎదలో బాధా ప్రేమే చేదా
యిది తీరే దారే లేదా
వెన్నెల్లో కనుగీటే తారకా

రచన : జి. కృష్ణమూర్తి బి.ఎ. గానం: మాధవపెద్దిసత్యం, స్వర్ణలత

అ: హై బలె బలె బలె బలె బలె బలె బలె బలె
యిరణ్య కసిపుడరా - నిన్ను యిరసక తింటనురా
హై నరసింహసామినిరా - నిన్ను నంచుక తింటనురా॥హై బలె బలె॥
ఆ: రారా - మావ - రారా నా అందగాడ రాతిరంత జాతరేరా
అహ...రాతిరంత జాతరేరా
రారా నా అందగాడ రాతిరంత జాతరేరా
అహ...రాతిరంత జాతరేరా
మొగలిపూల పానుపేసి నిప్పుసెగల ధూపమేసి ॥2॥
చెట్టా పట్టాలాడుకుందాం రా - రా
రారా నా అందగాడ రాతిరంత జాతరేరా
అహ...రాతిరంత జాతరేరా..... రావూ... రావా...
అ: హై బలె బలె బలె బలె బలె బలె బలె బలె
యిరణ్య కసిపుడరా - నిన్ను యిరసక తింటనురా
హై నరసింహసామినిరా - నిన్ను నంచుక తింటనురా
ఆ: చింతచెట్టు చిగురుచూడు - చిన్నదాని సొగసుచూడు ॥2॥
ములగచెట్టు కొమ్మపట్టుకురా - ఓరందగాడా
కొమ్మయిరిగితే కూలబడతవురా... మావాఁ
ములగచెట్టు కొమ్మపట్టుకురా - ఓరందగాడా
కొమ్మయిరిగితే కూలబడతవురా ॥హై బలె॥

రచన : జి. కృష్ణమూర్తి బి.ఎ. గానం: ఎస్.జానకి

పూవులు పూయును పదివేలు - భగవానుని మెడలో ఎదిర్రాలు॥2॥
ప్రాణములున్నవి అందరికి -
ప్రణయము తెలిసేదెందరికి ॥పూవులు॥
అరుదైన వరం మన జీవితము - ఆనందానికి అది అంకితము॥2॥
అరచేతనే వున్నది స్వర్గమురా ॥2॥
అది ఎరుగని వారిదే నరకమురా ॥పూవులు॥
చేజారినది నిన్నటి దినమూ - జనియించనిది రేపటి దినమూ॥2॥
అవి అందనివీ మనకెందుకురా ॥2॥
ఈ దినమే మనదనుకుందామురా ॥పూవులు॥

రచన : జి. కృష్ణమూర్తి బి.ఎ. గానం: పి.బి. శ్రీనివాస్, సుశీల

కలువరేకుల కనులు కెందామర పోల - కన్నీటి ముత్యాల కురియనేల
అవమానమున కుమిలి అలమటించుచు నుంటి -
పరితాపమున గుండె పగులుచుండె
తలచుకొని లోలోన తపియింపగానేల - తెలుపగా రాదటే కలతయేమో
దారిపోయేదాని దాసుడయె నా తండ్రి - పగదాన నేనైతి భంగపడితి
మానమర్యాదలన్నియు మంటగలిసె- మరణమొకటే నాకు శరణమింక
చాలు మతిలేని ఈ మాటలేల బేల -
చెంత నేనుండ నీకింక చింతయేల

# కథా సంగ్రహం

స్వర్ణగిరి మహారాజు ధర్మపాలుడు. అతనికిద్దరు కుమారులు. విజయసింహుడూ,అజయసింహుడూ. రాజ్యం కీర్తిసేనుని వశమైపోగానే ధర్మపాలుడు భార్యా బిడ్డలతో అరణ్యాల పాలయిపోతాడు.

కాలకేతువనే సన్యాసి సర్వలోకాధిపత్యాన్ని కాంక్షించి తగిన బాలునికోసం వెతుకుతుంటాడు. అరణ్యంలో అలమటిస్తున్న ధర్మపాలుని చూచి మీ ఇద్దరు బిడ్డలకు విద్యనేర్పుతాను అని చెప్పి అందుకు ఒక బిడ్డను తన కివ్వాలని షరతుపెడతాడు. అందుకు అంగీకరించి బిడ్డలను అతనికి అప్పగిస్తాడు ధర్మపాలుడు.

కాలకేతు దృష్టి విజయుని మీదనే ఉంది. విజయునికే సర్వవిద్యలూ నేర్పి అజయుని పశువులకాపరిగా నియమిస్తాడు.

విజయుడు సకల విద్యలలో కోవిదుడౌతాడు. గురువు తన తల్లిదండ్రులను మోసగించాలను కుంటున్నాడని గ్రహించి ముందుగానే కామరూపంలో వెళ్ళి వారిని హెచ్చరించి తననే కోరుకొమ్మని చెపుతాడు.

అతని మాట ప్రకారం తల్లిదండ్రులువచ్చి విజయునే కోరి తీసుకొనిపోతారు. నిరాశతో కాలకేతు, అజయుని కూడా పొమ్మంటాడు.

యింటికివచ్చి ఆ వృద్ధ దంపతులు కుమారులను రాజ్య సంపాదనకు పంపిస్తారు ముందుగా. తమ తల్లిదండ్రులను మోసంచేసిన ఓ గుర్రాల వ్యాపారికి బుద్ధి చెప్పాలని గుర్రంగా మారిన విజయుని అజయుడు ఆ వ్యాపారికి అమ్మి డబ్బుతీసుకుంటాడు.

విజయుడు చేసిన మోసం తెలుసుకుని కాలకేతు పగబట్టి వస్తూ గుర్రం రూపంలో ఉన్న విజయుని చూస్తాడు. వ్యాపారిని నమ్మించి ఆ గుర్రాన్ని అధిష్టించి చంపబోతాడు. విజయుడు తప్పించుకుని గురువుతో పోరాడి చిలుకగా మారి పారిపోతాడు. గురువు అమ్ముతో దానిని కొడ్తాడు.

ఆ దెబ్బతో ఆ రామచిలుక చెలికత్తెలతో ఆడుకుంటున్న పద్మావతి ముందు పడ్తుంది. పద్మావతి ఎవరోకాదు విజయుని రాజ్యం ఆక్రమించిన కీర్తిసేనుని కుమార్తె. ఆమె ఆ చిలుకపై కనికరంతో దానిని తన పడకగదిలో పగడాల పంజరంలో పెట్టి పెంచుతుంది.

డబ్బుతీసుకెళ్తున్న అజయుని వ్యాపారి నియమించిన దుండగులు తన్ని డబ్బుదోచుకుంటారు. ఏడుస్తూ కూలబడిన అజయుని ఒక దయ్యం సకుటుంబంగా ఆరగించడానికి ప్రయత్నించి విఫలమై ఓడిపోయి అతన్ని ఒక రాజ్యానికి రాజుగా చేస్తానని ప్రమాణం చేస్తుంది.

పద్మావతి నిద్రిస్తుంటే అర్ధరాత్రి విజయుడు చిలుకరూపం విడిచి ఆమె రూపం చూసి ముగ్ధుడై చెక్కిలిని చందనం పూస్తాడు. తెల్లవారిన తరువాత ఆమె అది చూసి చెలికత్తెలను దండించి, అనుమానం తీరక ఆనాటి రాత్రి మళ్ళా వచ్చిన విజయుని పట్టుకుంటుంది. యిద్దరూ ఒకరినొకరు పరిచయం చేసుకుంటారు. పరస్పరం ప్రేమించుకుంటారు. కీర్తిసేనుని ఒప్పించి సౌమ్యంగా కార్యం సాధించాలని నిశ్చయించుకుంటారు.

పడకగదిలో జరిగే యీ గుసగుసలు పసికట్టి చెలులు కీర్తిసేనుని హెచ్చరిస్తారు. కీర్తిసేనుడు హఠాత్తుగా వచ్చి విజయుని చూసి పోరాడి కూతురిని మందలించుతాడు.

కీర్తిసేనుని అన్నగారైన చిత్రసేనుని కుమార్తె లీలావతిని భూతం ఆశ్రయించి, అజయునికి అర్ధరాజ్యంతో పాటు అర్ధాంగి కూడా దక్కేవిధంగా తోడ్పడి తనమాట నిలుపుకుంటుంది.

శిష్యుడు చేయి జారిపోయాడని చింతిస్తున్న కాలకేతునకు సర్వసిద్ధులు లభించడానికి యింకొక మార్గం కనిపిస్తుంది. దానికి అమితమైన బంగారం అవసరపడ్తుంది. బంగారం సంపాదించడానికి కళావతి అనే నర్తకికి ఆశపెట్టి తనతో తీసుకుపోతాడు. భార్యావిహీనుడైన కీర్తిసేనుని ఆమె వశంచేసుకుని ప్రజలను దోచి ఆ డబ్బు కాలకేతుకి అందజేస్తుంటుంది.

ఆ అక్రమాన్ని అరికట్టాలనుకుంటుంది పద్మావతి. చిలుక రూపాన్నున్న విజయుడు నిండు సభలో తీర్పు చెప్పి కళావతిని అవమానిస్తాడు.

పగతో ఆ చిలుకను తెప్పించి వండి తినాలనుకుంటుంది కళావతి.

శిష్యుడు చనిపోలేదని తెలుసుకున్న కాలకేతు ఆ చిలుకను చంపాలని తీసుకుపోతాడు.

చిలుకలో ఉన్న విజయుడు వారిద్దరినీ తప్పించుకుని కళావతి గుట్టు పురప్రజల మధ్య రట్టు చేసి వారి చేతనే రాజ్యం నుండి బయటకు వెళ్లగొట్టేట్టు చేస్తాడు.

చిలుక విషయంలో కూడా విజయునితో ఓడిపోయి పగతో రగిలిపోతున్న కాలకేతు ఓ రోజు విజయుడు పద్మావతికి తన పరకాయప్రవేశ విద్య చూపిస్తుండగా అతని శరీరంలో ప్రవేశిస్తాడు. గత్యంతరంలేని విజయుడు ఓ భల్లూకం శరీరంలో ప్రవేశిస్తాడు. విజయుని శరీరంలో ఉన్న కాలకేతు, పద్మావతిని చేజిక్కించుకోవాలని చూస్తాడు. భల్లూకం శరీరంలో ఉన్న విజయుడు సమయానికి అక్కడ చేరి తనను తాను నిరూపించుకుని తెలివిగా

నడుచుకోమని పద్మావతికి హెచ్చరిస్తాడు.

ఆ ప్రకారం పద్మావతి ఓ పొట్టేళ్ల పోటీ నిర్వహిస్తుంది. అందులో విజయుని శరీరంలో ఉన్న కాలకేతు పందెం కట్టిన పొట్టేలు చనిపోగానే పద్మావతి రెచ్చగొడుతుంది. పౌరుషంతో కాలకేతు మరణించిన ఆ పొట్టేలు శరీరంలో ప్రవేశించగానే అదనుకోసం ఎదురుచూస్తున్న విజయుడు తన శరీరంలోకి ప్రవేశిస్తాడు.

పద్మావతిని పెళ్లాడబోతుండగా అడ్డుపడ్డ కీర్తిసేనుణ్ణి ద్వంద్వయుద్ధంలో విజయుడు జయించి " మీ ఇష్టాన్ని సంపాదించుకోలేక పోయిన నేనే ఓడిపోయాను" అంటాడు. అతని ధైర్యసాహసాలను, యుద్ధకౌశలాన్ని, సంస్కార హృదయాన్ని గమనించిన కీర్తిసేనుడు వారిరువురి వివాహానికి సమ్మతిస్తాడు. విజయుని సంహరించడానికి ఆఖరి ప్రయత్నంగా అదే సమయంలో ప్రత్యక్షమవుతాడు కాలకేతు. రకరకాల కామరూప విద్యలతో గురువుని ఎదుర్కొని ఓడించి"గురువుని మించిన శిష్యుడు" అని కాలకేతు చేతనే ప్రశంసించబడి పద్మావతిని పరిణయమాడి సుఖంగా ఉంటాడు విజయుడు.

-శుభం-

## నటీనటులు

| | |
|---|---|
| కాంతారావు | రాజనాల |
| ముక్కామల | బాలకృష్ణ |
| సత్యనారాయణ | లంక సత్యం |
| విశ్వనాథం | వేలంగి |
| మద్దాలి | బృందావనచౌదరి |
| కృష్ణయ్య | విశ్వం |
| లక్ష్మయ్య | కృష్ణకుమారి |
| రామకృష్ణ | బేబిసుమ & బాబు |
| బి. దుర్గారావు | రమాదేవి |
| | రాజశ్రీ |
| | నవీన లక్ష్మి |

తదితరులు



బి. విఠలాచార్య



కోదండపాణి



పి.బి. శ్రీనివాస్



సుశీల,



జానకి



మాధవపెద్ది సత్యం



స్వర్ణలత

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు, పాటలు | : జి. కృష్ణమూర్తి, బి.ఎ. |
| కథ | : బి.వి.ఆచార్య |
| సంగీతం | : కోదండపాణి |
| గాయనీగాయకులు | : సుశీల, జానకి, స్వర్ణలత, పి.బి. శ్రీనివాస్, మాధవపెద్ది సత్యం |
| ఛాయాగ్రహణం | : రవికాంత్ |
| కో-డైరెక్టరు | : ఎస్.డి. లాల్ |
| నృత్యం | : చిన్ని, సంపత్ |
| కళ | : బి.సి.బాబు |
| మేకప్ | : భద్రయ్య,నాగేశ్వరరావు, నారాయణ, మాధవయ్య |
| హెయిర్ స్టయిల్సు | : తానారపు భాస్కరరావు |
| దుస్తులు | : కామేశ్వర్రావు, తిలకమణి |
| ఎడిటింగ్ | : కె. గోవిందస్వామి |
| స్టంటుమాస్టర్స్ | : పరమశివం, పులకేసి |
| సాంగ్స్ రికార్డింగ్ | : డి. మోహనసుందరం |
| డైలాగ్ రికార్డింగ్ | : ఎమ్.ఎస్. నాగేశ్వరన్, లాజరస్. |
| ఆపరేటివ్ కెమెరామెన్ | : వెంకటరత్నం, శ్రీకంఠ్,మీనన్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ | : ఎస్.ఆర్. క్రిష్ణయ్యంగార్,నరహరి |
| అసోసియేట్ డైరెక్టర్ | : ఎస్.వి. కృష్ణారావు |
| స్టిల్సు | : ఎమ్. ఆర్. కె. మూర్తి |
| పబ్లిసిటీ | : కె.యన్. సింగు, తారక, గంగాధర్, శ్రీనివాసరావు. |
| ప్రాసెసింగు | : భాస్కర్ |
| ప్రోగ్రామ్స్, ఎక్సిక్యూటివ్స్ | : సీతాపతి, బి.ఎ.కె. రఘునాథ్, పాపయ్య |
| ఎలక్ట్రీషియన్ | : దామోదరన్ |
| మోల్డింగ్ | : పి.కె. సుబ్బరామన్ |
| పెయింటింగ్ | : టి.డి. శామ్యుల్, ఎస్. బాలు. |
| డాన్సింగ్ గుర్రం | : వి.యస్. మహమ్మద్ షరీఫ్, అవణం |
| బళ్ళారి గొట్టెపొట్టేళ్ళు | : ముక్కూరు నరసింహప్ప,పి. తిమ్మప్ప |
| చిలుక | : చవతయ్య |
| పులి మరియు సింహము | : ఆతూర్ గోవిందరాజు సరోజ |
| స్టూడియో | : గోల్డెన్ సినీస్టూడియోస్ |

**సహాయకులు**

| | |
|---|---|
| దర్శకత్వం | : జి. మధురవీరాచారి,డి.ఎన్. ప్రకాశరావు |
| ఎడిటింగ్ | : టి.పి. వేలాయుధం, ఎస్.ఎస్.మహాలింగం |
| ఆర్టు | : వేలాయుధం |
| మేకప్ | : సాంబశివరావు, రాము,అప్పారావు. |
| ప్రొడక్షన్ | : మూర్తి, వెంకట్రావు, షణ్ముగం, పురుషోత్తం క్రిష్ణ, మాణిక్యం. |

**ప్రొడ్యూసర్ & డైరెక్టర్**

**బి. విఠలాచార్య**



శ్రీ వేంకటేశ్వర చిత్ర
COMING...
కల
Dare to dream...
నిర్మాత
వై.రామచంద్రా రెడ్డి
రచన-దర్శకత్వం
చిమ్మని మనోహర్
ధర్మతేజ
వేటూరి సుందరరామమూర్తి, సీతారామశాస్త్రి, సాయిశ్రీహర్ష
కె.శంకర్
రామ్ లక్ష్మణ్
శిష్లా
ఉదయభాస్కర్
యల్.వేణు

